శ్రీ రస్తు

# ఉపోద్ఘాతము



శ్రీ మద్విరాడ్విశ్వకర్మ పుత్రులగు పంచ బ్రహ్మర్షులలో మూడవపుత్రుండగు త్వష్ట్రబ్రహ్మర్షి వంశసంభూతుండును, భద్రదత్త మహర్షికి నీలవేణికి జ్యేష్ఠపుత్రుండునునగు త్వష్ట్రబ్రహ్మర్షి సామవేద ప్రమాణంబు చొప్పున శంకరాచార్యుండై యవతరించి గృహస్థాశ్రమముచే యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ యోగసమాధి నిష్ఠాగరిష్ఠుండై సరస్వతీ పీఠము నిర్మించి యది మొదలుకొని దేవతలకు పౌరోహిత్యము జేయించుచుండె. నిట్లుండ గొన్ని దినంబులకు నాత్వష్టకు విభావసు గల్గిన ద్వితీయపుత్రుండగు విశ్వరూపుండుగూడా దేవతలకు బురోహితము జరిగించియుండె మరియు భారతవర్షీయ అర్వాచీనకోశము, 461 వ పేజీయందు జెప్పబడిన రీతిగ క్రీస్తుశకము, 788, 820, వ సంవత్సరమున జిదంబరపురము నందు సర్వజ్ఞుండను విశ్వబ్రాహ్మణుడు గలండతనికి గామాక్షమ్మ యను నారీరత్నంబుగలదు. ఆదంపతులకు జిదంబరేశ్వరస్వామి వర ప్రసాదముచే (విశిష్ట) యను పుత్రిక గల్గియుండె. నామెను త్వష్ట్ర సంతతియందొకనికిచ్చి వివాహముజేయ గొంతకాలమువఱకు వారికి సంతతి లేనందున నతడు తపస్సు చేయ నరణ్యమునకు బోదలంచెను. అప్పటికి దన భార్య గర్భవతియైయుండ నానాటిరేయి స్వప్నమున సరస్వతి ప్రత్యక్షమై నీకు విశ్వరూపాచార్యుడు కుమారుడు కాబోవుచున్నాడని చెప్ప నాతడు కలనిజముకాదనియెంచి వనమునకేగెను. దిన క్రమమున నామెకు గర్భము స్ఫుటమైనకొలది నితరులామె నవమానింప గడంగిరి. అయినను నావిశిష్టసహనము వహించి యన్యుల ... లనాడక దైవభక్తిసహితముగ నేయుండెను. ఇట్లుండ బసవకాలము ... ముందు పార్వతీ పరమేశ్వరులు బాటసారులగు వృద్ధదంపతులుగా

వచ్చి యాగమెనాదరించి జాతాదికర్మలు పూర్తి చేసి శంకరాచార్యడని నామకరణముచేసి యాశీర్వదించి యంతర్ధానులైరి. అది తెల్సి తండ్రి గృహమునకువచ్చి తపోనిష్ఠతోనుండెను. ఆ బాలుడు సకల విద్యాపరిపూర్ణుండును, నష్టాంగయోగాభ్యాసపటుడున్నై, దక్షిణ దేశమున శృంగగిరియందు సరస్వతీ పీఠము స్థాపించి ఘటనా ఘటన నాగాభరణ నవరత్నసింహాసన ఛత్రచామరాందోళికాది జగద్గురు బిరుదముల వహించి, శ్రీసూక్త, పురుషసూక్త, భూసూక్త, నమక, చమకా ఘోరమంత్రంబులచే పీఠాభిషేకంబునుజేసి పూజించి యందుండుసకల జనంబులకు జ్ఞానోపదేశంబుజేసి వారలకు వర్ణాశ్రమ ధర్మముల ప్రకారము గురుతీర్థ ప్రసాదాశీర్వచనము లొసంగి యది మొదలుకొని సమస్తదేశ సంచారము చేయుచు జగద్గురువై యుండెను. క్రీస్తుశకమునకు పూర్వము (600) సంవత్సరముల క్రిందట దక్షిణ కావేరీ తీరంబున ఫణీంద్ర పట్టణంబుగలదు. అది విశ్వకర్మ వంశాం తర్గతసూర్య వంశోద్భవుండైన సారిన్ పరిమళచోళ మహారాజు తన గురునివలన జ్ఞానోపదేశంబునొంది శివభక్తాగ్రగణ్యుండై షుమారు (30) సంవత్సరముల ప్రాయమున బట్టాభిషిక్తుండై యది మొదలు కొని సుభిక్షంబుగ రాజ్యాధిపత్యమొనర్చుచుండ నొకదివసంబున వ్యాసుండేతెంచి తన భారతాద్యష్టాదశ పురాణకట్టుకథలు చదివి బోధించి మీ విశ్వబ్రహ్మ గురుపీఠమును దీసివైచి మా పీఠమును బూజింపుమనిన నతండు సమ్మతింపకుండిన పిమ్మట క్రీస్తుశకమునకు బూర్వము, 600 సంవత్సరములకు విశ్వకర్మ వంశస్థుల వారిచే మహంతీ నగరము నయసాంత దుర్గ సహితముగ నిర్మింపబడి యుండెను. దానికి మాంద యనియు మందోటి నగరమనియు, రెండుప నామంబులు గల్గియుండె. నందు విశ్వకర్మ వంశీయులు శిల్ప విద్యా నిపుణత్వములచే నివసించి వారిలో నొకరు ప్రభువుగానుండి సమస్త వైభవములతో బ్రకాశించుచుండిరి. అప్పుడా వ్యాసునకు మత ద్వేషంబు

వలన దుర్బుద్ధికలిగి వారల నిర్మూలనముచేయుటకు భద్రగిరిపట్టణమేలు భర్తృహరిరాజు సహాయమున ధన రథగజ తురగపదాతులతో బయలుదేరి యా కోటను ముట్టడించిరి. అప్పుడావిశ్వబ్రాహ్మణులు పగలు సూర్యకాంతము, రాత్రి చంద్రకాంతము, చూపించుచువచ్చిన శత్రుబలము నధోగతిచేసి సాధ్యపడకుండిన పిమ్మట బరిమళచోళమహారాజు వార్థకత్వంబున దన సహోదరుండైన షణ్ముబలిచోళమహా భూపాలునకు బట్టాభిషేకంబు గావించి తీర్థయాత్రలు సేవించి స్వర్గగతుండయ్యె. ననంతరం బాషణ్ముబలి చోళమహా భూవరుండుగూడా పూర్వాచారముదప్పక సురక్షితముగ రాజ్యమేలు కాలంబున మఱల వ్యాసుండేతెంచి యాశ్రయించిన నతండును మునుపటి రాజువలెనే చెప్పియుండె. నంత షణ్ముబలిచోళ మహారాజు గురువాజ్ఞ ప్రకారము దన పుత్రుండైన పాలనచోళుని యువరాజుగా నియమించి తాను రాజ్యమేలుచుండె. నాకాలంబున వ్యాసుని దుర్బోధవలన గళింగుండు తన పినతండ్రియగు షణ్ముబలిచోళమహారాజును సంహరించి యతండు బట్టాభిషిక్తుండైయుండి వ్యాసుని గురువుగా నియమించుకొని మూల గురుపీఠము నిరసింప వారలైదువత్సరంబులవఱకు బంచకృత్యములు చేయకమాని నందున రయితులకు మహాకష్టములు సంభవించి యా పురంబునకు దుర్భిక్షాది సకలక్షీణంబులు సంభవించియుండె. నది సమీప రాజ్యాధిపతియగు జయవీర రాజెరింగి యాఘణీంద్రపురంబున కాగతుండై తనచేతి యాయుధంబున నాకళింగుని సంహరించి మఱలవ్యాసుని జంపబూన నతండు కాశీదేశంబునకు బారిపోయె. నంత షణ్ముబలిచోళమహారాజు కుమారుండైన పాలనచోళమహా విభునకు బట్టాభిషేకమహోత్సవంబు గావించి మునుపటి విశ్వబ్రహ్మ వంశపీఠస్థుల నాచార్యులుగానుంచి తన పురంబున కరిగెనంత, నాపాలనచోళాధిపుండు సుభిక్షంబుగ గొంతకాలము రాజ్యాధిపత్యము జేసి నశించియుండెను. పిమ్మట విజయచోళ మహారాజు మొదలగు

వారలు రాజ్యపరిపాలనము జేసి యంతరించియుండిరి. అటుతరువాత క్రీస్తుశకము, 200 సంవత్సరములకు గరికాలచోళ మహీపాలుడు ఫణీంద్రపురమునకు గరవీర పట్టణమను ప్రతినామ మేర్పరచియందు న్యాయ ప్రవర్తకుడై సుఖంబుగ గొన్ని దినంబులు బరిపాలించి యతండును బరలోకంబును జెందియుండె నంతట నన్నెచోళుడు మొదలగు వారలు తత్పురము ధర్మపరిపాలనంబు జేసి స్వర్గగతులై యుండిరి క్రీస్తుశకము, 350, సంవత్సరములకు నతని వంశమున గడపటి పురుషుండగు మరియొక పాలన చోళమహారాజు సుముహూర్తంబున బట్టాభిషిక్తుండై రాజ్యాధిపత్యమొనర్చుచుండ నమరుడొక్క దివసంబున బాలనచోళమహాప్రభుస్థానంబున కేతెంచి యతనికిగొన్ని విషయంబుల బోధించి యచ్చట మంత్రిగా నివసించి యుండెను ఆపాలన చోళమహారాజవసుండుపై జెప్పినపరిమళాదులుగూడి మొత్తను క్రీస్తు శకమునకుబూర్వము, 600, సంవత్సరములు మొదలుకొని క్రీస్తుశకము, 1400, సంవత్సరములవరకు సౌకర్యంబుగ రాజ్యపరిపాలనము జేసి యంతరించిరి. ఆది శంకరాచార్యస్వాములవారాత్రేయ పౌరుషేయ బ్రాహ్మణుల యోగ్యత విమర్శింపదలచి యొకనాడు కోనేటియొద్దనుండి విశ్వబ్రాహ్మణ యువకులజూచి యయ్యలారా! నా పాదుకలు గృహమందున్నవి, తీసికొని రండని చెప్ప వారలు (జాతక లోపము కలదని) సంశయించి యాపాదుకలు తమ పదములకు దొడిగి కొని వచ్చిరి. మఱియొకనాడిట్లే యాత్రేయబాలకులకు జెప్పగా వార మితభక్తితో శిరమున నిడికొని వచ్చిరి. ఈ యుభయుల యోగ్యత గ్రహించి తనవంశీయులైనను జ్ఞానశూన్యులగుటచే ననర్హులనియు, బరవంశీయులైనను జ్ఞానయుక్తులగుటచే నర్హులనియు, నిశ్చయించి పీఠమును వారిస్వాధీనముచేసెను. అందుకు వారలు సంతసించి స్వామీ! ఎంతకాలము మాయొద్దనుండునని ప్రశ్నింప గలియుగము, 5000 వఱకని యానతీయ పౌరుషేయులందఱకేకీభవించి ఖేదముజెంది యా

స్వాములవారి పదసన్నిధిజేరి మహానుభావా! మాతప్పు క్షమించి యీ పీఠము మా కొసంగుడని ప్రార్థింప విశ్వకర్మవంశమున వీరభోగ వసంతాచార్యస్వాములవారు జన్మించి స్వాధీనపఱచికొందురు. అంతటనుంచి వీరు పూజింప బడుదురని చెప్పెను. సరస్వతీపీఠముస్థాపించినది మొదలు పౌరుషేయ బ్రాహ్మణులు, 59, మంది పీఠాధిపత్యమొనర్చియుండిరి. ఆత్రేయబ్రాహ్మణు లిప్పటికి (24) గురు పీఠాధ్యక్షులై యున్నారు. బొంబాయికి సమీపంబున ధార్వాడయను పట్టణంబునందొక దేవాలయంబుగలదు. అందుండు శాసనముపై వ్రాయబడిన ప్రకారము కలియుగారంభము. 3179 వ సంవత్సరమనియును, నాకాలమందు బరీక్షిన్మహారాజుకూడా జన్మించియుండెననియును, మైసూరు దేవాలయమునందుండు శాసనముపైగూడా యిట్లే వ్రాయబడియున్నదనియును, విశ్వబ్రాహ్మణ కులోత్సాహమను గ్రంథమునందు స్పష్టీకరింపబడియుండె. గనుక ననేక గ్రంథములుండుటకంటె నీగ్రంథ మొక్కటియుండిన పక్షమున ననేకమంది విద్వాంసులకుసమాధానము చెప్పగల్గుదురు.

ఇట్లు

గ్రంథం 1929

వెలుగులోనికి తెచ్చినవారు

బ్ర॥శ్రీ గోనుగుంట్ల వీరబ్రహ్మాచార్యులు

పెదపాలెం

## హెచ్చరిక

ఆర్యులారా ! పరిమళచోళచరిత్రమను ఈ మహాగ్రంథము, అనుమునిగిరి బిళాంతరనివాసులు జగద్గురు శివరామ బ్రహ్మేంద్ర స్వాములవారు వ్రాసిన తాళపత్ర గ్రంథమునుండి సేకరించి గోనుగుంట్ల వీరబ్రహ్మాచార్యులువారు అచ్చువేయించియుండిరి. తర్వాత ప్రతులు లభ్యముకానందున, తుమపాల విజయశేఖరరావు కోరగా వారికి మా మఠము తరపున ఈ గ్రంథ ముద్రణము చేసుకొనుటకు సర్వాధికారములు నీయడమైనది. గానముముక్షువులు ఈ గ్రంథమును చదివి సత్యాసత్యముల నరయగలరు.

ఇట్లు

అనుమునిగిరి మఠాధిపతులు

శ్రీ రామదుగు గురుబ్రహ్మేంద్రస్వాములవారు

అనుమునిగిరిక్షేత్రం

వయా పామూరు, కనిగిరి తాలూకా

ప్రకాశంజిల్లా.

# విషయ సూచిక

## ప్రథమాశ్వాసము

ద్వితీయాశ్వాసము.

పుట

చతుర్థాశ్వాసము

పంచమాశ్వాసము

— 0 —

## ప్రణవ పంచాక్షరి స్తోత్రము

శ్లో॥ ఓంకారం స్వస్వరూపేషు-పంచవక్త్రింగుణత్రయం।
సర్వలోకోద్భవమ్ శాంతమ్ - తస్మైః ఓంకారాయనమశ్శివాయ।
(శ్రీ మదాది శక్తి సమేత విరాట్ బ్రహ్మణేనమః॥)
నకారమ్ జగదాధారమ్- నాగభూషణ సంయుతమ్।
సద్యోజాతోద్భవమ్ దేవమ్ - తస్మైః నకారాయనమశ్శివాయ॥
(శ్రీమదాది శక్తి సమేతమను బ్రహ్మర్షి స్వరూపా
భ్యాం ఉమామహేశ్వరాభ్యాం నమః)
మకారమ్ జీవకారుణ్యమ్-సర్వవస్తు సముద్ధరేత్ ।
వామదేవోద్భవమ్ దివ్యమ్ - తస్మైః మకారాయ నమశ్శివాయ॥
శ్రీ పరాశక్తిమయ బ్రహ్మర్షి స్వరూపాభ్యాం
లక్ష్మీనారాయణాభ్యాంనమః
శికారమనలం దేవమ్-సర్వవస్తు సభక్షణమ్।
అఘోరవదనం జాతమ్-తస్మైః శికారాయ నమశ్శివాయ॥
శ్రీ యిచ్ఛాశక్తి సమేత త్వష్ట బ్రహ్మర్షి స్వరూపా
భ్యాం వాణీహిరణ్యగర్భాభ్యాంనమః
వకారమ్ వ్యాపకమ్ యోగమ్-వ్యాఘ్ర చర్మోత్తరీయకం।
తత్పురుష ముఖజాతస్య-తస్మైః వకారాయ నమశ్శివాయ
శ్రీ క్రియా శక్తి సమేత శిల్పి బ్రహ్మర్షి స్వరూపా
భ్యాం శచీపురందరాభ్యాం నమః
యకారమ్ అంతరిక్షంచ-సర్వవ్యాపి సదాశివమ్।
ఈశానవదనం జాతమ్-తస్మైః యకారాయ నమశ్శివాయ॥
శ్రీ జ్ఞానశక్తిసమేత విశ్వజ్ఞ బ్రహ్మర్షి స్వరూపాభ్యాం
సంజ్ఞాభాస్కరాభ్యాంనమః
పంచాక్షరమిదంధ్యాయే-సర్వకామార్థ సిద్ధిదమ్।
త్రిజన్మం పాప పరిహారం శివజీవైక్యకారణమ్॥

శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః

మహావేదాంత గురుశిష్యసంవాదంబను

# పరిమళచోళచరిత్రము

## ప్రథమాశ్వాసము

### ప్రారంభము

ఇష్టదేవతా ప్రార్థన

శ్లో॥ చక్రం శూల గదాభయం శుభకరం హ్యాల్లేఖ నిర్దక్షిణే
శంఖం ధక్కి కమండలంచ వరదం వామేకరం పుస్తకం
బ్రహ్మావిష్ణుమహేశ్వరార్చిత పదం మేరోగ్ర భాగంస్థితం
పంచాస్యరవికోటి తేజవపుషం శ్రీవిశ్వనాథం భజే॥

ఇట్లు, భైరవాద్రి శేషబుషీంద్రుడు ఇష్టదేవతా ప్రార్థనంబు జేసి శివరామా అవధరింపుమని చెప్పుచున్నాడు అంత శివరామగురుడీ విధముగా ప్రశ్న జేయుచున్నాడు.

క॥ పరిమళచోళనృపాలుని
చరితము వివరించియిపుడు। సంతస మొప్పన్
గురువర రచియించుమునది
స్థిరమతిచే జదివి నరులు। దెలసికొనుటకున్॥

వ॥ ఇవ్విధంబున అనుమునిగిరి శివరామగురుడు ప్రశ్న చేయుటచే ఇష్టదేవతాభివందనంబు గావించి రాజధీరమునో విరాజితము భారత వర్షీయ అర్వాచీనకోశము విశ్వకర్మ విశ్వబ్రహ్మకులోత్తాసహ పురా

ణనిరీక్షణము చిత్తూరుజిల్లాతీర్పు సేలంజిల్లాతీర్పు బందరుజిల్లాతీర్పు గుంటూరుజిల్లాతీర్పు మనుసూత్రము మనుస్మృతి వేమనపద్యములు కాలజ్ఞానము ఆత్మబోధామృతము సనారీవిశ్వేశ్వరసంవాదము సదానందయోగి శతకము వాసుదేవమననము మూలస్తంభము అమరకోశము ధ్యానబిందూపనిషత్ గోపాలతాపిన్యుపనిషత్ కఠోపనిషత్ దేవబ్రాహ్మణమహాత్మ్యము కృష్ణయజుర్వేదము ఋగ్వేదము శ్రీమహాభాగతము అథర్వణవేదము విద్యారణ్యభాష్యము నిరుక్తవ్యాకరణము విష్ణురహస్యము సదాచారవిచారము తైత్తిరీయబ్రాహ్మణము విష్ణుసహస్రనామము నానార్థరత్నమాల పాణినీసూత్రము సిద్ధాన్తకౌముది కాశికావృత్తి ఆపస్తంబశ్రౌతసూత్రములు రుద్రదత్తవ్యాఖ్యానము ధూర్తస్వామిభాష్యము విశ్వనిఘంటువు మీమాంస అధికారాధికరణము బ్రాహ్మణోత్పత్తిమార్తాండము ఐతరేయబ్రాహ్మణము యాజ్ఞవల్క్యస్మృతి ఔశనస్మృతి శ్రీమహాభాగవతము విశ్వబ్రహ్మోపనిషత్ హనుమచ్ఛిల్పశాస్త్రము విశ్వకర్మరత్నమాల వజ్రసూచికోపనిషత్ శంకరవిజయము విశ్వకర్మశాస్త్రము నాగరఖండము ముండకోపనిషత్ చాటుపద్యమణిమంజరి గార్గేయశిల్పశాస్త్రము ఆంధ్రదీపిక కరిణీకోద్ధారిణి పద్మపురాణము స్కాందపురాణము విష్ణుపురాణము వాయుపురాణము శివపురాణము వరాహపురాణము మత్స్యపురాణము లింగపురాణముమార్కండేయపురాణము బ్రహ్మాండపురాణము మొదలగు డెబ్బది గ్రంథంబుల బరిశోధనచేసి యందలి విషయంబులగొన్ని క్రోడీకరించి నాయొనర్పంబూనిన మహావేదాంత గురుశిష్య సంవాదంబను పరిమళచోళచరిత్రంబునకు గధావిధానం బెట్టిదనిన సుకవినిందనము గ్రంథకర్త వంశానుక్రమణిక పూర్వవర్ణనము పరిమళాది చోళచరిత్రములు వ్యాసప్రోక్తోపసవ్యాది గ్రంథసముదాయ విమర్శనము మొదలగు సమస్తమును గూర్చి యాశ్వేరుండు షణ్ముఖునకుఁ జెప్పిన ప్రకారంబున దేశికుండిట్లు చెప్పఁదొడంగె.

# ప్రథమాశ్వాసము

## పురవర్ణనము

సీ॥ రుచిర సాలములచే । రుచి రసాలములచే
గమలాధివసతిచే । గ్రాలి గ్రాలి
సుమనశ్చయంబుచే । సుమనశ్చయంబుచే
సారంగ తతులచే । దీరితీరి
సద్విజావళులచే । సద్విజావళులచే
సరసగణంబుచే । వరలివరలి
సురుచి రమణులచే । సురుచిర మణులచే
వర్ణాధికములచే । ప్రబలిప్రబలి ॥

తే॥ గీ॥ యనిశసంతానవరుసల । నతిశయించి
పురియు నుద్యాన మొకటిగ । భూరిమహిమ
నలరి నందనసంయుత । మగుచునమ్మ
హేంద్రనగరిమించు ఫ । ణీంద్రపురము ॥

వ॥ ఇట్లు మహాసౌందర్యంబుచే ఫణీంద్రపట్టణంబు ప్రకాశించి యుండెనంత.

క॥ ఆపురమున ననిశంబుగ్ర
హాపరతంత్రుండుభాను । వంశాబ్ధివిధుం
డా పరిమళచోళాభిధ
భూపతి భవ్యముగజనుల । బ్రోచుచునుండెన్ ॥

తా॥ ఆపురంబున కధినాధుండగు పరిమళచోళ మహానృపవరుండు సుభిక్షంబుగ ప్రజల బరిపాలనము చేయుచుండి యొకదినంబున దనగురునకు నమస్కరించి యిట్లనియె.

### రాజు జ్ఞానమార్గంబునడుగుట

శేషఋషీంద్రుడు శివరామగురునకు భోధించిన బ్రహ్మవిద్య దెల్పుట

తే.గీ॥ కర్మమునబుట్టిజంతువు । కర్మవలన
బెరుగుచు నశించుచుండె నీ । ధరణియందు

మఱియు నాజన్మరాహిత్య । మార్గములను
సరగ నెరిగింపుమాచార్య । సంతసముస॥

తా॥ స్వామీ! ప్రపంచంబున సర్వప్రాణులు కర్మవలన జనించి కర్మవలన మరణించుచు నబ్ధితరంగములవలె నెడతెగకుండుట విస్పష్టమైయున్నది కనుక నేను బునర్జన్మరహితుండనగుటకు మోక్షమార్గము వినవలయునని కుతూహలుండనై యుంటి నదిదెల్పుము.

గురువు జ్ఞానమార్గంబు దెల్పుట

శ్లో॥ ప్రథమం బ్రహ్మచర్యంతు । గార్హస్థ్యంచద్వితీయకం।
వానప్రస్థంతృతీయంచ । సన్యాసంచ చతుర్థకం॥

తా॥ బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము, సన్యాసము, అను నాలుగు విధంబులైన యాశ్రమంబులు గలిగియుండె గనుక వారలు ముక్తిజెందుటకు జేయవలసిన సాధనచతుష్టయము నెరింగించెదవినుము.

సాధనచతుష్టయ వివరము

శ్లో॥ నత్వా వేదాంతవేద్యం తం । నిర్గుణం నిత్య మవ్యయం।
చతుష్టయస్య సంపత్తిం । సాధనానాం వదామ్యహం ॥

శ్లో॥ నిత్యానిత్యవివేకశ్చ । ఫలభోగే విరాగతః।
ఐహికాముష్మికానార్థే । తేషాం కర్మాణి యానిచ॥

శ్లో॥ శమాదిషట్కసంపత్తి । ర్ముముక్షుత్వం తథైవచ।
సత్యే చతుర్ణామేతేషా । మగ్రే లక్షణ మాదరాత్॥

తా॥ నిత్యానిత్యవివేకమనియు, నిహమూత్రార్థఫలభోగవిరాగ మనియు, శమాదిషట్కసంపత్తియనియు, ముముక్షుత్వమనియు, నాలుగు విధంబులుగలవు. కనుక నిత్యానిత్యవివేకలక్షణం బెరింగించెదవినుము.

నిత్యానిత్య వివేకలక్షణము

శ్లో॥ నిత్యంస్యాద్బ్రహ్మచానిత్యం । జగద్యదితిగద్యతే।
నిత్యానిత్యవివేకస్య । చిహ్నమేత దితీర్యతే॥

తా॥ బ్రహ్మనిత్యము జగత్తుమిథ్యయని తెలియుట కనుక నిహాముత్రార్థ ఫలభోగ విరాగలక్షణం బెరింగించెద వినుము.

### ఇహాముత్రార్థ ఫలభోగ విరాగలక్షణము

శ్లో॥ ఇహలోకే భవంత్యాసీ । దైహికం తత్సుఖం యతః।
శబ్దాదే ద్విరతి స్తస్మా । దిహభోగే విరాగతా ॥

శ్లో॥ అముత్ర భోగవిరతి । రాముష్మికఫలే ఽ స్పృహా।
ఐహికాముష్మికఫలే । ఽ భోగోపరతి రుచ్యతే॥

తా॥ ఇహలోకంబున వనితాదిభోగంబులయందును బరలోకంబున రంభాది భోగంబులయందును బ్రీతిలేకుండుట కనుక శమాదిషట్క సంపత్తిలక్షణం బెరింగించెద వినుము.

### శమాదిషట్క సంపత్తిలక్షణము

శ్లో॥ శమోదమశ్చోపరతి । స్తితిక్షాచనియు క్తతా
శ్రద్ధశమాదిషట్కస్య । ప్రాహుర్నామానినిత్యశః॥

తా॥ శమము దమము ఉపరతి తితిక్ష సమాధానము శ్రద్ధయని యాఱువిధంబులుగలవు. కనుక శమదమములయొక్క లక్షణం బెరింగించెద వినుము.

### శమదమములయొక్క లక్షణము

శ్లో॥ బాహ్యేంద్రియాణాం యోరోధ । శ్శమఇత్యభిధీయతే।
అంతరింద్రియరోధస్తు । దమశ్శబ్దేనచోచ్యతే॥

తా॥ విషయాదులవలన జిక్కిన మనస్సును ద్రిప్పినిలకడగా నుంచుటయే శమముయొక్క లక్షణము జ్ఞానేంద్రియము కర్మేంద్రియము లజ్ఞానమున బోవుచుండెనేనిజ్ఞానమునందు నిలకడగా మనస్సు నిల్పుటయే దమముయొక్క లక్షణము కనుక నుపరతిలక్షణం బెరింగించెద వినుము.

### ఉపరతి లక్షణము

శ్లో॥ త్యక్త్వాకర్మఫలంసర్వం । కరణంయద్ధికర్మణాం।
తదేవోపరతిర్నామ । కర్మయోగవిభావితం॥

తా॥ విహితమైనకర్మాదులను విధ్యుక్తముగా విడచియుండుట కనుక తితిక్ష లక్షణం బెరింగించెదవినుము.

తితిక్షలక్షణము

శ్లో॥ అనాదికర్మణారబ్ధ । వాసనాజనితశ్రమం ।
భుంజీతసహతేయస్తు । సతితిక్షాయుతస్స్మృతః॥

తా॥ సంచితప్రారబ్ధవశమైన కష్టముల కితరులపైనింద మోపక సహించియుండుట కనుక సమాధానలక్షణం బెరింగించెదవినుము.

సమాధాన లక్షణము

శ్లో॥ గురుబోధమను స్మృత్య । స్థిరత్విర్ణియత వతః।
మనోనిశ్చయతేయస్తు । సమాధానేతివిశ్రుతః॥

తా॥ వేదాంతగురుబోధ వినుటకు స్థిరముగానుండని బుద్ధిని త్రిప్పినిలకడగ నుంచుటయే కనుక శ్రద్ధలక్షణం బెరింగించెదవినుము.

శ్రద్ధ లక్షణము

శ్లో॥ గురౌచమాతాపితరి । భగవత్యవ్యయేసమే ।
ప్రీతింప్రకురుతేయస్తు । శ్రద్ధావాన్ కథ్యతేబుధైః॥

తా॥ గురునియందును భగవంతునియందును మాతాపితృలయందును ప్రీతి గలిగియుండుటయే కనుక ముముక్షుత్వలక్షణం బెరింగించెదవినుము.

ముముక్షుత్వ లక్షణము

శ్లో॥ గురోస్సంప్రాప్యవిజ్ఞాన । మకుతోభయమిచ్ఛుభిః।
ముచ్యంతే సర్వపాపాభ్యో । ముముక్షోర్లక్షణాద్యతః॥

తా। నిశ్చయమనస్కుండై గురునివలన మోక్షమును బొందియుండుటయును నీనాలుగువిధంబు లొక్కొక్కరే సాధింపవలయు గనుక బ్రహ్మచర్య విధి నెరింగించెదవినుము.

## బ్రహ్మచర్యలక్షణము

### మనుసూత్రము

శ్రుతి॥ స్నానసంధ్యా వందనాగ్ని కార్య వేదవ్రత భిక్షాచర్యాకుశ
కౌపీనదండ ధారయేదిత్యుక్తం బ్రహ్మచర్యం ॥

తా॥ నిత్యస్నానము భస్మధారణము సంధ్యావందనము నగ్నికార్యము వేద భిక్ష కుశ కౌపీనము దండముల ధరించుటయునుగలిగి గాయత్రీ మంత్రోపదేశమును గురునివలన బొందబడిన బ్రహ్మచారి మరణాంతమున బరబ్రహ్మముండెడి స్వర్గ లోకంబున నుండును. ఇదియే సాలోక్యపదవి కనుకగార్హస్థ్యము నెరింగించెదవినుము,

## గృహస్థుని లక్షణము

### మనుసూత్రము

శ్రుతి॥ షోడశసంస్కారాధికార కర్తవ్యమిత్యుక్తవ్రతంగార్హస్థ్యం ॥

తా॥ జాతకర్మాది పదునారుకర్మలయొక్క యధికారమును బొందుటయేగాక మరియు

శ్లో॥ స్నానం సంధ్యాజపంహోమం । దేవతానాంచపూజనం ।
అతిథ్యం వైశ్వదేవంచ । షట్కర్మాణి దినేదినే ॥

తా॥ నిత్యస్నానము భస్మధారణము సంధ్యావందనము జపము హోమము దేవపూజ మొదలగునవి చేయుచున్న గృహస్థుడు స్వర్గలోకంబున బరబ్రహ్మము యొక్క సముఖంబులేకయే మఱియొక ప్రదేశంబున నతని సమీపమునందుండి సమ సభోగంబులనుభవించును. ఇదియే సామీప్యపదవి కనుక వానప్రస్థము నెరింగించెద వినుము.

## వానప్రస్థుని లక్షణము

### ధర్మశాస్త్రము

శ్లో॥ భార్యాంపుత్రేషునిక్షిప్య । వనంగచ్ఛేత్ సహైవనా ॥

తా॥ గృహస్థుడు తన కేబదిసంవత్సరంబులు గడచినపిమ్మట దనపుత్రు నకు బుత్రుండుగల్గినతరువాతనైనను బౌత్రుండుగల్గకుండినను భార్యయొక్క యధి

ప్రాయముననుసరించి గృహమందు భార్యను బుత్రులును విడచియైనను లేక పుత్రులనువిడచి భార్యను వెంటబెట్టుకొనియైనను వనమునందుజేరి యందిరువదైదువత్సరములుండి స్నానము భస్మధారణము నిరతాగ్నిహోత్రము కందమూలఫలములు భుజించి యిరువురు వ్రతాచారమున వర్తించుటయును దత్వమస్యాది మహావాక్యార్థానుభవముగురునిచే బొందబడినవానప్రస్థుం డంతమున స్వర్గలోకంబున బరబ్రహ్మమువంటి రూపముగలిగి యచ్చటనుండి సమస్తభోగంబు లనుభవించును. ఇదియే సారూప్య పదవి కనుక సన్న్యాసివ్రతమెఱింగించెద వినుము.

### సన్న్యాసిలక్షణము

### మనుసూత్రము

శ్రుతి॥ యోవేదాదౌస్వరఃప్రోక్తో । వేదాంతేచప్రతిష్ఠితః ।
తస్యప్రకృతిలీనస్య । యఃపరస్య మహేశ్వరః॥

తా॥ నిత్యస్నానము భస్మధారణము ప్రణవవేదవిధి దప్పకుండ తత్వభేదంబుల కర్మదుష్కర్మముల త్రయంబుల దొలగించి పాశబంధంబుల దొసగులడెంచి పంచేంద్రియంబుల నిగ్రహించి దేహాభిమానమువిడచి యంటుసలేని శుద్ధచైతన్యమై నామరూపములులేక తానుదానైయున్న సన్న్యాసి యంతమున స్వర్గలోకంబున బరబ్రహ్మమునందైక్యమై పునర్జన్మరహితుండగును. ఇదియే సాయుజ్యపదవి కనుక వారు భస్మముధరించు క్రమం బెఱింగించెద వినుము.

### భస్మధారణవిధి

### మనుసూత్రము

శ్రుతి॥ ధార్యంభస్మం త్రిసంధ్యంతు । గృహిణాం జలసంయుతం।
సర్వకాలే భవే త్త్రీణాం। యతీనాం జలవర్జితం॥

తా॥ బ్రహ్మచారి గృహస్థుండు మూడుకాలములయందు జలయుక్తమైన భస్మమును ధరించవలయును. యతీశ్వరుండు మొదలగువార లెల్లప్పుడు జలవర్జితమైన భస్మమును ధరించవలయును గనుక ద్వాదశాబ్దంబులు శిష్యవర్గంబుజేసి చతురాశ్రమములయం దెక్కువ శ్రేష్ఠంబైన యత్యాశ్రమంబుననుండి యింద్రియనిగ్రహత్వంబున సాధించువారలకు జీవన్ముక్తి గలుగునని పూర్వీకులు చెప్పియున్నందున గొందఱుపెద్ద లని మార్పుజేసియుండి రదియెట్లనిన.

## వేమనపద్యములు

ఆ॥ వె॥ సెట్టివానికైన । వేషధారికైన
రోగికైనబరమ । యోగికైన
స్త్రీలజూచినపుడె । చిత్తంబురంజిల్లు
విశ్వదాభిరామ । వినురవేమ

తా॥ సెట్టివారలకు వేషధారులకు వ్యాధిగ్రస్తులకు యోగులకు సయితమొకానొక సమయంబున స్త్రీలజూచినప్పుడు మనస్సు చలించియుండుట నిశ్చయంబని తలంచి.

ఆ॥ వె॥ కామిగానివాడు । కవిగాడు రవిగాడు
కామిగాక మోక్ష । గామిగాడు
కామియైనవాడు । కవియగు రవియగు
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా। ఇట్లు వేమనయోగి బాల్యమునం దొక్క వేశ్యాంగన వలన సమస్త కామోపభోగంబు లనుభవించి యటుపిమ్మట బ్రహ్మవిద్యనుసాధించి యదిమొదలుకొని గృహస్థాశ్రమంబునవలంబించి యందువలన జీవన్ముక్తుండయ్యె నని చెప్పబడుచుండె గనుక మరియు నెరింగించెద వినుము.

క॥ శ్రీరాజయోగవిద్యా
ధారీణున కబ్బుగాక । పరమసుఖంబీ
ధారుణివే లెవ్వరికిక
గూరిచు జేకూరదెపుడు । కుదురుగ వేమా॥

తా॥ ఈప్రపంచమందు గురునిచే బరమాత్మను దెలియ నేరక ననేకపాట్లు పడినప్పటికిని మహాకష్టములతో ననేకమలగుజపము తపము మొదలగు శరీరబాధకరమైన పనులుజేసినప్పటికిని మోక్షసుఖము కలుగనేరదు అట్టిమోక్షసుఖము రాజయోగికి సిద్ధించునని చెప్పియుండిరి కావున గృహస్థాశ్రమంబైన రాజయోగంబు స్వీకరించియందు సర్వజనులు కామోపభోగము లనుభవించుచు గురునకు బదివేలు వందనంబులు చేసి జ్ఞానంబును బొంది యందువలన నొకటి దైవభక్తియు రెండు

కాంతము మూడుశత్రువులయందునుపేక్షయు నాలుగుసర్వభూతదయాశత్వము నైదు ధర్మాది గుణంబులచే సంచరించువారలకు నిహపరసౌఖ్యంబులు గల్గియుండును.

రాజు జ్ఞానోపదేశంబునడుగుట

మ॥ సొరిదిన్ ద్వాదశవత్సరంబులును శు।శ్రూషల్ దగన్ జేయగన్
దిరమే బుద్బుదప్రాయమై తనరు నీ। దేహంబు వీక్షింపగన్
సరవిన్ ద్వాదశవందనంబు లిపుడున్ । సత్యంబుగా జేయుదున్
గురుమూర్తీ! కరుణాప్రపూర్ణమున నా।కున్ దెల్పు సుజ్ఞానమున్॥

తా॥ స్వామీ! నేనత్యంతముగా బదిరెండేండ్లు పరిచర్యలొనరించుట కీతనువు క్షణభంగురమైనది కాన భవదీయపాదసరసీరుహంబులకు బదిరెండు నమస్కారంబు లర్పించెద నాయందనుగ్రహముగల్గి సుజ్ఞానమును బోధించుము.

సం॥ వ॥ అని యిట్లుశిష్యుండు బల్క విని సంతసించి సర్వ మెరింగిన శ్రీసద్గురుం డొక్కశుభదినంబున నిష్ఠాగరిష్ఠుండై నవరత్న పీఠంబున బూర్వాభిముఖుండుగ నాసీనుండై శిష్యునివలన షోడశోపచారవిధులం బాదపూజయు బదిరెండు వందనంబులను బొంది తగు నడవడిక చెప్ప నుపక్రమించె నది యెట్టిదనిన.

గురువు శిష్యునకు నడవడిక చెప్పుట

క॥ వినుశిష్య! లోకవిద్యకు
ఘనతరముగ నాల్గు మెట్లు । గల వారితిన్
జనువుగ సుజ్ఞానంబున
కును గల్గెను నాల్గు మెట్లు । గూఢము తోడన్

తా॥ ఓరిశిష్యా! లోకచదువునకు నాలుగుమెట్లుగలవు. అటువలెనే జ్ఞాన చదువునకు నాలుగుమెట్లుగలిగియుండె గనుక లోకచదువునకు నాల్గుమెట్లు జెప్పెద నాకర్ణింపుము.

క॥ మొదలోనమాలు దిద్దుట
ముదమున గుణితంబు నిడుట । పుస్తకమును దా
జదువుట యర్థముదెలియుట
సదమల మీనాల్గు మెట్లు । జగతిచదువుకున్॥

తా॥ ౧ ఓనమాలుదిద్దుట ౨ గుణింతముబెట్టుట ౩ పుస్తకము జదువుట ౪ అర్థమెరింగి చాలించుట కాబట్టి జ్ఞానచదువునకు నాల్గుమెట్లు వివరించెద వినుము.

తే॥గీ॥ మొదట తారకయోగంబు । పిదపసాంఖ్య
యోగవృద్ధియు నమనస్క । యోగము పరి
పూర్ణ మెరిఁగియు బంధవి । ముక్తుఁ డగుట
దలప నాలుగు మెట్లు వే । దాంతమునకు॥

తా॥ మొదట తారకంబును బొందుటయు, పిమ్మట సాంఖ్యవృద్ధిని విచారించుటయు, దరువాత సాంఖ్యలయంబై నిలచిన తత్వంబే యమనస్కంబని యెరుంగుటయు, నాపైన బరిపూర్ణంబు గ్రహించి పంచబంధ విముక్తుండగుటయే జన్మరాహిత్యంబు కనుక దారకం బెరింగించెదవినుము.

## తారకయోగలక్షణము

సీ॥ ఆత్మయందున గురు । ధ్యానంబు గావించి
పంచాక్షరిని బఠి । యించి నీదు
శిరమున దక్షిణ । కరము నుంచియు నీకు
హస్తమస్తకయోగ । మనుచు దెల్పి
పాపపుణ్యంబుల । వ్రాయు బ్రహ్మణ వ్రాత
బోగొట్ట నొసటను । భూతి బూసి
నాలుకమీద సు । జ్ఞాన బీజంబుల
నాటించి తదుపరి । నయముగాను

తే॥ గీ॥ శంఖతీర్థంబు నీదుర । సజ్జ నుంచి
త్రాగుమని యానతిచ్చిన । ద్రావినంత
ఘనప్రసాదంబు నొసఁగితి । ననువుగాను
దారకంబను మంత్రంబు । గోరివినుము ॥

తా॥ నేనైన గురుస్వామికుడి హస్తంబు నీశిరస్సున బెట్టి హస్త మస్తక సంయోగం బిదేనని చెప్పి యిదివరకు నీవు చేయు పాపపుణ్యంబుల వలన సుఖ దుఃఖంబు లనుభవించుటకు వ్రాసిన బ్రహ్మవ్రాతను దుడిచివైచి యెల్లప్పుడు నీవు సత్కార్యంబులఁ జేయుచు తత్పుణ్య ఫలంబువలన జీవన్ముక్తి సుఖంబులనుభవించు టకై నీఫాలంబున విభూతిపెట్టి విభూతి నాలుకప్పై వేసి జ్ఞానబీజాక్షరంబున నాటి యవిమొలచుటకై నాపాదతీర్థంబు శంఖంబుతో నీకు ద్రాగించి ప్రసాదమొసంగితి గనుక నీకుడిచెవిలో ముందు బరమరహస్యంబగు తారకమంత్రోపదేశంబు జేసెద వినుము.

## తారకమంత్రోపదేశము

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు । ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మాం । తస్మైశ్రీగురువే నమః ॥

క॥ ఆది గకారాన్వితమై
ప్రోది రకారంబు వెలయు । మూలమంత్రమే
కాద లతారకమనియును
వాదించిన బ్రహ్మమగుట । వట్టిది శిష్యా ॥

తా॥ ఆదియందు గకారంబును, దరువాత రకారంబునుగల్గిన మూలమంత్రమే తారకమంత్రము దీనివలన బ్రహ్మవిద్యను సాధింపవలయు నదియుగాదని నమ్మని వారలకు జీవన్ముక్తి గలుగనేరదు కనుక నీకామంత్రముపదేశించితి నింక గూర్మాసనము కుక్కుటాసనము, మయూరాసనము వీరాసనము, సిద్ధాసనము, చిత్రాసనము, దర్భాసనము, వ్యాఘ్రాసన, మను నీ యెనిమిదియాసనంబులను, మఱియు ఖేచరి భూచరి, మధ్య, షణ్ముఖి, శాంభవి, యను పంచముద్రలయొక్క ప్రభావంబును జూపించితి.

## పంచాక్షరిజననము

క॥ వరపంచాక్షరిమంత్రము
పరమును సాధింప నెట్లు । ప్రభవంబయ్యెన్
బరిపూర్ణానందంబున
దెరగెల్లను దెల్పుమిపుడు । ధీజనవినుతా ॥

## పద్మపురాణము కపిలగీతము 3 వ అధ్యాయము

శ్లో॥ ప్రథమం తారకాకారం। ద్వితీయం దండముచ్యతే।
తృతీయం కుండలాకారం। చతుర్థ మర్ధచంద్రికం॥
పంచమంబిందు సంయుక్తం ప్రణవే బ్రహ్మపంచకం॥

తా॥ అను స్మృతిప్రమాణంబు చొప్పున నొకటి తారక స్వరూపము, రెండు దండస్వరూపము, మూడు కుండలస్వరూపము, నాలు గర్ధచంద్రస్వరూపము, నైదు బిందుస్వరూపముకల్గి యేకాక్షరప్రణవంబై యుండెను అట్టి యోంకారమే పంచముఖ పరబ్రహ్మరూపన్త్రైయుండి తాను సర్వజగత్తు నిర్మించుటకు విరాడ్విశ్వకర్మయై యుండెను గనుక నా విశ్వకర్మవలన నేర్పడిన యుత్తమ ప్రణవ పంచాక్షరీ మహా మంత్రంబుయొక్క మర్మంబు నిర్మలంబుగ నీగ్రంథమునందు జెప్పుటకు వీలులేక నీకు బరమరహస్యంబుగ నుపదేశించితి గావున నే తన్మంత్రప్రభావం బెరింగించెద వినుము

### పంచాక్షరీ ప్రభావము - షట్పాది

సీ॥ పంచాక్షరీమంత్ర। పఠనాగ్నికీలల
దహనమగా దుష్కృత। గహనకోట్లు
పంచాక్షరీమంత్ర। పఠన వాయువులచే
దుఃఖతోయదములు। దొలగి పోవు
పంచాక్షరీమంత్ర। పఠన సింహంబుచే
గడతేరు సంతాప। కలభ గణము
పంచాక్షరీమంత్ర। పఠన భాస్కరుదీప్తి
సమయును షడ్వర్గ। తమము లెల్ల
పంచాక్షరీమంత్ర। పఠన తార్క్ష్యములచే
గాఢదూరాహి। సంఘములు వీడు
పంచాక్షరీమంత్ర। పఠన రౌద్రంబున
బ్రహ్మరాక్షస తతుల్। పరుగు లిడును॥

తే॥ గీ॥ నరులు పంచాక్షరీమంత్ర । నావచేత
దనర సంసారజలధిని । దాట గలరు
సరగ పంచాక్షరీమంత్ర । స్మరణ గనిన
దండధరుఁడైన నిలువఁగ । లండె శిష్య ॥

పంచాక్షరిస్మరించినవారి నడుగుట

క॥ తేకువ నీ మంత్రంబును
సాకల్యంబెవరు నిష్ట । సాధించిరిలన్
బ్రాకటవైభవ చెప్పుము
నీకున్ బదసేవజేతు । నిశ్చయమతినై ॥

సీ॥ అల మృకండాత్మజుం । డాయుష్యము గణించె
బంచాక్షరీమంత్ర । పఠనచేత
బరికింపవేమన । బ్రహ్మత్వమును బొందె
బంచాక్షరీమంత్ర । పఠనచేత
గేవలబ్రహ్మమై । శ్రీవీరగురుడుండె
బంచాక్షరిమంత్ర । పఠనచేత
శివరామబ్రహ్మంబు । జేరెసాయుజ్యంబు
బంచాక్షరీమంత్ర । పఠనచేత

తే॥గీ॥ విశ్వనాధావధూతకు । నీశ్వరికిని
వీరభద్ర లక్ష్మప్పకి । వీరు సిద్ధ
యమరలింగ వెంకమ నాస । రామలకును
బ్రహ్మసాయుజ్య మబ్బె నీ । పఠనచేత ॥

తా॥ పూర్వంబున మార్కండేయుఁడు తపంబాచరించి యిప్పరమ మంత్రంబు జపించుచు నీశ్వరుఁడొసంగిన పదియాఱేండ్లు నేటివఱకు సంపూర్ణమయ్యెనని సమవర్తియనుజ్ఞప్రకారము దూతలు వచ్చి బాధించునత్తరి పద్మవదనుండిన పిమ్మట నాకింకరుల కతన నీవృత్తాంతంబెరింగి యాయముండేతెంచి దనపాశబద్ధునిజేయ నుంకింపనతండు హరహరాయని లింగమూర్తిం గౌఁగిటజేర్చుకొని స్తోత్రంబుగావింప

నందధనుండు ప్రత్యక్షుండై యక్కాలునిదండించి నిజభక్తుఁడెల్లకాలము షోడశవత్సరంబులాయుష్యంబుగల్గి యుండునట్లు వరమొసంగె మఱియు సద్గురుండగు, వేమనయోగి, శ్రీమద్విరాట్ శ్రీపోతులూరి వీరగురు పరబ్రహ్మేంద్రస్వాములవారు చెముకూరి శ్రీశివరామ పరబ్రహ్మేంద్రస్వాములవారు, సింహాద్రి విశ్వనాథాచార్యావధూత స్వాములవారు, ఈశ్వరమ్మగారు అల్లాడపల్లె వీరభద్రాచార్యస్వాములవారు యాగంటి లక్ష్మప్పగారు, స్వర్ణ అమరలింగాచార్యస్వాములవారు, కబీరుదాసుగారు, సిద్దయ్యగారు, తరిగొండ వెంకమ్మగారు, నాసరయ్యగారు, మొదలగు మహాభక్తులెల్ల నీశ్వరాంశంబైన మోక్షంబును బొందియుండిరని యెఱుంగుము.

మధ్యపంచాక్షరిజననము

క॥ ఈమంత్రమహిమ దెలసెను
నామంత్రమహత్వమేమొ । యతివేగమునన్
స్వామీ నాయెడనింపుగ
నేమరకవచింపుమయ్య । యెలమితో నీవున్ ॥

షట్పాది

తే॥ గీ॥ ప్రథమ మోంకారమే విశ్వ । బ్రహ్మమనియు
జనశృతి నకారబీజంబు । శంభుఁడనియు
బెరి మకారబీజంబున । విష్ణువనియు
బదకము శికారబీజంబు । బ్రహ్మమనియు
బీజము వకారమునను బి । డౌజుఁడనియు
విను యకారంబు రవియని । మునులెయనిరి ॥

తా॥ ఓంకారము విశ్వబ్రహ్మమనియు, నకారము శివుండనియు మకారము విష్ణువనియు, శికారము బ్రహ్మమనియు, వకార మింద్రుఁడనియు, యకారము సూర్యుండనియు, జెప్పుదురు కొందఱు.

శ్లో॥ ఓంకారవదనాదేవి । వాయకార భుజద్వయం ।
శికార దేహమధ్యంచ । నమకార పదద్వయం ॥

తా॥ ఓంకారమాదిశక్తిముఖమనియు, వాయకారములు రెండుబాహువులనియు, శికారము గర్భమనియు, నమకారములు రెండు పాదములనియు, జెప్పుదురు ఇట్టి యీ మంత్రోపాసనపరులగు దొంగగురువుల నడవడిక చెప్పెద వినుము.

దొంగగురువుల నడవడిక

సీ॥ గడ్డంబు మీసముల్ । ఘనతరంబుగ జడల్
వెంచియు దనువున । బెడసముమీఱ
కాషాయవస్త్రముల్ । గడువేడ్క ధరియించి
నొసట గంధము భూతి । నొసరబెట్టి
యరుయ గమండల । మనువుగ జేబూని
మెరయ రుద్రాక్షముల్ । మెడనుబైచి
పరమ మాహేశ్వర । భక్తుండువాఁబజల్
చూచువారికి బహు । చోద్యమైన ॥

తే॥ గీ॥ వేషముధరించి వేదాంత । భాషితుఁడయి
సిరమనము లేక దేశముల్ । దిరిగితిరిగి
యధికమగా కష్టములతోఁడ । నలఁడు తుదకు
శక్తిమహిమాకు ప్రాణంబు । జగతివిడచు ॥

తా॥ ఇవ్విధంబున బ్రవర్తించు బ్రహ్మవేత్తలు గొంతమంది జనులకు బునర్జన్మంబు లేకుండునట్లు బ్రహ్మజ్ఞాన ముపదేశించెదమని చెప్పి వారల కాపరమాత్మని దర్శనంబుజేయించనేరక యుతమపంచాక్షరీమహామంత్రంబునకు యంత్రంబైన బీజంబులకు నూటిరువది మంత్రంబులుగా మార్పుజేసి బోధించువిధం బెట్టిదనిన. ఓంకారమేకాక్షరియనియు, ఓన ద్వ్యక్షరియనియు, ఓనమశివా ప్రణవ పంచాక్షరియనియు, ఓనమశి చతురక్షరినియు, ఓనమశివా ప్రణవ పంచాక్షరియనియు, నమశ్శివాయ శివపంచాక్షరియనియు, ఓంనమశ్శివాయ షడక్షరి యనియు, నిదియే నారాయణ చతురక్షరియనియు, నమోనారాయణ షడక్షరి యనియును, ఓన్నమోనారాయణ సప్తాక్షరి యనియును, ఓన్నమోనారాయణాయ అష్టాక్షరీమంత్రంబనియును, ఒకరివలన మఱియొకరుగ్రహించి జనులకుపయోగించుచు నపమృత్యువును జయింపలేక దుర్మర

ఉంబు నొందుచుండిరి అందువలన పుట్టికెక్క లేనప్పు స్వర్గమున కెక్కునా? యను సామ్యముగను, భక్తిలేనిపూజ పత్రిచేటనుచయతిగను, బాపురుఉ బ్రహ్మజ్ఞానులు, తుల్యులుగా నుండిరి కాని యాధిక్యమేమిగా నెంపదు అట్టివారలందరు శిష్యసంఘము సంపాదించుకొనుటకు యుదరపోషణనిమిత్త మనుటకుసందియం బిసుమంతయైనను లేదు కనుక భగవద్దర్శనంబు జేయించెద వినుము

గురువు భగవంతునిజూపించుట - కాలజ్ఞానము

శ్లో॥ అఖండమండలాకారం। వ్యాప్తం యేన చరాచరం।
తత్పదం దర్శితం యేన। తస్మై శ్రీ గురవేనమః॥

తా॥ ఓరీశిష్యా నీత్రికూటస్థానంబున నంతరార్థంబునుగురించి యొకటిలండాం డమనగా నీరెండునేత్రములయందుండు నల్లగ్రుడ్లు, రెండుపిండాండమనగా నాగ్రుడ్ల బిందువులనే పాపలు, మూడు బ్రహ్మాండమనగా నప్పాపలమధ్య వెలిగే కళ, నాలుగు నాకళలోనిష్కళయే పరబ్రహ్మస్వరూపము తానై పిపీలికాదిబ్రహ్మపర్యంతము నిండి నిబిడి కృతంబై సర్వసాక్షియై వెలుగుచుండు పరబ్రహ్మంబునుదర్శనంబు కృతంబై సర్వసాక్షియై వెలుగుచుండు పరబ్రహ్మంబును దర్శనంబు జేయించితి గనుక మఱియు నెరింగించెద వినుము.

ఆ॥ వె॥ నాసికాగ్రదృష్టి। నలరు భ్రూమధ్యము
జూచి చూచి మఱియొక। జూచెనేనని
యాత్మరాక పోక। లప్పుడె తెలియును
విశ్వదాభిరామ। వినురవేమ॥

తా॥ నాసికాగ్రమధ్యమున దృష్టినిలపి పరమాత్మను నంతర్లక్ష్యముచేతజూ చుచుండెనేని పరమాత్మయొక్క సంచారము చక్కగా దెలియబడుచుండును గనుక యింక జెప్పెదవినుము.

ఆ॥ వె॥ నిద్రలోనిద్ర। నిజముగా దెలసిన
భద్రమైననిద్ర। బ్రహ్మవిద్య
నిజము దెలియువారె। నిర్మలయోగులు
విశ్వదాభిరామ। వినురవేమ॥

తా॥ సుషుప్తియందు జాగ్రతగలిగిచూచినయెడల బరమాత్మ యొక్క స్థితి దెలియబడుచుండును, నాసుషుప్తియందు జాగ్రతనుండు వారేమహాత్ములు. ఇంక మాయకులోబడక ప్రవర్తించువారలకు బ్రహ్మవిద్య సిద్ధించును గనుక నిందుకు సరియగు ప్రమాణం బెఱింగించెదవినుము.

శ్లో॥ యే జాగర్తిసుషుప్తిస్థో। యస్య జాగ్ర న్నవిద్యతే।
యస్య నిర్వాసనాబోధః। సజీవన్ముక్తి రుచ్యతే॥

తా॥ అనిజెప్పబడుచుండె గనుక లక్ష్యార్థమందు త్రివేణుల వివరం బెఱింగించెదవినుము.

## త్రివేణులవివరము - ఆత్మబోధామృతము

వ॥ పైనలుపుగంగ. ఆనలుపులో గుండలియను పాప యమునఆపాప కేనిలతో యదమధ్యస్థమనిపేరు కనుకనాపాపమధ్య వెలుగే సరస్వతి యదియేవిద్యుల్లేఖ ఆవెలుగులో నిష్కళయే తానుఅదియేముక్తి కాంత కనుక మండలత్రయ వివరంబెఱింగిచెద వినుము.

## మండలత్రయవివరము

వ॥ నలుపే యగ్నిమండలము పాపయే సూర్యమండలము సునీలమైనబిందువే చంద్రమండలము కనుక హంసయొక్క రేచక పూరకాదులజెప్పెద నాకర్ణింపుము.

## రేచకాదుల వివరము

వ॥ రేచకము, పూరకము, కుంభకము సూచకమును నాల్గువిధంబులుగలవు. అదియేలాగంటే రేచకమనగా వెలుపు శ్వాస విడచుటయును, బూరకమనగా దెలుపు శ్వాసయెక్కించుటయును, గుంభకమనగా నలుపు రేచకపూరకములు పుట్టినచోటనీరెండునిలుపుటయు నిదియే ప్రాణాయామము సూచకమనగా నల్లనిపాప కనుక త్రివిధ ప్రసాదంబు లెఱింగించెద వినుము.

## త్రివిధప్రసాదవివరము

వ॥ కొందఱు మిథున కైంకర్య మనగా భార్యాభర్తలకు సేవకావృత్తి జేయుటయే త్రివిధ ప్రసాదమనియు, మఱికొందరు స్త్రీపురుష సంధానరసను మొకగిన్నె యందు గొంతజలమును మధువును బోసి శిష్యులకిచ్చెదరు. ఇదికల్మషప్రసాదము కనుక నిజము దెల్పెదవినుము. గురుడు ముందుగా ప్రకృతియిట్టిదనియును, ప్రకృతి జన్మమిట్టిదనియు, దెల్పి పిమ్మట ప్రత్యగాత్మ యిట్టిదని బోధించి యటుతరువాత గేవలాత్మ నిర్మాణమును జక్కగా భోధించుటయే త్రివిధప్రసాధముగాని తక్కిదంతయు గల్లయని యెఱుంగము.

### ఛాయాపురుషలక్షణము - సనాశివిశ్వేశ్వర సవాందము

క॥ ఛాయా పురుషనియోగము
చేయుటకును మార్గమెటులో । సెలవీయవలెన్
ఆయుర్దృ ష్టాంతంబులు
ధీయుత వరవిశ్వనాధ । దేశికనాథా॥

సీ॥ అష్టపాదచ్ఛాయ । లందెదు రైనిల్చి
కంఠంబునందొక్క । గంటజూచి
యాస్పైనినా కాశ । మారీతిగా జూడ
నాకార మంగంబు । లన్నియున్న
దపకుటుంబము దాఁపు । దాలిమిగా నుండు
నగంబు లందున । భంగ మున్న
గుఃక్షిబిలంబున్న । గొమరులు కగుసీడు
యూపస్యపార్శ్వము సోద । రాళి కేడమ
భాగంబు గళమును । బరికింప దనకగు
ఫాలంబుభాగ్యాను । పాలుగాను॥

తే॥ గీ॥ నాసికాగ్రము పై నేపల । సమములైన
దండధరు దేశమందుఁగ । దారిబట్టు
జీకలైనను దనతండ్రి । శీఘ్రమేగు
గురులు చెడియున్న దనతల్లి । మరణమగును ॥

తా॥ ఓయి శిష్యా ! యీ ఛాయా పురుష రూపంబు నిత్యానుష్ఠానంబుగ ద్వాదశాబ్దంబులు గడపినవారితో సంభాషణయుక్తంబుగా భూత భవిష్యద్వర్తమానంబులు ప్రపంచోపవృత్తులు మొదలగు సమస్తంబు దెలుపుచుండు నిదియు మోక్షధర్మ రహితంబైన మాయాయోగంబు గనుక స్వరపరీక్ష లక్షణంబెరిగించెద వినుము ॥

## స్వరపరీక్ష లక్షణము

వ॥ ఇడ, పింగళ, సుషుమ్న, యను మూడు విధంబులైన స్వరంబులు గలవు. అందలి ఇడ యనుస్వరము నాసికము యొక్క యెడమరంధ్రంబున నడచుశ్వాస దానికి శివుండధిదేవతయగుటవలన చంద్రనాడియనియు, కైలాసగిరియనియు, నామద్వయంబు గలిగియుండెను. పింగళస్వరము నాసికముయొక్క కుడిరంధ్రంబున నడచుశ్వాస దానికి విష్ణుమూర్తి యధిదేవతయగుట వలన సూర్యనాడియనియు, మందరగిరియనియు, రెండుపేర్లు గలిగియుండెను. మఱియు సుషుమ్ననాడియనగా ముక్కు రెండురంధ్రంబులేకమై నడచుశ్వాస, దానికి బ్రహ్మయధిదేవతయైనందున వహ్నినాడియనియు, మహామేరువనియు, రెండుపేర్లుగలిగియుండెను కనుక బంచభూతంబుల వివరంబెరిగించెద వినుము.

## పంచతత్వంబులవివరము — స్వరశాస్త్రము

శ్లో॥ లంబే చ స్యా దపాం తత్వం । సమత్వేనైవ మేదినీ ।
విషమే వాయుతత్వంచ । వహ్నిస్స్యా త్త్రితయేసమే ॥

తా॥ అందములు ప్రేలియుండిన జలతత్వము సమముగానుండిన భూతత్వము హెచ్చుతగ్గులుగానుండిన వాయుతత్వము, మూడు సమముగానుండిన నగ్నితత్వము కనుక నీ మూడు స్వరంబులలో చంద్రస్వరంబునకు బంచభూతంబుల కాలప్రమాణ మెరిగించెద వినుము.

## పంచతత్వకాలపరిమితి - స్వరశాస్త్రము

శ్లో॥ చంద్రేదేధరాపూర్వా ప్రథమా । ద్వితీయేవారుణీమతా ।
తృతీయాస్తైజసీ ప్రోక్తా । తత్వానాంఘటికాక్రమాత్ ॥

తా॥ చంద్రస్వరమునకు బగలు మొదటిఘడియ పృథివీతత్వము, ౧౨ అంగుళముల పొడవును రెండవఘడియ జలతత్వము, ౧౬ అంగుళముల పొడవును మూడవ ఘడియ నగ్నితత్వము, ౮ అంగుళముల పొడవును, నాల్గవఘడియ వాయు తత్వము, ౪ అంగుళముల పొడవును నైదవఘడియ నాకాశతత్వము నీ ప్రకారము మూడు పర్యాయములకు మూడైదులు ౧౫ ఘడియలు సూర్యస్వరమునకు గూడా పగలు మొదటిఘడియ పృథివితత్వము ౧౨ అంగుళముల పొడవును రెండవఘడియ జలతత్వము, ౧౬ అంగుళముల పొడవును మూడవఘడియ నగ్నితత్వము, ౮ అంగుళముల పొడవును నాల్గవఘడియ వాయుతత్వము, ౪ అంగుళముల పొడవును నైదవఘడియ నాకాశతత్వము, నీ ప్రకారము మూడు పర్యాయములకు మూడైదులు ౧౫ ఘడియలు నీ తీరున రాత్రి పగలు ఇడ పింగళయను రెండు స్వరములయందు నొక్కదినమున రరువదిఘడియల చొప్పున నడచుచుండును గనుక వీనిశుభాశుభంబు లెరిగించెద వినుము

## పంచతత్వముల ఫలము

శ్లో॥ నాసాదక్షిణభాగజాతపవన స్సూర్యాఖ్యనాడీశుభా
సంగ్రామవ్యవహారమైథున భయ స్నానాన్నభంగార్తిషు
నాద్యన్యాశ్మశివశ్చనీసు గమనాలంకార పాణిగ్రహ
క్షేత్రాద్వేషుయుదంశ వాయుచలనే తత్వాదపూర్వాంప్రజేత్ ॥

తా॥ యుద్ధారంభము నందును వ్యవహారము చేయునప్పుడును స్త్రీసంభోగము చేయునప్పుడును స్నానము చేయునప్పుడును భోజనము చేయునప్పుడును భయము నందును సూర్యవంశమునందు బృథివి జలతత్వములాడె నేని శుభలగ్నముగల్గును. బరిశుద్ధుడౌటయందును బ్రయాణమునందును విత్తనములు వేయుటయందును నలంకారమందును జంద్రనాడియందు బృథివి జలతత్వములాడిన యెడల శుభముగల్గును; మరియు సూర్యనాడియందు జేయుపనులకు గుడిపాదము ముందుగాను జంద్ర నాడియందు జేయుపనులకు నెడమ పాదము ముందుగాను బెట్టి ప్రయోణమై పోవు

చుండవలయును. నింతియేకాక సూర్యచంద్ర పర్వములయందు పృథివి జలతత్త్వములు రెండాడినప్పుడు సమస్త శుభకార్యములు జరిగించుకొనవచ్చును, గనుక నీవు గురుమంత్రానుష్టాన పరుండవై నేనుదెల్పినట్లు నీపీప్రణవము నందుద్భవించిన దశవిధ నాదంబులు దెలియుటకు నారు రంధ్రంబులు మూయబడిన షణ్ముఖిముద్రను బట్టి నీయూర్ధ్వస్థలంబులో బలుకబడిన తారకధ్వనిని వినుడు ప్రతిదినంబును సాధన చేయుచుండవలయు గనుక దద్విధంబెరింగించెద వినుము.

## నాదానందము దెలుపుట

### ధృవకోకిల

షిణిరవంబు క్షిణిక్షిణిధ్వని । శీఘ్రమేకారవంబు జృం
భణముగాఁగను భేరినాదము । మద్దెలధ్వని తాళఘో
షణము ఘంటవిరావము స్ఘన । శంఖనాదము వీణని
నిక్వణము వేణురవంబులై ప్రణ । వధ్వనిన్ దశమేకమౌ ॥

తా॥ ఆ తారక ధ్వనిలో క్షిణీనాదంబును మఱికొన్ని దినంబులకు క్షిణిక్షిణి నాదంబును గొన్నిదినములకు మేఘనాదంబును బిమ్మట గొన్నిదినంబులకు భేరి నాదంబును నావల గొన్నిదినంబులకు మృదంగనాదంబును నావెనుక గొన్నిదినములకు దాళనాదంబును నటుతరువాత గొన్నిదినంబులకు ఘంటానాదంబును దరువాత గొన్నాళ్ళకు శంఖనాదంబును నావెనుక గొన్నిదినములకు వీణానాదంబును దదుపరి కొన్నిదినములకు వేణునాదమును గల్గియుండును గనుక నొకటియాకాశము రెండు వాయువు మూడునగ్ని నాలుగుజలము నైదు పృధివి . ఈ భూతంబుల యందొక్కొక్క తత్వమున కైదేసితత్వముల వంతున బంచవింశతితత్వములచేత నీవు స్థూల శరీరుండవై జన్మించితివి కనుక సాంఖ్య వృద్ధి నెరింగించెద వినుము.

## సాంఖ్యయోగ లక్షణము

సీ॥ జ్ఞాతమనము బుద్ధి । చేతనంబునునహం
క్రియయైదునంతరిం । ద్రియములయ్యె
ప్రాణమపానంబు । వ్యానముదానస
మానవాయువులైదు । ప్రాణములును

త్వక్ఛ్రోత్రచక్షుర్జి । హ్వాఘ్రాణములునైదు
జ్ఞానేంద్రియంబులు । ఘనతరముగ
శబ్దముస్పర్శర । సముగంధరూపము
లివిపంచతన్మాత్ర । లవిరతంబు ॥

తే॥ సీ॥ నొవర వాక్పాణిపాదపా । యువులుపస్థ
యనిడికర్మేంద్రియము లేక । మైనపంచ
వింశతిస్థూలసూక్ష్మముల్ । నెలయగార
ణంబుయనునివిమూడుదే । హంబులయ్యె॥

తా॥ ఆకాశతత్వ పంచకంబైన జ్ఞాత మనస్సు బుద్ధి చిత్తము అహంకార మివి యంతరింద్రియములు వాయుతత్వ పంచకంబైన సమాన వ్యాన ఉదాన ప్రాణ అపాన మివి పంచప్రాణములు అగ్నితత్వపంచకంబైన శ్రోత్ర త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణ మివి జ్ఞానేంద్రియములు ఉదకతత్వపంచకంబైన శబ్దము స్పర్శ రూపము రసము గంధములివి పంచతన్మాత్రలు పృథివితత్వపంచకంబైన వాక్కు పాణి పాద పాయు ఉపస్థ లివికర్మేంద్రియములు గనుక పృథివివలన ఓషధులు ఓషధుల వలన అన్నము నాయన్నమువలనను నీపంచవింశతత్వము వలననుగల్గు స్థూల శరీరముగల జీవునకు విశ్వుండను పేరుగలిగియుండె మరియు నాయాతత్వ ములకు స్థానగుణము లెఱింగించెద వినుము.

ఆకాశతత్వ పంచకస్థానగుణములు

సీ॥ జ్ఞాతయనఁగ సహ । స్రారమందుండియు
సకలవస్తువులజ్ఞ । ప్తికిని దెచ్చు
నానాప్రయాణముల్ । పూనియూహించును
మనము కంఠస్థాన । మునవసించి
బుద్ధిముఖస్థాన । మునను నివాసమై
వాంఛించు సకలమా । వస్తువులను
చిత్తమునాభినా । యత్తమైనానావి
ధులచిత్తములజేయు । సలలితముగ ॥

తే॥ సీ॥ వినుమహం కారముదరము । దునివసించి
యదియహంకృతిగలిగించు । నవిరతంబు
బరగనాకాశతత్వసం । భవములైన
పంచతత్వంబులిటులను । లెంచనివియు ॥

తా॥ జ్ఞాత సహస్రారమందుండి సకల వస్తువులు జ్ఞప్తికి దెచ్చుచున్నది. మనస్సు కంఠస్థానమందుండి నానాప్రయాణముల కూహచేయుచున్నది బుద్ధిముఖ స్థానమందుండి సకలవస్తువులను గోరుచున్నది. చిత్తము నాభిస్థానమందుండి నానా చిత్తములను జేయుచున్నది. యహంకార ముదరమందుండి యహముజేయుచున్నది. కావున వాయుతత్వపంచకంబు నెరింగించెద వినుము.

వాయుతత్వపంచకస్థానగుణములు

సీ॥ నాభినుండియుసమా । నముభుక్తరసమునా
డులుద్విసప్తతివేల । కిలమబంచు
వ్యానంబుతనువున । వ్యాప్తమైరోమముల్
గగురించిస్పర్శల । గాంచుచుండు
గళమునందునుదాన । నిలయమై బహువిధ
వైఖరి పలుకులే । ర్పడగజేయు
హృదినుండి ప్రాణంబు । వెన్నునసడినాళ
రంధ్రంబునెక్కితా । రశబ్దంబు

తే॥ సీ॥ లైనహంతుంబులనె సోహ । మనుచునాసి
కములనుచ్ఛ్వాసనిశ్వాస । గలుగజేయు
నుదరమందు నపానంబు । వెదకియంత
కడుపునుంచకమలమును । నుడుచుచుండు ॥

తా॥ సమానవాయువు నాభిస్థానమందుండి భక్షణచేసిన సకల పదార్థముల యొక్క రసము డెబ్బదిరెండువేల నరములకు సమముగా బంచిపెట్టుచున్నది. వ్యాన వాయువు శరీరమందుండి రోమములుగ గురించి శీతోష్ణాదిస్పర్శల దెలియజేయు చున్నది. ఉదానవాయువు కంఠస్థానమందుండి నానావైఖరి పలుకులను గలుగజేయు

చున్నది ప్రాణవాయువు వక్షస్థలమందుండి వెనుకవెన్నునున్న నడినాళరంధ్రంబు నెక్కి నీవు వినిన తారకధ్వనియైన హం క్షం బను రెండు బీజంబులంబట్టి యుడుపిం గళలనే యెడమ కుడిరంధ్రంబులవలన సోం అని లోపలికి హం అని వెలుపలికిని నుచ్ఛ్వాసనిశ్వాసంబుల నడుపుచున్నది. అపానవాయువు గర్భమందుండి యంతయు శోధించి మలమూత్రములను గర్భమునంటకుండ దుడిచిపెట్టి యధోశ్వాసయై వెళ్ళ గొట్టుచున్నది కనుక నగ్నిపంచకము దెల్పెద వినుము.

అగ్నితత్వంపచకస్థానగుణములు.

సీ॥ శ్రోత్రేంద్రియముకర్ణ । సుషిరంబులందుండి
నానావిధధ్వనుల్ । పూనివినును
గృత్తినిఁగప్పి త్వ । గింద్రియంబిది దేహ
సప్తధాతువులను । గుప్తిజేయు
చక్షురింద్రియమన । నక్షిద్వయమునుండి
వర్ణించు సకలమా । వస్తువులను
జిహ్వేంద్రియము నివ । సించి నాలుకయందు
నెలమి షడ్రుచులగ్ర । హించుచుండు॥

తే॥ గీ॥ జెలగి ఘ్రాణేంద్రియంబు నా । సికము నందు
నుండి త్రివిధగంధములను । ఖండితముగ
వాసనలుజూచుచుండును । వహ్నిపంచ
కంబనగజెల్లు జ్ఞానేంద్రి । యంబులివియు॥

తా। శ్రోత్రేంద్రియము కర్ణగోళములయందుండి దిక్కులశబ్దములవినుచున్నది త్వగింద్రియము నాభిస్థానమందుండి మజ్జామెదడు అస్థినరములు మాంసము శుక్లము రుధిరముయీసప్తధాతువుల బొది పెట్టుకొని ముసుకురీతిగా జర్మమునుగప్పియున్నది చక్షురింద్రియము నేత్రమ్ములయందుండి నానారూపవస్తువుల వర్ణించుచున్నది జిహ్వేంద్రియము నాలుకయందుండి షడ్రుచుల గ్రహించుచున్నది ఘ్రాణేంద్రియము ముక్కులయందుండి త్రివిధగంధంబుల నాఘ్రాణించుచున్నది కనుక నుదకతత్వపంచకంబెరిగించెద వినుము

జలతత్త్వపంచకస్థానగుణములు

సీ॥ శబ్దేంద్రియంబుద్వి । సంగతంబుననుండి
ధ్వనుల జేయుచునుండు । ననవరతము
స్పర్శేంద్రియముకళే । బరమునుండియు నేమి
సోకిన దుడిపించు । చుండు బాణి
వీక్షణంబులను రూ । పేంద్రియంబుండియు
గ్రకనునవస్తువుల్ । జిక్కజేయు
నారసేంద్రియముస । హస్రారమందుండి
పదమస్తకాంతంబు । బదును జేయు

తే॥ గీ॥ జెలగి గంధేంద్రియంబు నా । సికబిలముల
నుండియు సకలవాసనల్ । మెండుగాను
కెందురంధ్రంబులందుండి । రిప్పునంగ
హించుజలపంచకంబిది । యుంచితముగ॥

తా॥ శబ్దేంద్రియము లింగస్థానమందుండి రెంటితో గూడి ధ్వనియిచ్చుచున్నది స్పర్శేంద్రియము దేహమంతటనుండి యెక్కడనేమి సోకిన జేతితోదుడిపించుచున్నది రూపేంద్రియము కన్నులయందుండి కంటికిగనుపడేరూపవస్తువులను జేతికిజిక్కచుచున్నది రసేంద్రియము సహస్రారమందుండి పాదాదిమస్తకపర్యంతము బదును జేయుచున్నది గంధేంద్రియము ముక్కులయందుండి సకలవాసనలనేకసుషుమ్నమందు గ్రహించుచున్నది కనుక బృధివిపంచకంబెరింగించెదవినుము.

పృథివితత్త్వపంచకస్థానగుణములు

సీ॥ వాగింద్రియముచేయు । వక్త్రిమందుండిభా
షించిపుణ్యంబు దూ । షించియఘము
పాణీంద్రియముచేయు । బాణులందుండి పె
ట్టించిపుణ్యంబు గొ । ట్టించియఘము
పాదేంద్రియముచేయ । బాదస్థతీర్థయా
త్రవృషంబు నార్యుల । దన్నియఘము

పాయురింద్రియముతా । భగమేఢ్రములనుండి
శ్వేతశోణితముల । వెడలఁజేయు॥

తే॥ సీ॥ వినుముపస్థేంద్రియము గుహ్య । మునవసించే
మలము నేప్రొద్దు కాప్రొద్దు । వెలుపలకును
బొందోలుమనుండును । స్పష్టముగను
గొమరుభూతత్త్వపంచక । గుణములవియు॥

తా॥ వాగింద్రియము వక్త్రమందుండి భూషించిపుణ్యమును దూషించి పాపమును దెచ్చుచున్నది పాణీంద్రియము హస్తములయందుండి పెట్టించిపుణ్యమును గొట్టించిపాపమును దెచ్చుచున్నది పాదేంద్రియము పాదములయందుండిపుణ్యక్షేత్రములకునడిపించి పుణ్యమునద్రి మొదలగు పూజ్యులను దాకి పాపమును దెచ్చుచున్నది పాయురింద్రియము యోన్ని ప్రజాపతులయందుండి శుక్లశోణితమూత్రానంద విసర్జనజేయుచున్నదిఉపస్థేంద్రియము గుదస్థానమందుండి యేపూటమలమూత్రముల నాపూటవెళ్లగొట్టుచున్నది కనుక సూక్ష్మశరీరలక్షణంబు దెలిపెదనాకర్ణింపుము

సూక్ష్మశరీరలక్షణము.

తే॥ సీ॥ వాయుపంచకమునువహ్ని । పంచకంబు
భువనపంచకముమనస్సు । బుద్ధిగూడి
సప్తదశతత్త్వములను దై । జసు డనంగ
బరగె సూక్ష్మశరీరంబు । పటుతరముగ॥

తా॥ వాయుతత్త్వపంచకము నగ్నితత్త్వ పంచకము జలతత్త్వపంచకము మనస్సు బుద్ధి ఈపదునేడుతత్త్వములతో గూడి సూక్ష్మ శరీరముగల జీవునకుదైజసుం డను పేరుగలిగినయుండె గనుక గారణాంగము నెరింగించెదవినుము.

కారణశరీరలక్షణము.

క॥ చిత్తము జ్ఞాతయుగలసియు
బొత్తుగదత్త్వములనెల్ల । బోదోలివడిగ
జిత్తంబునబ్రహ్మంబును
హత్తిన కారణశరీర । మైనప్రాజ్ఞుడగుణ॥

తా॥ చిత్తము జ్ఞాత యనురెండుగగనతత్వంబులతో గారణశరీరంబుగల జీవునకు ప్రాజ్ఞుం డను పేరు గలిగియుండె గనుక మహాకారణం బెఱింగించెద వినుము.

మహాకారణలక్షణము. - పంచపాది.

తే॥ గీ॥ స్థూలసూక్ష్మకారణములు । సుస్థిరముగ
గలసియుండి సహస్రార । కమలమందు
జ్యోతిమైయున్నవస్తువు । భూతలమున
గనమహాకారణంబని । ఘనులుబల్కు
రాతడనవిబర బ్రహ్మ । మైచెలంగె॥

తా॥ స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయంబును గూడి నీ యొక్క సహస్రారకమలమున స్వయంజ్యోతియై నిలచినమహద్వస్తువే మహాకారణంబై యుండె నీ జీవునకు విరాడ్విశ్వబ్రహ్మమను పేరుగలిగియుండె గనుక నూర్ధ్వలోకస్థానంబు లెఱింగించెదవినుము.

ఊర్ధ్వలోకస్థానములు

వ॥ భూలోకమనగా గుదస్థానము పీతవర్ణము గలిగి యుండును భువర్లోకమనగా గుహ్యస్థానము శ్వేతవర్ణముగలిగియుండును సువర్లోకమనగా హృదయస్థానము నీలవర్ణము గలిగియుండును. జనర్లోకమనగా గంఠస్థానము ధూమ్రవర్ణము గలిగియుండును. తపోలోకమనగా భ్రూమధ్యస్థానము సకలవర్ణములు గలిగియుండును. సత్యలోకమనగా లలాటస్థానము మిక్కిలి శ్వేతవర్ణముగలిగియుండును గనుక నధోలోకస్థానంబు లెఱింగించెద వినుము.

అధోలోకస్థానములు

వ॥ అతలలోకమనగా నరికాళ్ళు వితలలోకమనగా మీగాళ్ళు సుతలలోకమనగా మడమలు తలాతలలోకమనగా బిక్కలు రసాతలమనగా మోకాళ్ళు మహాతలమనగా దొడలు పాతాళమనగా గుదస్థానము కనుక సప్తద్వీపంబు లెఱింగించెద వినుము.

### సప్తద్వీపములవివరము

వ॥ జంబుద్వీపమనగాదలలోను, ప్లక్షద్వీపమనగానస్థులు శాఖాద్వీపమనగా శిరస్సు పుష్కరద్వీపమనగా గోళ్ళు శాల్మలీద్వీపమనగా జర్మము కుశద్వీపమనగా మాంసము క్రౌంచద్వీపమనగా వెండ్రుకలు గనుక సప్తసముద్రములెరింగించెదవినుము.

### సప్తసముద్రముల వివరము

వ॥ లవణసముద్రము మూత్రము. ఇక్షుసముద్రము చెమట, సురసముద్రమింద్రియము. దధిసముద్రము శ్లేష్మము. క్షీరసముద్రము స్తనములు. సర్పిసముద్రము శోణితము శుద్ధోదకసముద్రము కన్నీరు. కనుక రాగద్వేషాదుల వివరంబెరిగించెద వినుము.

### రాగద్వేషాదులవివరము

వ॥ రాగద్వేషకామక్రోధ లోభమోహమదమాత్స ర్యేర్ష్యాసూయడంభదర్పాహంకారములను పదమూడు విధములైన శత్రువర్గములివియేయంతశ్శత్రువులు కనుక వీనిగుణంబు లెరింగించెదవినుము.

౧ రాగమనగా బరస్త్రీ సంబంధమైన భ్రాంతిగలిగియుండుట.

౨ ద్వేషమనగా దనకొకఁడుప కారము జేయగా దిరిగి వానికి నపకారము జేయదలంచుట.

3 కామమనగా భూములు గృహములు ధనము ధాన్యము బంగారము వెండి మొదలగు వస్తుచయము పశువులను విస్తారముగా సంపాదించవలయుననుట.

౪ క్రోధమనగా దానుజేయబూను పను లితరులు చెడగొట్ట దలఁచి నప్పుడతనికి వచ్చుకోపము.

౫ లోభమనగా తాను సంపాదించిన ద్రవ్యపదార్థముల నితరులకివ్వ కూడదని తలంచుట.

౬. మోహమనగా భార్యాపుత్రులయందు విశేషము ప్రీతిగ

నుండి యుచితానుచితముల దెలియక సంచరించుట.

౭ మదమనగా వివిధ సంపదలు గలిగి నేనే గొప్పవాడను నేను

చేసినను జెల్లునని గర్వపడుట.

౮ మాత్సర్య మనగా నితరులు తనకంటె నన్నివిధములలో నెక్కు

వగా నుండిన తానుజూచి యోర్వలేకపోవుట.

౯ ఈర్ష్యయనగా దనకు సంభవించు కష్టము లితరులకు రాకపోవు

నని చింతించుట.

౧౦ అసూయ యనగా దనకు సుఖవృత్తులు గలిగినప్పు డితరులకు

సుఖములు రాకుండాయుండి కష్టములు సంభవించవలయునని తలచుట.

౧౧ డంబమనగా తాజేయుపనులితరులచేత బొగడించుటయు నంతియే

కాక సమయాసమయములందు దనకుదానే ప్రశంసించుకొనుట.

౧౨ దర్పమనగా నేనన్నియంశములచేత మెలఁగువాడను నాకు సమా

నుండు లేడనుకొనుట

౧3 అహంకారమనగా నేనేశిక్షించువాడను నేనే ధనము కులము

గలవాడను నామాటయే నిగ్గవలయు ననుట కనుక సప్తవ్యసనంబు

లెరింగించెద వినుము.

సప్తవ్యసనముల వివరము.

౧ తనువ్యసనమనగా దేహభారముచేత గలువరించుట

౨ మనోవ్యసనమనగా మనోవికారము గల్గినపుడు జారచోరత్వముల

చేయుగోరుట

3 ధనవ్యసనమనగా ధనాసక్తి గలిగి లోభకాంక్షతో నుండుట.

౪ రాజ్యవ్యసనమనగా మనోత్సాహముచేత వాహనాదులను వస్త్ర

ములను ధరించి పరరాజులు వచ్చునేమోయని చింతించుట.

౫ విశ్వవ్యసనమనగా మోక్షమును సంపాదింపవలయుననియు దివ్య క్షేత్రములకు బోవలయుననియు జింతించుట.

౬ ఉత్సాహవ్యసనమనగా సంతోషము గలిగినప్పుడు దారాపుత్రాదులే సద్గతియని వాంఛించుట.

౭ సేవకావ్యసనమనగా వెళ్ళుతానండి వచ్చుచున్నానండియిచ్చెదను పుచ్చుకొనియెదను అయ్యా స్వామీ యని యొదిగియుండుట కనుక పంచాగ్నుల వివరం బెరింగించెద వినుము.

## పంచాగ్నులవివరము

వ॥ కాలాగ్ని పాదముల యందుండును. క్షుదగ్ని నాభియందుండును శీతాగ్ని హృదయమందుండును. గోపాగ్ని నేత్రములయందుండును, జ్ఞానాగ్ని యాత్మయందుండును గనుక నష్టమదంబు లెరింగించెద వినుము.

## అష్టమదములవివరము

౧ కులమదము నేనే కులములో నెక్కువవాడనని పొంగియుండుట.

౨ చలమదము నేనే చతుకోక్తులుగలవాడనని సంతసించుట.

3 ధనమదము నేనే ధనవంతుడను నింక ధనము సంపాదించగలనని గర్వించుట

౪ రూపమదము నేనే సౌందర్యముగలవాడను నాకంటె నెవ్వరు లేరనుకొనుట.

౫ యౌవనమదము నేనే చిన్నవయస్సుగలవాడనని మురియుట.

౬ విద్యామదము నేనే సకలశాస్త్రముల జదివితినని త్రుళ్ళిపడుట.

౭ రాజ్యమదము నేనేరాజనుగాని తక్కినవారుకారని బలహీనులుగా దలంచుట.

౮ తపోమదము నేనే బాగుగ దపస్సుచేసినవాడను నితరులు నాతో
సమానులు కారనుట యీ మొదలగునవి యిహలోకసాధన కారణ
ములుగాని పరలోకసాధన కారణములు కావు. కనుక షట్చక్రంబుల
విధంబెరించెద వినుము.

## షట్చక్రములవివరము

వ॥ ఆధారకమలము పీతవర్ణము నాలుగుదళములు నాలుగక్ష
రములు వ, శ, ష, స, గుదస్థానము గణపతియధిదేవత స్వాధిష్ఠాన
కమలము శ్వేతవర్ణము నాఱుదళములు నాఱక్షరములు బ, భ, మ,
య, ర, ల, లింగస్థానము బ్రహ్మయధిదేవత

మణిపూరకకమలము రక్తవర్ణము పదిదళములు పదిబీజములు
డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, నాభిస్థానము విష్ణువధిదేవత

అనాహతకమలము నీలవర్ణము పదిరెండు దళములు పదిరెం
డక్షరములు క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, హృదయ
స్థానము రుద్రుండధి దేవత.

విశుద్ధకమలము ధూమ్రవర్ణము పదునాఱుదళములు పదునా
ఱక్షరములు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ,
ఓ, ఔ, అం, అః, కంఠస్థానము జీవుండధిదేవత.

ఆగ్నేయకమలము సమస్తవర్ణములు రెండు దళములు రెండక్ష
రములు హం, క్షం, భ్రూమధ్యస్థానము నీశ్వరుండధిదేవత కనుక నజపా
విభాగంబు లెఱింగించెదవినుము.

## అజపావిభాగములు

వ॥ ఆధారమందుగణపతికారువందల శ్వాసములు స్వాధిష్ఠాన
మందుబ్రహ్మకారు వేలశ్వాసములు మణిపూరకమందు విష్ణువునకారు వే
లశ్వాసములు అనాహతమందుశివునకారు వేలశ్వాసములువిశుద్ధమందు
జీవాత్మకుబదునూర్లు శ్వాసములు ఆగ్నేయమందు బరమాత్మకుబది

నూర్ల శ్వాసములు సహస్రారమందు సద్గురునకు పదినూర్ల శ్వాసములు యీవిధంబున రోజున కిరువదియొక్క వేయియార్నూరు హంసలు దిరుగుచుండు నిదియే పూర్ణసమాధి యనబడును, గనుక నమనస్కయోగంబెఱింగించెద వినుము.

### అమనస్కయోగ లక్షణము

సీ॥ భూపంచకంబున । బూనినాల్గు గతించ
నొక్కతత్వంబగు । నొనరుగాను
నుదకపంచకమందు । నొయ్యననాల్గేగి
యొక్కతత్వంబుండె । నొప్పుగాను
నగ్నిపంచకమున । దరయునాల్గునశించ
నొక్కతత్వంబయ్యె । నిక్కముగను
వాయుపంచకమందు । వరుసనాల్గులయించ
నొక్కటినిలచెను । జక్కగాను ॥

తే॥ గీ॥ గగనపంచకముననాల్గు । గతముగాగ
నైదుతత్వంబులే శేష । మగుననివియె
మొదటదెల్పిన బ్రహ్మాండ । భూతసమితి
నరయబిండాండభూతము । లైచెలంగె ॥

తా॥ ఈపంచవింశతితత్వంబులలో మొదటిపృథివిపంచకంబున నాల్గుతత్వంబు జేరి యొక్కతత్వంబులీనమైయాయొక్కతత్వంబేనిలచియుంచెను.ఉదకపంచకలుంబున నాల్గుతత్వంబులుగూడి యొక్కతత్వంబుచేరి యాయొక్కతత్వంబేనివసించెను. అగ్నిపంచకంబున నాల్గుతత్వబులుగూడి యొక్కతత్వంబునందైక్యమై యాయొక్కతత్వంబేమిగిలెను వాయుపంచకంబున నాల్గుతత్వంబులుగలసియొక్క తత్వంబునజేరి యాయొక్కతత్వంబేయుండెను. ఆకాశపంచకంబున నాల్గుతత్వంబులేకమై యొక్కతత్వంబులీనమైయాయొక్కతత్వంబేనిలచెను.గనుకనిట్లు మిగిలిన యైదుతత్వంబులెవ్వియనిన, పృథివి,జలము, నగ్ని, వాయువు,నాకాశ, మీపంచభూతంబులని దిపించేసూత్రము పరిపూర్ణంబునదెల్పెదవినుము.

## అచలపరిపూర్ణ లక్షణము

సీ॥ తారకంబుననీకు । దార్కాణగలిగిన
సాంఖ్యమార్గంబను । సరణిదెలసె
గనుకనిర్వదినాల్గు । కర్చుజెందినయంత
నొకతత్వంబుండె । నిక్కముగను
నాయొక్క తత్వంబె । యఖిలజగమెఱుక
పరిపూర్ణమనునది । భస్మముగును
నైదువేరులు్రదుంచ నామూలాధు మంత్రముల్
దెలియుము గురునిచె । దెంపుకోలది॥

తే॥ గీ॥ నరునిజన్మరహిత । మాలాగెచెందెను
నట్లుగాకమఱియు । నెట్లునగును
రూపనామసహిత । రూఢియెఱుకగు
రూపనామరహిత । రూఢిబయలు ॥

తా॥ నీవుతారకసాంఖ్య మనస్కయోగంబులనెరింగి వృద్ధాప్యండవై మొదటి పంచభూతములుగూడి యాకాశతత్వంబై యొక్కటినిలచియుండి సకలము దెలియుటకు దానేయెరుకయైయుండె గనుక బరిపూర్ణంబునుగురించి (ఈయుత్త బట్టబయలుయేమి లేదు అనుద్వాదశాక్షరీ మహామంత్రంబును నట్టియెఱుకను విడిపించుటకు నీకంచోచే శరీరాలుయేలాగో యాలాగే) యను పంచదశాక్షరీ మహామంత్రంబును దనువును విడిపించుటకు (ఈమూలంలేని గుత్తెరిగే శరీరమేమిలేదు) అను షోడశాక్షరీ మహా మంత్రంబును దెల్పితి గనుక నిందుకుశ్రుతిప్రమాణం బెఱింగించెద వినుము.

శ్రుతి॥ ఆకాశస్య గుణశ్శబ్దో బ్రహ్మముచ్యతే ॥

తా॥ అనువిధంబున జంటలేక యొంటియైయుండునట్టి యచలపరిపూర్ణంబునకు మూలములు స్తంభములు లేక సర్వలోకములయందును సర్వకాలముల యందును సర్వవస్తువులయందును సర్వవేదధర్మశాస్త్రముల కంతము గలదియును బిపీలికాది బ్రహ్మపర్యంతమునిండినిబిడీకృతంబై యుండియొకరితో బలుకదు పుట్టదు గిట్టదు పెరుగదు విరుగదు తరుగదు పుణ్యపాపములుకాదు ధర్మాధర్మములుకాదు నిధినిషేధంబులుకాదు

స్త్రీపురుషులు కాదు జ్యోతి కాదు స్థూల సూక్ష్మ కారణ మహాకారణములు కాదు యోగములుకాదు జ్ఞానంబులుకాదు దీనియందు భగవానులు పుట్టనేలేదుకనుక మరియు నెరింగించెదవినుము

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ । దేహోనాస్తికదాచన ।
ఆస్తినాస్తితికో వేద । నిర్ణయోనాస్తిసర్వదా ॥

తా॥ నీలో వెలుగు జీవాత్మకు దేహముగలిగియున్నది కాని యచలపరిపూర్ణంబైన పరబ్రహ్మంబున కెకప్పుడును మనుష్యాదిదేహంబులు గలిగియుండ లేదు. కనుక నందుకొక్క ప్రమాణంబెరింగించెదవినుము.

ఆ॥ వె॥ జీవిజీవిజంప । శివునినేచంపుట
జీవుం డరసిచూడ । శివుడుగాడె
జీవుండేశివుండని । సిద్ధంబుదెలియరా
విశ్వదాభిరామ । వినురవేమ ॥

తా॥ జీవహింసనుజేయుట పరమాత్మని చంపుటయనియు నట్టి జీవమే పరమాత్మస్వరూపమైయున్నదనియును పరమాత్మస్వరూపమే జీవస్వరూపమైయున్నదనియును జెప్పబడియుండె నందువలన నీ ప్రపంచమున మనుష్యులు జీవహింసను జేయగూడదు.

క॥ జీవుని దెలియక వేఱే
దేవుని భ్రమబొరలునరుడు దేవునిదలపన్
జీవుండతని వివరించిన
భావింపగజీవిబట్ట । బయలగువేమా ॥

ఆ॥ వె॥ బ్రహ్మమనగ వేఱె । పరదేశమున లేదు
బ్రహ్మమనగదానె । బట్టబయలు
తన్నుదా నెఱిగిన । దానెపో బ్రహ్మంబు
విశ్వదాభిరామ వినురవేమ ॥

తా॥ ఇందులముఖ్యభావము తనయందుండు జీవబ్రహ్మమే బద్ధబయలైన పరబ్రహ్మంబని చెప్పియుంటె నదితెలసికొనలేక మరియొక్క ప్రదేశంబున దేవుఁడు గలఁడని చెప్పుకొనుట యవివేకమైయున్నది కనుక మరియు.

సదానందయోగి శతకము

తే॥ గీ॥ శివుఁడుజీవుఁడు రెండువస్తువులటంచు
నెంచిపల్కిన సాయుజ్య। మెట్లుగలుగు
జీవశివభేదమెన్నడు। జేయరాదు
నవ్యతరభోగి(శ్రీ)సదానందయోగి॥

తే॥ గీ॥ నీటబుట్టినలవణంబు। నీటగలియు
నీరులేకున్ననదియుడ। న్నించెనెట్లు
శివుఁడు గలసినజీవుండు। శివుఁడుగాడె
నవ్యతరభోగి శ్రీసదా। నందయోగి॥

తా॥ పరమాత్మ వేఱుగాను జీవాత్మ వేఱుగాను విభజించి పల్కువారలకు మోక్షముసిద్ధింపదు. అదియెట్లంటిరేని జలమువలన బుట్టిన యుప్పు జలమునందే కలసిపోవును నటువలెనే పరమాత్మ కలిగుటవలన జీవమేర్పడియున్నది. కాని పరమాత్మలేనిది జీవమేర్పడియుండలేదు కనుక శివునకును జీవునకును భేదంబుగల దని యెకానొకప్పుడును దలంపగూడదు యింతియేకాక.

తే॥ గీ॥ అనుభవముదెల్పజాలని। యతనిచేత
వాచకజ్ఞానములువిన్న। వాని ప్రజ్ఞ
యంధకుఁడుచూపు తెరగున। నరుగుకరణి
నవ్యతరభోగి శ్రీసదా। నందయోగి॥

తా॥ ఇట్లనుభవములేక చెప్పినవానిమాటలు నమ్మి ప్రవర్తించు వారలకు మోక్షసుఖముగలుగనేరదు. అదియెట్లనియెదరేని గ్రుడ్డివాఁడు చూపించినమార్గంబున బోవువానికెంత సుఖముగల్గియుండునో యంతసుఖంబుగల్గియుండుననియభిప్రాయము

## ఆత్మ బోధామృతము

శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో । నిర్వికారో నిరంజనః ।
నిరాకారో నిరాధారో । నిత్యముక్తోస్తి నిర్మలః ॥

తా॥ నిర్గుణుండనియు నిర్వికారుఁడనియు నిరంజనుండనియు నిరాకారుండనియు నిరాధారుండనియు నిర్మలుండనియు రూపనామరహితుండనియు జెప్పబడుచుండెను. గనుక ప్రత్యగాత్మకు బరమాత్మకు శరీరభేదముగలిగియుండుటయే కాని ప్రత్యగాత్మకూడ కేవలాత్మ స్వరూపంబై ప్రకాశించుచుండెనేని సందియంబు లేదు కావున బునర్జన్మ సందేహనివృత్తినిగురించి పంచవిధంబులైన బంధంబులుగలవు వాని నెరింగించెదఁ నుము.

## పంచబంధంబుల వివరము

### వీరబ్రహ్మ విరచితము

సీ॥ పూర్వజన్మము నీకు । బుట్టుపోలిక లేదు
మరల జన్మకురావు । ధరణియందు
దల్లిదండ్రియు లేరు । తర్కించి చూడంగ
యోనిసంభవుమాట యునికి లేదు
నాదుకరుణ లేక । వేదశాస్త్రస్మృతుల్
చదివిజూచితివయ్య । సగుణమునను
ఎందుకునీకింక । నితరశాస్త్రములంబు
బొందుజూడగదీని । యందుబయలు

ఆ॥ వె॥ ననుచు వినియు దెలియు । నాశిష్యమార్గంబు
బంచభూతఘటము । బెంచుదాను
లోకభ్రాంతికంబు । లోఁజేరియువిపోవు
శిష్యభ్రమము దీర్చి । స్థిరమునుండె ॥

తా॥ పూర్వజన్మము,తల్లిదండ్రులు, యోనిసంభవుఁడు, నీజన్మము ముందుజన్మ, మనుపంచబంధంబులుగలవు. అందు ప్రథమబంధంబు ద్రుంచుక్రమం బెరింగించెదవినుము.

## ప్రథమ బంధంబు ద్రుంచుట

వ॥ ఓరి శిష్యా! నీకు బూర్వజన్మమున్నదని చెప్పుదు రేగాని నీకా పూర్వజన్మమే లేదు. అదియేలాగనిన నీవుపూర్వము ఫలానితావున ఫలానివారియింట ఫలానివారిగర్భంబున బుట్టితినని చెప్పి నిన్ను తీసికొనిపోయి గురుతు చూపించినది లేదు. అందువలన నీకు బూర్వజన్మమే లేదు.

వ॥ స్వామీ! మీరుచెప్పిన ప్రకారముచూచితే పూర్వజన్మమే లేదు. కాని ముందు లేనటువంటివాడ నిప్పుడెటులవచ్చి పుట్టితిని!

వ॥ ఓరిశిష్యా! నీకుముందులేనికల నిద్రించినప్పు డెటులవచ్చెనో తెలియనప్పుడు నీకు లేనిజన్మ మాలాగేవచ్చియున్నది. మేలుకొనియున్న నీకాస్వప్నమేలాగున లేకపోయెనో యాలాగే తెలిసికొంటేనీకా పూర్వజన్మమే లేకపోయెను. గనుక నిక్కడికొక్కబంధంబును ద్రుంచితి.

### శిష్యుని ప్రశ్న

గతపునర్జన్మములు లేకుండుట నిశ్చయమై యుండిన యెడల నీ ప్రపంచమున ధనికులగుట, దరిద్రులగుట, సంతతుగల్గుట, సంతులేకుండుట కుంటి గ్రుడ్డి, మూగ, చెవిటి పిచ్చితనములుగల్గియుండ, గతంబెద్దియో వివరింపుడు.

### గురుని ప్రత్యుత్తరము

శ్లో॥ లలాటలిఖితా రేఖా । పరిమార్ష్టుంనశక్యతే ॥

తా॥ అనుప్రమాణంబుచొప్పున నీవడిగినవిషయము నీలోకంబున సృష్టి యందు భగవంతుండు నొసట వ్రాసియుండుటచే దానిని దప్పించుకొనలేక యనుభవించువారుకొందఱు మధ్య పాపపుణ్యంబుల జేయుటవలన నీలాటికష్టసుఖంబు లనుభవించువారు మఱికొందఱు నివియన్నియు గ్వపునర్జన్మకర్మములవలన వచ్చుచుండుటలేదు మఱియు ద్వితీయబంధంబు నెఱింగించెదవినుము

## ద్వితీయబంధంబుద్రుంచుట

వ॥ నీకు దల్లిదండ్రియున్నారని చెప్పినారు కాని నీకాతల్లిదండ్రి యులేరు. ఎట్లాలేరంటే నీవు ఫలానివారియింటను ఫలానినాటికి ఫలానివాడను వచ్చి పుట్టుతానని ముందుగా వారలకెరుకచేసి పుట్ట లేదు అందువలన నీకాదల్లిదండ్రియు లేరు.

వ॥ మీరు చెప్పిన ప్రకారము చూచితే తల్లిదండ్రియు లేరు కాని వారులేకున్న నాయంతట నేను వచ్చిపుట్టుటకు గారణంబేమి.

వ॥ ఓరిశిష్యా ! ఈ మాయాప్రపంచంబునకు మాయముసుగు వేయుండము. అదియేలాగంటే నొకయచ్చమ్మ కడుపులోగుండా నొక బుచ్చమ వెడలినట్లు కనుపించుట మాయగుణంబులు కనుక వచ్చే టప్పుడొకదానిగుండా వచ్చినట్టుగాను పోయేటప్పుడొకదానిగుండా పోయినట్టుగాను గనుపించిపోయేదేకాని దీనికిమూలము లేదు. అందు వలన రెండవ బంధంబుద్రుంచితిగనుక మూడవబంధంబుజెప్పెదవినుము

## తృతీయబంధంబుద్రుంచుట

వ॥ ఓయిశిష్యా ! నీవు యోనిసంభవుండవని చెప్పుదుముగదా నీవు యోనిసంభవుడవుకావు. ఆయోనిసంభవుండవు. అది యెట్లనిన సంవత్సరమునకు మున్నూటరువది దివసంబులు గనుక ననుదినంబున నామనుష్యులు నిద్రపోవుచుందురుగదా నిద్రించినప్పుడెల్ల స్వప్నము రాలేదు గదా? యీప్రకారము సతిపతులుగూడినప్పుడెల్ల బిడ్డలగన లేదుగదా ? అవశాత్తుగానెప్పుడో యొకప్పుడు బిడ్డలుకల్గేదిన్ని యింతే గాక నొకానొకని కెప్పుడుకల రానేలేదు. ఒక దంపతుల కెప్పటికి బిడ్డ పుట్టనేలేదు. ఒకానొకనికిగలవచ్చి మరలవానికెప్పటికి గల రానేలేదు ఒక దంపతుల కొకసారి బిడ్డగలిగి మరలవారికి బుట్టనేలేదు. ఒకనికనేక స్వప్నములువచ్చుచుండును. ఒక భార్యాభర్తలకు వెంటవెంటనే బిడ్డ గల్గుచుండును. ఆనిద్రలోవచ్చేది లేతకలయున్న నీ నిద్రలేనప్పుడు

వచ్చేది ముదురుకలయున్న నదియప్పుడే మఱచిపోతే యిదిగాన్నా
ళ్ళుండిపోయినట్లున్నది. మొత్తమూనకు నదీకలయో యిదీకలయో యున్న
తెలియుము. అయినప్పటికి నేలాగోగాయొకవిధముగా నయో నిసంభవము
గావచ్చినపిండము కనుక నట్టింకైనవాడు వాకిటరాడా? వాకిటరాగానే
వాకిలియందు బుట్టినాడని చెప్పుదురా కాని వాకిలియందు బుట్టనేలేదు,
యేదో విధముగా నడిగర్భమందుండువాడు తనకుయుక్తమైన యోని
యందు రాడా? యోనియందురాగానే యోనిసంభవుండని చెప్పుదురా
కాని నీవు యోనిసంభవుండవుకావు మరియు నాల్గవబంధంబు నెరింగించె
దవినుము.

### చతుర్థబంధంబు ద్రుంచుట

వ॥ ఓయిశిష్యా! నీవీజన్మంబున బాపము నైనను బుణ్యము
నైనను జేయుటయే కర్మయనియు, నీ కర్మలధికముగ గూడబెట్టుకొని
యుండుటవలన నదిసంచితమనియు, నీ సంచితమువలన ననుభవించే సుఖ
దుఃఖములను బ్రారబ్ధమనియు, నీ సంచితఫలితము సంపూర్ణముగా
బ్రారబ్ధవశమున హరించి మఱల నీవు చేయుపాపమైనను బుణ్యమైనను
బ్రబలమై దానివలన రాబోవు కష్టసుఖములకు నాగామియనియు,
మరియు నాసంచితము ప్రారబ్ధవశమున గొంతక్షీణించి మిగిలిన దానితో
నాగామికూడాకలసెనేని యాగామిసంచితమనియు, నీయాగామిసంచిత
కర్మంబులు త్రివిధంబులుగలవని చెప్పుదు రదియెట్లనిన.

### కర్మవిచారము

### వాసుదేవమననము పంచమవర్ణకము

వ॥ పుణ్యపాపమిశ్రకర్మంబు లనుమూడువిధంబులేర్పడి యందు
బుణ్యకర్మఫలంబునకు దేవాదిశరీరప్రాప్తి, పాపకర్మఫలంబునకు దిర్య
గాదిశరీరప్రాప్తి, మిశ్రకర్మఫలంబునకు మనుష్యశరీరప్రాప్తి, పుణ్యోత్కృ
ష్టంబునకు హిరణ్యగర్భశరీరప్రాప్తి, పుణ్యమధ్యంబునకు నింద్రాదిశరీర

ప్రాప్తి. పుణ్యసామాన్యంబునకు యక్ష రక్షో పిశాచాది శరీరప్రాప్తి, పాపోత్కర్షంబునకు బరులకు సంతాపకరంబైన గచ్చ గుల్మ వృశ్చిక యూక మశక మత్కుణాది శరీరప్రాప్తి, పాపమధ్యంబునకు నామ్ల పనస నారికేళ మహిషాశ్వ గర్ధభాది శరీరప్రాప్తి, పాపసామాన్యంబునకు గో గజాశ్వోష్ట్ర వృషభాది శరీరప్రాప్తి, మిశ్రోత్కర్షంబునకు నిష్కామక ర్మానుష్టానము చేతను వచ్చినట్టి జ్ఞానముద్వారా జీవన్ముక్తినిచ్చునట్టి శరీరప్రాప్తి, మిశ్రమధ్యంబునకు స్వాశ్రమోచితకామ్యకర్మంబునకు యోగ్యమైన శరీరప్రాప్తి, మిశ్రసామాన్యంబునకు జండాలవ్యాధాది శరీరప్రాప్తి, యగునని పెద్దలీలోకంబున భక్తిక్రియాజ్ఞానంబులు చక్కగాజరుగునిమిత్తమై ప్రజలకుగట్టుబాటునకై చెప్పియుండిరి. కనుక నీవు జేయు పాపపుణ్యంబులవలన జీవితకాలమువఱకు సుఖదుఃఖంబులనుభవించి మరణంబు నొందుటయే కాని నీకు బూర్వ పునర్జన్మంబులు లేవు యెందువల్లనంటే.

ఆ॥ వె॥ గాలిగాలిగలసె । గగనంబుగగనంబు
మన్నుమంటగలసె । మంటమంట
నీరునీటగలసి । నిర్మలంబాయెరా
విశ్వదాభిరామ । వినురవేమ ॥

తా॥ మానవులు కొందఱు గురుకటాక్షము లేనివారలై పామరత్వంబున బుత్రమిత్రకళత్రాది మోహంబులచేత ననేక సత్కార్య దుష్కార్యంబులజేయుట సహజమైయున్నది కనుక వారలకు బంచవింశతి తత్వంబులలో నేదైన నొక్క తత్వము సక్రమముగా బనిచేయని కారణమున మధ్యమధ్య వ్యాధిగ్రస్తులై యౌషధముల వలన మాన్పుకొని జీవించుచుండి తుదకు మృతకాలము సమీపించినప్పుడు వారల కృత్యంబులైన దోషంబుల యమధర్మరాజు పరిపాలించుసమయంబున నా

తత్వములు సరిలేకుండుటవలన మరణకాలమునం దనేకవిధములగు బాధలచే గిట్టు చుండిరి అట్లు చనిపోవునప్పుడు పృథివితో వచ్చిన తనువు పృథివికేచెల్లు జలముతో వచ్చిన రక్తము జలమునకే చెల్లు నగ్నితోవచ్చిన యాకలి యగ్నికేచెల్లు వాయువుతో వచ్చిన ప్రాణము వాయువునకేచెల్లు నిక్కడికి నాలుగుబోతె యైదాకాశమున నీపలుకేగదా, నీవు నేను అనే మాట నీకు బూర్వంబున నెరింగించియుంటి గనుక నేను దెల్పగా నీవులేవు నీయంతట పలుకు నీకేవచ్చినప్పుడు నీవేయెరుకవు నీవు లేనప్పుడు నీపలు కాకాశంబున జెందును నీయైదుభూతంబులకు నేభూతము దానికే చెల్లు గనుక నిప్పుడేమియు మిగలనందున గతపునర్జన్మంబులులేవు యిటువలెనే మొదట నీకుజెప్పిన చతుర్థాశ్రమంబులవారుమొదలుకొని సమస్త జనులకుగూడా పూర్వపునర్జన్మంబులులేవు కనుక మరియు నెరింగించెద వినుము.

## ఆత్మబోధామృతము

శ్లో॥ గుకారప్రథమోవర్ణో । మాయాదిగుణభాసకః ।
రుకారోఽస్తి పరబ్రహ్మ । మాయాభ్రాంతివిమోచకః ॥

తా॥ గురువను పదముయొక్క మొదటి యక్షరము మాయ మొదలైన గుణములను ప్రకాశింపజేయుచున్నది రెండవవర్ణమగు రుకార మామాయయొక్క భ్రాంత్యాది గుణములను నశింపజేయుచున్నది కనుక నీకు బరబ్రహ్మస్వరూపంబును గురుసూత్రంబున నెరింగించితి గాబట్టి నీవు నమ్మియుండుము.

వ॥ స్వామీ! నేను బాపపుణ్యంబులవలన సుఖదుఃఖంబు లనుభవించి మరణంబునొందుటయేకాని నాకుగతపునర్జన్మంబులు లేవని మీరుదెల్పుచున్నారుగదా పూర్వంబున వీరప్పయ్యగారు నన్నాజిరావు గరిమరెడ్డిఅచ్చమ్మగారి పశువులగాచుచుండి యొకదివసంబున గురువు కాలజ్ఞానముజెప్పుచుండ శిష్యుండది వ్రాయుచుండున త్తరి గోవుతప్పించు కొని చేనిలోబడినప్పు డాశిష్యుండు చేతికఱ్ఱవిసరివేయ నాగోవు

నశించుటచూచి నీవు పింజారికులమున బుట్టుమని శాపంబొసంగి యా శాపవిముక్తిజేయుటకు దాను వీరబ్రహ్మముగారై యవతరించినిప్పుడు మోక్షమొసంగెననిపల్కు వాక్యంబులయందలి యదార్థముచెప్పుము

వ॥ వారుగూడా మొదట మనవలెనే యుద్భవించి శాంత శమ దమాది గుణములతోగూడుకొని గురువులకు సేవకావృత్తిజేసి వారి వలన జ్ఞానంబునుసంపాదించి సచ్చిదానందస్వరూపంబైన యాత్మ నేననియెరింగి దేవత్వమునుబొంది సమస్తమహిమలుకనుపఱచి యీ లోకంబున ప్రజలను భక్తితో ప్రవర్తింపజేయుటకు గతజన్మపాపము నీజన్మంబునవిముక్తిజేసితి ననిచెప్పుట స్వాభావికంబై యున్నది యిప్పటి బ్రహ్మజ్ఞాను లనేకవిధములగు వ్రతములనాచరించి యాశుధారకవిత్వ ముగ నాత్మవిచారణచేయుటతప్ప దేవత్వమునుబొందగలిగిన నిశ్చల మనోవ్యాప్తిలేక పామరులవలెనే ప్రవర్తించుచుండిరి కనుక పంచమ బంధంబు నెరింగించెద వినుము.

పంచమబంధంబుత్రుంచుట

వ॥ నేనువచ్చినపుడుబుట్టుతోన నేనందేహమే మొదవబంధము నాల్గవబంధంబైన పంచభూతంబులతో నశించిపోయి నీవు కేవలాత్మ స్వరూపంబైన పరబ్రహ్మమునందైక్యమై నిశ్చలత్వంబుననుండుటయే నిర్వికల్పసమాధియనంబడును.

ఫలస్తుతి

శ్లో॥ నిరంజనంనిరాకారం । నిర్వికల్పంనిరూపమం ।
నిరాధారంనిజానందం । నిర్వికారంసమామ్యహం ॥

## గద్య

ఇది శ్రీ వీరాఖ్యునార్య కరుణాకటాక్షలబ్ధ కవితాలక్షణుడౌ విశ్వకర్మ పాంచానన భువనసగోత్ర పవిత్ర చెరుకూరి వంశాబ్ధి సోమ చలమయ్య పుత్రరత్న వినుత నే శివరామయోగి ప్రణీతంబయిన శ్రీ వీరబ్రహ్మండ సర్వశాస్త్ర సమాధానవ్యత్యయ నిత్య రత్నాకరమనె కృతినుండి పరిమళచోళ చరిత్రము

ప్రథమాశ్వాసము

సంపూర్ణము

ఓం తత్సత్

బ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోనమః

# పరిమళచోళచరిత్రము

## ద్వితీయాశ్వాసము

ప్రారంభము

### ఇష్టదేవతాప్రార్థన

క॥ శ్రీరజతాద్రినివాస్యమ
హారజతగిరీంద్రచాప । సాస్త్రాగ్రధరా
స్వాద్యస్సంస్తుత జగదా
ధార స్మరగర్వహరణ । దాక్షిణ్యనిధీ॥

### విరాట్పురుషజననము.

తే॥ గీ॥ భువిని గురువర్య బ్రహ్మాండ । వివిధసర్వ
రూపముల్ సృజియించియు । రూఢిమీర
బోష్యలయక ర్తయైనస । త్పురుషజనన
మెరుఁగదెల్పుము నాయందు । గరుణచేత॥

తా॥ గురువర్యా! సకలభువనంబులను సకలజీవంబులను సృష్టించి వృద్ధింలయంబు
లనుజేయు పరమాత్మునిదెల్పు మనిన శిష్యునకు గురుండిట్లనియె.

తే॥ గీ॥ సకలవేదధర్మ । శాస్త్రసమ్మతముగ
విశ్వభూసురులకు । వెలయు బ్రాహ్మ

ణత్వమనివర్ణ । నను చేసియున్న గ్రం
థములెసాక్షులయ్యె । దధ్యముగను॥

తా। విశ్వకర్మవంశస్థులకు సకలవేదధర్మశాస్త్రములయందు గల్గియుండిన బ్రాహ్మణాధికారములను విప్రశూరాజాదిగ్రంథంబు లెల్ల రతును గొన్నిశుశ్రు ప్రమాణవచనములకు సరియగు ప్రమాణంబులై బోధింపుచుండెనదియెట్లనిన

మూలస్తంభము.

శ్లో॥ నభూమిన చలంచైవ । న తేజోనచవాయవః।
నచబ్రహ్మనచవిష్ణు । నచనక్షత్రతారకాః।
సర్వశూన్యంని రాలంబం । స్వయంభూఃవిశ్వకర్మణః॥

తా॥ భూమిలేనివేళయందును, బర్వతములు లేని వేళయందును, తేజస్సు లేని వేళయందును, వాయువులేని వేళయందును, నాకాశములేని వేళయందును, బ్రహ్మలేని వేళయందును, విష్ణువులేని వేళయందును, నక్షత్ర ములులేని వేళయందును, సర్వ శూన్యమైయాధారము లేని వేళయందును, విశ్వకర్మ తనంతటదానే యయోనిసంభ వుండై జన్మించియుండె, నది యునుంగాక నీవుకన్ను దెఱచిచూచినప్పు డఖిలముక నుపించియుండుట వలన నదిసాకారస్వరూపంబయ్యె నంతనీవుకన్నుమూసినప్పు డేమి కనుపించకుండటచే నదినిరాకారస్వరూపంబయ్యె నప్పు డీప్రపంచ మంతయు దన యందిమిడియుండె గనుక నతండే సృష్టిస్థితిలయాదు లకుగర్తయగుటవలన విరాడ్విశ్వ కర్మ యనునామమంబుగలిగియుండె గనుక నిందుకుసరియగు ప్రమాణవచనములీ క్రిందవ్రాయుచున్నాము.

పద్మపురాణకపిలగీతము.

3 వ అధ్యాయము.

శ్లో ప్రథమంతారకాకారం । ద్వితీయందండముచ్యతే।
తృతీయంకుండలాకారం ॥ చతుర్థమర్ధచంద్రికం ।
పంచమంబిందుసంయుక్తం । ప్రణవేబ్రహ్మపంచకం ॥

తా॥ అను ప్రమాణంబుచొప్పున నొకటి తారకస్వరూపము, రెండుదండ స్వరూపము, మూడుకుండలస్వరూపము. నాలుగునర్ధ చంద్రస్వరూపము, నైదుబిందు

స్వరూపము, గల్గియేకాక్షరప్రణవంబై యుండెను అట్టియోంకారమే పంచముఖపర బ్రహ్మరూపమైయుండి సర్వజగత్తు నిర్మించుటకు విరాడ్విశ్వకర్మమైయుండె గనుక మరియొక్క ప్రమాణంబెరింగించెదవినుము.

## అమరకోశము.

శ్లో॥ స్వయంభూశ్చతురాననః॥

తా॥ అట్టివిరాడ్విశ్వకర్మకు బ్రతినామము చతుర్ముఖబ్రహ్మయనిచెప్పబడుచుండె గనుక మరియొకశ్రుతిప్రమాణం బెరింగించెద వినుము.

## ధ్యానబిందూపనిషత్.

శ్రుతి॥ ఓకారంప్రభవో వేదా । ఓంకారప్రభవా స్వరాః ।
త్రైలోక్యంసచరం । ప్రహ్వాదహతపాపాని।
దీర్ఘంసంప్రతదోవ్యయః । అర్ధమాత్రాసమాయుక్తం।
ప్రణవో మోక్షదాయుతః॥

తా॥ ప్రణవస్వరూపుండైన విశ్వబ్రహ్మమునందు నీసర్వజగత్తు బుట్టియుండెనని చెప్పబడుచుండె గనుక మరియొకశ్రుతిప్రమాణం బెరింగించెదవినుము.

## గోపాలతాపిన్యుపనిషత్.

శ్రుతి॥ ఏకోదేవాసర్వభూతేషుగూఢః॥

తా॥ అట్టిపరబ్రహ్మమగు చైత్యమే సకలభూతములయందు వ్యాపించియుండెనని చెప్పబడుచుండె గనుక శ్రుతి ప్రమాణం బెరింగిం చెదవినుము.

## కఠోపనిషత్.

శ్రుతి॥ ఏక స్తథాసర్వభూయంతరాత్మా।
రూపంరూపంప్రతిరూపోబభూవ॥

తా॥ అట్టిసకలభూతంబులయందు వ్యాపించియుండు చైత్యము సర్వమునందు సమముగానున్నదని చెప్పబడుచుండె గనుక మరియొక శ్రుతిప్రమాణం బెరింగించెదవినుము.

దేవ బ్రాహ్మణమహాత్మ్యము.

శ్రుతి॥ విశ్వకర్మయతీతివిశ్వకర్మా॥

తా॥ విశ్వకర్మయనంతకోటిబ్రహ్మాండంబులనుసృజియించె నని చెప్పబడుచుండె గనుక మరియొక శ్రుతిప్రమాణం బెరింగించెద వినుము.

దేవ బ్రాహ్మణమహాత్మ్యము.

శ్రుతి॥ జీవోఆత్మపరంక్షేత్ర । క్షేత్రజ్ఞఃపరమేశ్వరః॥

తా॥ జీవుడేఆత్మ, దనియందిమిడియున్నపరమాత్మయే క్షేత్రము, అట్టిక్షేత్రజ్ఞుడుపరమేశ్వరు డనిచెప్పబడుచుండె.

దేవ బ్రాహ్మణమాహాత్మ్యము.

శ్రుతి॥ యథాతరంగముల్లోలై । ర్జలమేవంస్ఫురత్యలం ।
ఘటనామాదిదాభాతి । సర్వంబ్రహ్మైవకేవలం॥

తా॥ సర్వలోకములయందు బ్రహ్మనిండియుండె నని చెప్పబడుచుండె గనుక మరియొక శ్రుతిప్రమాణం బెరింగించెదవినుము.

మంత్రపుష్పము.

శ్రుతి॥ విశ్వంనారాయణంగ్ంహరిం । విశ్వమేవేదంపురుషః॥

తా॥ మనుష్యాకృతిగలభగవానుడే విశ్వమై యున్నదనియు, నీవిశ్వమేభగవత్స్వరూపమైయున్నదనియు, జెప్పబడుచుండెమరియు.

దేవ బ్రాహ్మణమహాత్మ్యము.

శ్రుతి॥ విశ్మస్యధారిణంవిశ్వకర్మాదేవా।
సర్వభూతఃయశోబాభ్యం॥

తా॥ సర్వజంతుసంఘములయందు నీవిశ్వకర్మనిండియుండెనని చెప్పబడుచుండె గనుక మరియొక శ్రుతిప్రమాణం బెరింగించెదవినుము.

శ్రుతి॥ ఆత్మావిశ్వకర్మణః । సర్వవ్యాపకోవిశ్వకర్మణః ।
విరాడ్రూపోనారాయణోవిశ్వకర్మణః॥

తా॥ విరాట్పురుషుండైన విశ్వకర్మ సమస్తజంతుజాలముల యందును. ప్రకాశించుచుండెనని చెప్పబడుచుండెగనుక మరియొక శ్రుతిప్రమాణం బెరింగించెదవినుము

కృష్ణయజుర్వేదము 5 వ కాండము.
5 వ ప్రపాఠము 5 వ అనువాకము.

శ్రుతి॥ విశ్వకర్మాదిశాంపతిస్సనః । పశూన్ పాతుసోఽస్మాన్
పాతుతస్మై నమః॥

తా॥ విశ్వకర్మ యష్టదిక్కుల కధిపతిగానుండు ప్రభువని చెప్పబడుచుండె గనుక మరియొక శ్రుతిప్రమాణం బెరింగించెద వినుము.

ఋగ్వేదము.

శ్రుతి॥ అగ్నిమీళేపురోహితం । యజ్ఞస్య దేవమృత్విజం।
హోతారంరత్నధాతమం॥

తా॥ అనుమంత్రంబువలన నగ్నికినాలుగుదిక్కులయందు సానగ సనాతన అహభూన ప్రత్న ఋషులను, మధ్యసుపర్ణమహర్షి నావాహనము జేసి దేవ దానవ యక్ష పిశాచ గరుడ గంధర్వ కిన్నర కింపురుషాది దేవయోనులను, సమస్తమానవులను, దత్స్వరూపము నర్పించి విశ్వకర్మస్వరూపంబైన యగ్నివలన సర్వేష్టకామ్యార్థంబుల నెందుచుండిరి కనుక మరియొక శ్రుతి ప్రమాణము నీ క్రింద వ్రాయుచున్నాము

కృష్ణయజుర్వేదము 4 వ కాండము
3 వ ప్రపాఠము 3 వ అనువాకము.

శ్రుతి॥ ప్రాచీదిశాంవసంతఋతూనా మగ్నిర్దేవతా బ్రహ్మద్రవిణం । ౧
త్రివృత్సోమః సఉపంచదశవర్తని స్త్ర్యవిర్వయః కృతమయానాం । ౨
పురోవాతోవాతఃసానగఋషిఃదక్షిణాదిశాంగ్రీష్మఋతూనా।3
మింద్రోదేవతాక్షత్రద్రవిణం పంచదశఃస్తోమః సఉసప్తదశవర్తని । ౪

ర్దిత్యావాడ్వయస్త్రైతాయానాం దక్షిణాద్వాతో వాతఃసనాతన
ఋషిః । ౫

ప్రతీచీదిశాంవర్షాఋతూనాంవిశ్వే దేవా దేవతావిట్ ద్రవిణం౹౬

సప్తదశఃస్తోమః సఉవేకవిగ్ంశవర్తని స్త్రివత్సోవయోద్వాప
రోయానాం । ౭

పశ్చాద్వాతో వాతో మాభూనఋషిరుదీచీదిశాంశరదృతూనాం౹౮

మిత్రావరుణ దేవతా పుష్టంద్రవిణమేకవింశస్తోమః సఉత్రిణ
వర్తని । ౯

స్తుర్యవాడ్వయఆస్కందోయానాముత్తరాద్వాతో వాతః ప్రత్న
ఋషిః । ౧౦

ఊర్ధ్వాదిశాం హేమంతశిశిరావృతూనాం బృహస్పతిర్దేవతా
వర్చోద్రవిణం । ౧౧

త్రిణవస్తోమః సఉత్రయస్త్రింశవర్తనిః పష్టవాడ్వయోభిభూర
యానాం । ౧౨

విశ్వగ్వాతో వాతః సుపర్ణ ఋషిః పితరఃపితామహాఃపరేవ
రేతేనః । ౧౩

పాంతుతేనోవంత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేస్యామాశిష్యాసాం పు
రోధాయామస్మిన్ । ౧౪

కర్మన్ త్రయస్యాందేవహూత్యాం విశ్వేబ్రహ్మణేస్వాహా విశ్వ
బ్రహ్మణేయఇదంనమమ । ౧౫

తా॥ ఇందులకర్థమేమనియెదరేని పంచముఖపరబ్రహ్మయొక్క సద్యోజాత
ముఖమందు సానగమహర్షియును, వామదేవముఖమందు సనాతనమహర్షియును, అఘోరముఖమందు అభూనసమహర్షియును, తత్పురుషముఖమందు ప్రత్నమహర్షి

యును, నీశాన్యముఖమందు సుపర్ణమహర్షియును. నీయైదుగురుపుత్రులు ఉద్భవించి రని చెప్పబడుచుండె, గనుక మరికొన్ని శ్రుతిప్రమాణము లీక్రింద దాత్పర్య సహితముగను గూర్చి వ్రాయుచున్నాము.

యజుర్వేదము 4 వ అష్టకము
6 వ ప్రశ్న 2 వ అనువాకము.

శ్రుతి॥ యఇమావిశ్వాభువనానిజుహ్వదృషిర్ హోతానిషసాదా
పితానః సఆశిషా ద్రవిణమిచ్ఛమానః పరమచ్ఛదోవరఆవివేశ ॥

తా॥ ఏవిశ్వకర్మయగుపరమేశ్వరుఁడీసమస్తమైనలోకములను సంహరించెనో, యేవిశ్వకర్మసర్వజ్ఞుడై సంహారకర్తయై మాకుదండ్రియై యుండెనో, యావిశ్వకర్మయగుపరమేశ్వరు డాశీర్వచనముచే మరల ధనోపలక్షితమగుజగత్తును సృష్టింపగోరుచున్నవాడై, స్వకీయాద్వితీయ రూపమునావరించుచున్నవాడై, శ్రేష్ఠమగు హృదయపుండరీకస్థానమందు జీవరూపముగా ప్రవేశించినవాడాయెను

శ్రుతి॥ విశ్వకర్మామనసాయద్విహాయాధాతావిధాతాపరమోతసందృక్
తేషామిష్టానిసమిషామదన్తియత్రసప్తర్షీన్పరఏకమాహుః॥

తా॥ సృష్టిస్థితిసంహారకర్మలకు గర్తయగుపరమేశ్వరుడు మన స్సంకల్పమాత్రముచేతనే ఆవిశ్వకర్మను సృష్టించునపుడుత్పాదకుడనియు, పోషించునప్పుడు పోషకుడనియు, లయకాలమందు సంహారకర్తయనియు, నింతేకాక సర్వోత్కృష్టుడనియు, సర్వజ్ఞుడనియు, జెప్పుచున్నారు. మఱియు నేపరాత్పరుడగు విశ్వకర్మయందు మరీచి, అత్రి, ఆంగిరస, పులస్త్య, పులహ, పౌలస్త్యకశ్యపు, లనునప్తర్షులనునైక్యము బొందినవాండ్రనుగా వేదవేత్తలుచెప్పుచున్నారో (యావిరాట్టు) యాసప్తర్షులకు గోరిన వరములను స్వేచ్ఛగానిచ్చుచున్నాడు ఆహేతువు చేత నా ఋషులు మిక్కిలి సంతోషించుచున్నారు

శ్రుతి॥ యోనః పితాజనితా యోవిధాతా యోనస్సతో అభ్యాసజ్జజాన
యోదేవానాంనామధాఏకఏవతగ్ంసంప్రశ్నం భువనా యంత్యన్యాః

తా॥ ఏవిశ్వకర్మ మాకుదండ్రియో (యింతేకాదు ఉత్పాదకుడును, నేవిశ్వకర్మ సర్వజగత్తులను సృజించినవాడో, యేవిశ్వకర్మ మాకభిముఖముగనంతటగనుపడుచున్న

యాభోగ్యజాతమును స్వరూపముగలదానినిగా సృజించెనో, యేవిశ్వకర్మ యనేక రూపములుగా నుద్భవించి యింద్రాదిదేవతలయొక్క నామములధరించుచున్నాడో, యనేకనామధారియైననునావిశ్వకర్మయొక్క దేయగుచున్నాడు ఆవిశ్వకర్మనునితరములగు సమస్త భువనములు ప్రశ్నకలుగునట్లుగా బొందుచున్నవి (అనగా) ప్రళయకాలము నందు విశ్వకర్మయందన్నిలోకములు లీనమగుచున్నవి.

శ్రుతి॥ తఆయజంత ద్రవిణగ్ం సమస్మాఋషయః పూర్వేజరితారో నభూనా। ఆసూర్తా సూర్తారజసోవిమానే యేభూతాని సమ కృణ్వన్నిమాని॥

తా॥ పూర్వమునం దేమరీచ్యాది బ్రహ్మర్షు లీసమ స్తభూతములను, సమకూర్చి నవారును, ధనరూపమగు భోగ్యగజాతమునధికముగ సంపాదించినవారై తిరో యా సర్వజ్ఞులగుఋషులుజీర్ణాంగులుకానివారును, సర్వోత్కృష్టులును, (సర్వకాలములయందు ప్రాణములతో గూడియుండువారలును, రంజనాత్మక విశేషముచే ప్రజలనుగూర్చి విశేషముగా సృష్టిప్రవర్తనవిషయమై (ప్రేరేపించబడినవారు) నగుచున్నారుగదా.

శ్రుతి॥ నతంవిదాథయఇదంజజానాన్యద్యుష్మాకమంతరంభవాతి। నీహారేణప్రావృతాజల్ప్యాచాసుతృపడుక్థశాసశ్చరంతి॥

తా॥ ఏ విశ్వకర్మ యీ జగత్తును సృజించెనో యావిశ్వకర్మను (ఆయనచే సృజించబడిన మీరు) తెలసికొనుటలేదు. మీకితరమైన సర్వవేదాంతవేద్యమగునీశ్వర తత్వముంటున్నది. అదిమనమెందువలన దెలసికొనలేమంటే (జీవులందరు) మంచు వంటియజ్ఞానముచే గప్పబడిన వారును, ననృతములుబలుకుటయందాశక్తిగలవారును, ప్రాణములేవిధముగానైన దృప్తిబొందినజాలుననువారును, స్వర్గమును గోరియజ్ఞ కర్మలయందాసక్తిగలవారును, నై సంచరించుచున్నారు. ఆ కారణమువలన జ్ఞాన హీనులై కర్మాధీనులగువారికి దత్వజ్ఞానము కలుగదని తెలియబడుచున్నది.

శ్రుతి॥ పరోదివాపరఏనా। పృథివ్యాపరోదేవేభిరసురైర్గుహాయత్। కగ్ంస్విద్గర్భంప్రథమందధ్రఆపోయత్రదేవాస్సమగచ్ఛంతవిశ్వే॥

తా॥ ఏపరతత్వము హృదయ పుండరీకమునందు (రహస్యముగా జేయబడినదో యది) స్వర్గలోకమునకంటె విలక్షణమైనది. ఈ భూమికంటె విలక్షణమైనది. దేవతలచేత రాక్షసులచేత బొందబడక దూరమందుండునదియు (గురుశాస్త్రవిముఖులకు బొందశక్యముగానిదని తాత్పర్యము) ఏగర్భమునందు సమస్తమైన దేవతలు కూడి ప్రవర్తించిరో యాకంస్విత్తనేపేరుగల గర్భమును నుదకములు మొదట ధరించినవి. అనగా సృష్ట్యాదియం దుదకములే కంస్విత్తనేగర్భము ధరించబడి యాగర్భమునం దనేకప్రాణు లుద్భవించియుండె నని శాస్త్రప్రసిద్ధము.

శ్రుతి॥ ఆజస్యనాభావధ్యేకమర్పితంయస్మిన్నిదంవిశ్వంభువనమధిశ్రితం ॥

తా॥ ఏగర్భమందీసర్వప్రపంచ మధిష్ఠించియున్నదో యా యొక్కటియగు బీజము జన్మరహితమగు పరమేశ్వర తత్వముయొక్క నాభియం దధికరణముగా స్థాపింపబడినది

శ్రుతి॥ విశ్వకర్మాహ్యజనిష్ఠదేవ ఆదిద్గంధర్వోఅభవద్ద్వితీయః తృతీయఃపితాజనితౌషధీనాం । అపాంగర్భంవ్యదధాత్పురుత్రా॥

తా॥ సృష్టికర్తయగు పరమేశ్వరు (డాబీజమువలన) బ్రహ్మస్వరూపుడై పుట్టినవాడాయెను అనంతరమునందు రెండవవాడగు గంధర్వుడును నాయెను. మూడవవాడగు నోషధులకు బాలించువాడును నుత్పాదకుడును నగు (చంద్రుండును) నాయెను. ఆ బ్రహ్మండమును (నాపరమేశ్వరు) డనేకవిధములుగా సృష్టించినవాడాయెను.

శ్రుతి॥ చక్షుషః పితామనసాహిధీరోఘృతమేనేఅజనన్నన్నమానే । యదేదంతాఅదదృగ్ంహంతపూర్వఆదిద్ద్యావాపృథివీఅప్రథేతాం॥

తా॥ చక్షురాది ప్రాణసమూహమున కుత్పాదకుడును, ధైర్యవంతుడును, నగు విశ్వకర్మ మనస్సుచేత నాజ్యమువలె (ప్రాణులకుపభోగసాధనములగు) నీ స్వర్గమర్త్యలోకముల బరస్పరానురాగముగలుగునట్లుగ సృష్టించినవాడాయెను. ఎప్పుడైతే ప్రథమోత్పన్నులగునానన యుక్తులైన చేష్టావంతులగుసానగాదులు దృఢముగలవారైతిరో యనంతరమునందే స్వర్గమర్త్యలోకములు (విస్తారముగ) నయినవి).

శ్రుతి॥ విశ్వతశ్చక్షురుతవిశ్వతోముఖోవిశ్వతోహస్తఉతవిశ్వతస్పాత్।
సంబాహుభ్యాంనమతిసంపతత్రైర్ద్యావాపృథివీజనయన్ దేవఏకః॥

తా॥ అంతట నేత్రములు గలిగినట్టియు, సర్వత్రముఖములు గలిగినట్టియు, నంతట బాహువులు గలిగినట్టియు, నంతటను పాదములుగలిగినట్టియు, స్వయం ప్రకాశుడును, నద్వితీయుడునునగు విశ్వకర్మ స్వర్గమర్త్యలోకములను సృజించుచున్నవాడై బాహుస్వరూపులగు రాజులచేతను, మిక్కిలి పతనశీలములగు ననిత్యోపాదాన కారణములచేతను, (సర్వజగత్తును) స్వాధీనమగుదానినిగా జేయుచున్నాడు

శ్రుతి॥ కిగంస్విదాసీదధిష్టానమారంభణంకతమత్స్విత్కామాసీత్। యదీ
భూమింజనయన్। విశ్వకర్మావిద్యామౌర్ణోన్మహినావిశ్వచక్షాః॥

తా॥ సర్వద్రష్టయగువిరాట్పురుషుడు విశేషమగు స్వర్గమును భూలోకమును, సృష్టించుచున్నవాడైతే (యావిశ్వకర్మకు) నివాసస్థానమేదైయుండెను ?నుపాదాన కారణమేదియైయుండెను? నీశంకయందీశ్వరుడునిరపేక్షుడగుటవలన మరియొకవస్తువలనసృష్టించినవాడు గాడనియర్థము. ఇకనేమనిన నావిశ్వకర్మ తనయొక్కమహిమచేతనే స్వర్గమును భూమిని గప్పివేసినవాడాయెను. పరమేశ్వరుడగువిశ్వకర్మ యోచింపశక్యముగాని మహిమగలవాడనియర్థము.

శ్రుతి॥ కిగంస్విద్వనంక ఉసవృక్షఆసీద్యతోద్యావాపృథివీనిష్టతదిక్షుః।
మనీషిణోమనసాపృచ్ఛతేదుతద్యదధ్యతిష్ఠద్భువనానిధారయన్ ॥

తా॥ (ఈవిశ్వకర్మయొక్క సాధనములకు) నెక్కడవనము? దానిపేరేమి? యావన మందే ? శ్రేష్ఠమగు వృక్షమో యా వృక్షమేమి పేరు గలదై యుండెను ? స్వర్గమర్త్యలోకములెట్లుసృష్టింపబడినవి? ఈప్రకారముగనోవిద్వాంసులారా! మీమనస్సుతో విచారించియడిగినచో (నావిశ్వకర్మ సమస్తజగత్తులను ధరించుచున్నవాడై యేస్థానమునధిష్టించెనోయాస్థానమునుగూర్చి (ప్రత్యుత్తరము బ్రాహ్మణమనే గ్రంథమునందు సమాధానము జెప్పబడియున్నది) అన్నిటికిని నాధారభూతుడగు నావిరాట్పురుషుడు తనసంకల్పమాత్రముచేతనే సమస్తజగత్తులసృజించుచున్నాడని తెలియవలయును.

శ్రుతి॥ యాతేధామానిపరమాణియాఽవమాయామధ్యమావిశ్వకర్మ
న్నుతేమా। శిక్షాసఖిభ్యోహవిషిస్వధావస్స్వయంయజస్వతను
వంజుషాణః॥

తా॥ ఓపరమేశ్వరుడవగువిశ్వకర్మా । నీసంబంధములైన యేవి యుత్కృష్ట ములగుస్థానములుకలవో. యేవిమధ్యమస్థానములో, యేవియధమస్థానములో, నీమూడు స్థానములను స్నేహితులవలె ప్రియులైన వారలకొఱకు హవిః ప్రదానవిషయమై నుపదేసించుము, మరియు స్వధోపలక్షిత హవిర్లక్షణము గల యోవిశ్వకర్మా ! యజమాన శరీరమును బొందినవాడవై స్వయముగ యజ్ఞమునుజేయుము. నీయను గ్రహమున్నినా యెవడు యజ్ఞముజేయుటకు సమర్థుడగుచున్నాడు ? (అనగా) నీవే కర్త్రవు నీవే భోక్తవని యభిప్రాయము

శ్రుతి॥ వాచస్పతింవిశ్వకర్మాణమూతయే । మనోయుజంవాజే అద్యా
హువేమ। సనో నేదిష్టాహవనానిజోషతే విశ్వశంభోరవసే
సాధుకర్మా

తా॥ ఆ పరమేశ్వరుడు మా సంబంధమైన సమీపమందున్న హవిస్సులను స్వీకరించుచున్నవాడును, సమస్తజగత్తులకు సుఖమిచ్చు వాడును, మమ్మురక్షించుట కొఱకు యోగ్యమగువ్యవహారముగల వాడును (అందువలననే యావేదవాక్కులకు ప్రభువైనట్టియు, మా మనస్సులతో గూడియున్న పరమేశ్వరుడగు విశ్వకర్మను నిప్పుడు జరుగుచున్న యజ్ఞమునందు రక్షణకొఱకు ధ్యానరూపముగ నా వాహనమ్ము జేయుచున్నాము.

శ్రుతి॥విశ్వకర్మన్ హవిషా వావృధానస్స్వయంయజస్వతనువంజుషాణః
ముహ్యంత్వన్యేఅభితస్సపత్నాఇహాఽస్మాకంమఘవాసూరిస్తు॥

తా॥ ఓ విశ్వకర్మా! ఆజ్యాదిహవిస్సుచే మిక్కిలి వృద్ధిబొందుచున్నవాడవై శరీరమును స్వీకరించుచున్నవాడవై స్వయముగ యజ్ఞమును జేయుము. మా కంటె నితరులగు శత్రువులంతటను భ్రాంతిని బొందుదురుగాక పూజ్యుడైనట్టియు విద్వాంసుడైన పుత్రుడునగుగాక.

శ్రుతి॥ విశ్వకర్మన్ హవిషావర్ధనేన త్రాతారమింద్ర మకృణోరవధ్యం। తస్మై విశస్సమనమంత పూర్వీరయముగ్రో విహవ్యో యథాఽసత్ ॥

తా॥ ఓ విశ్వకర్మా! హవిస్సుచే నీవు వృద్ధితో గూడుకొనియున్నవాడవై యీయజమానుని నన్యులకు రక్షకునిగాను, బరమైశ్వర్య యుక్తునిగాను, దేనిచేతను గొట్టబడనివానినిగాను, జేయుదువో యా యజమానునికొఱకు బూర్వమందు బ్రవేశించిన ప్రజలు స్వాధీనులగుదురుగాక. ఈ యజమానుడు తీవ్రశక్తిగలవాడును, వివిధయాగయోగ్యుడును, నెవిధిగా నగునో యాప్రకారముగజేయుము.

శ్రుతి॥ సముద్రాయవయునాయసింధూనాంపతయేనమః। నదీనాగ్ం సర్వాసాంపిత్రేజుహుతా విశ్వకర్మణే విశ్వాఽహామర్త్యగ్ంహవిః

తా॥ సముద్రస్వరూపుడైనట్టియు, సమస్తనదులకు భర్తయైనట్టియు, సృష్టాదకుడైన విశ్వకర్మకొఱకు నమస్కారము. ఇంతియేకాక యావిశ్వకర్మకొఱకు బ్రతిదినము నక్షయమగు నాజ్యాదిహవిస్సును నగ్నిముఖమందు హోమముచేయుచుందుము. దేవతలగ్నియేముఖముగా గలవారు (అనగా) నగ్నిముఖమందుంచిన యాజ్యాదిహవిస్సు దేవతలకు జెందుననిభావము. గనుక విశ్వబ్రాహ్మణశబ్దార్థమును గూర్చి వ్యాసప్రణీతంబైన శ్రీమహాభారతమునందుండు శ్లోకము నీక్రింద వ్రాయుచున్నాము.

విశ్వబ్రాహ్మణశబ్దార్థము
(శ్రీ)మహాభారతము

శ్లో॥ విశ్వంశతంసహస్రంచ। సర్వమష్టయువాచకం ॥

తా॥ ఇందుల భావముననుసరించి రుద్రభాష్యమునందుగూడా వ్రాయబడియున్నది. అందువలన బూర్వోక్తమైన శ్లోకములోని విశ్వశబ్దమునకు వచించిన శతసంఖ్య పరిమితినిబట్టి యీవిశ్వబ్రాహ్మణశబ్దము నన్వయించుకొనవలయును. అదెట్లనిన నీవిశ్వబ్రాహ్మణుడు శతసంఖ్యాకములైన పనులు (అనగాగర్మలను) జేయువాడు కనుక నిట్టిస్థితిలో నుండినప్పు డీవిశ్వబ్రాహ్మణశబ్దము సాధువుగాదని చెప్పుట కెటుపొసగును? మఱియు నప్పటచ్చట వేదపంచకమునం దిరువురు

బ్రాహ్మణులు విశ్వకర్మనామంబును ధరించినవారుండినట్లు గన్పట్టుచున్నది ఆయిరువురిలో మొదట విశ్వకర్మ నామంబును ధరించినవాడు సర్వజగత్సృష్టికర్తయగు పరమేశ్వరుఁడై యున్నాడు రెండవ విశ్వకర్మయనువాడు బ్రాహ్మణుడైన భువన మహర్షియొక్క పదుమువ్వురు పుత్రులలో నొకడై యుండె గనుక నిందుకు ప్రమాణం బెరింగించెదవినుము.

భువనమహర్షి సంతతి

అథర్వణవేదము. 3 వ కాండము 5 వ అనువాకము

29 వ సూత్రము 1 వ మంత్రము

శ్రుతి॥ యత్వాహోతారంమనసాభిసంవిదు స్త్రయోదశభౌవనాః ॥

తా॥ ఇందులభావమేమనిన భువనమహర్షికి బదుమువ్వురు పుత్రులు గల్గి యుండిరని చెప్పబడుచుండెను మరియు.

విద్యారణ్యభాష్యము

విశ్వకర్మా భౌవనాః స్వాత్మని సర్వాణిభూతాని జుహువాంచకార॥

నిరుక్తవ్యాకరణము, 10-2-9

ఇత్యాదిశ్రుత్యంతరప్రసిద్ధాభువనాఖ్యస్యమహర్షేః పుత్రా విశ్వకర్మప్రభృతయః త్రయోదశసంఖ్యాకాః ॥

తా॥ ఇందువల్ల దెలియఁబడిన దేమన్నను బ్రాహ్మణుఁడైన భువనమహర్షి యొక్క పదముగ్గురు పుత్రులలో విశ్వకర్మ యనువాడొకఁడని తెలియబడుచుండె నింతియేకాక పైయర్థమును ద్రువపరచుటకై మరియు నెరింగించెదవినుము.

విష్ణురహస్యము 35 వ అధ్యాయము

శ్లో॥ భువనోనామయోదేవో । విశ్వకర్మాతత్సుతః ।
ప్రసిద్ధోయస్యశాస్త్రేషు । భౌవనఃసురవర్ధకః ।

విశ్వకర్మాసృజయంతత్ర । చ్ఛిత్వాలోకాన్వినిర్మమే ।
ప్రాసాదాంశ్చవిమానాని । వాప్యుద్యానాన్యలంకృతిః ।
వస్త్రవాద్యాదివస్తూని । చిత్రాణిచపృథక్ పృథక్ ॥

తా॥ ఇందుల భావమేమనియేదరేని భువనాఖ్య దనువిద్వాంసుని పుత్రులందరు సమస్తవేద ధర్మశాస్త్రములయందును దేవతలయొక్క శిల్పకార్యముంయందును విఖ్యాతులై యుండిరి అందు విశ్వకర్మయనువాడు జన్మతః మనుష్యుడై శిల్పమాదిగాగల వృత్తుల నవలంబించి స్వయముగ గట్టులను ఛేదించి లోకంబునకు గృహములను గొప్పగొప్ప మేడలను నిర్మించి యిచ్చినవాడాయెను. మరియు విమానములను, నుద్యానవనములను, వస్త్రములను నేయునట్టి పరికరములను, పృథక్కు పృథక్కుగానుండు నానావిధవాద్యములను, గల్పనజేసి సృష్టింపుచుండి యతండు బ్రాహ్మణుడై యుండియు దపోమహిమచే మహర్షియై యజ్ఞాదులచే దేవత్వమును బొంది తుదకు బ్రజాపతి (చతుర్ముఖబ్రహ్మ) యైనట్లు వంచవేదములయందు దెలియబడుచున్నది కనుక నిందుకు బ్రమాణం బెరింగించెదవినుము.

ఋగ్వేదము అష్టకము 1 సూ 3' వర్గ 36. మంత్రము 2.

శ్రుతి॥ అహన్న పర్వతేశిశ్రియాణాంత్వష్టాస్మై ।
వజ్రం స్వర్యంతతక్షవాశ్రా ఇవ ధేనవస్స్యందమానా ।
అంజసముద్రమవజగ్మురాపః ॥

తా॥ అనగా నీ రెండవ విశ్వకర్మయగు త్వష్టబ్రహ్మ నిర్మించి యిచ్చిన వజ్రాయుధముచే నింద్రుడు మేఘములను భేదింపగా స్రవించిన యుదకములు నదీప్రవాహములై లేగలనుగూర్చి వచ్చునప్పు డావులు హుంకారముతో వేగముగా వచ్చినట్లు గొప్పధ్వనితోగూడా సముద్రమున బ్రవేశించినవని చెప్పబడుచుండెగనుక మరియొక ప్రమాణం బెరింగించెదవినుము.

సదాచారవిచారము 42 వ పత్రము.

శ్లో॥ విశ్వబ్రహ్మోభవాకేచిత్ ॥

తా॥ అని యిట్లు ప్రపంచమున విశ్వబ్రహ్మ యనువారు కొందరున్నారని బొసగినందున నీవిశ్వబ్రాహ్మణులను విశ్వబ్రహ్మసంతతివారని సిద్ధాంతపలచి యుండిరి కనుక మరియు.

## తైత్తిరీయఅరణ్యక ప్రశ్నము 3 వ అనువాకము.

### 13 వ దశకము 1-2 మంత్రములు.

శ్రుతి॥ అద్భ్యస్సంభూతః పృథివ్యైరసాచ్చవిశ్వకర్మణః ।
సమవర్తతాధి తస్యత్వష్టా విదధద్రూపమేతి ।
తత్పురుషస్య విశ్వమాజానమగ్రే వేదాప్రజాపతి ॥
శ్చరతి ఇత్యాదినా యో దేవేభ్య ఆతపతి యో దేవానాం ।
పురోహితః నమోరుచాయబ్రహ్మణే ॥

భా॥ యత స్త్వష్టా దేవేభ్యః ఆతపతి దేవాన్ అభివ్యాప్య తపతి దేవా ఆదిత్యాః మను యో దేవానాం పురోహితః దేవానాం పురోహితో బృహస్పతి ర్విశ్వకర్మైవతథా మంత్రాంతరం (వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే) వాచస్పతిర్విశ్వకర్మాఽభూదితి బ్రహ్మణవాచేవ వాగేవ బ్రహ్మ తస్యాఏవపతి స్తమాహుర్బ్రహ్మణస్పతి రితి బృహదారణ్యక దర్శనాత్ ॥

తా॥ త్వష్ట యేకారణమున దేవతలను వ్యాపించి తపింపజేయుచున్నాడో యాకారణమున నాదిత్యులకు రాబోవుకాలమున హితము గోరుచున్నాడనియును, దేవపురోహిత బృహస్పతి విశ్వకర్మయే యనియును, దెలియబడుచున్నది. ఇందుకు దృష్టాంతము (వాచస్పతిం విశ్వకర్మాణమూతయే) అనగా వాచస్పతియే విశ్వకర్మయై యుండెనని భావము మరియు బ్రహ్మణస్పతి యనగా నర్థమేమనియెదరేని బ్రాహ్మణ మను వాక్యమే బ్రహ్మ. యీ వాక్యములకు బతియైయుండుటచే నతనిని బ్రహ్మణస్పతియని బృహదారణ్యకమందు జెప్పియున్నది.

### విష్ణుసహస్రనామము.

శ్లో॥ విశ్వకర్మామనుస్త్వష్టా । స్థవిష్ఠస్థవిరోధ్రువః ॥

తా॥ అని యిట్లు విశ్వకర్మ త్వష్ట యను నీ రెండు శబ్దములు పర్యాయశబ్దములుగను జెప్పబడియున్నది కనుక నీవిశ్వకర్మ జగత్తు సృష్టింపబడియున్నట్టు పంచవేదములయం దనేకప్రమాణములు గన్పట్టుచున్నవి మరియు.

శ్రుతి॥ త్వష్టేదంభువనంజజాన ॥

తా॥ అని యిట్లు చక్కగా దెలియబడుచున్నది. ఇంతియేకాదు విశ్వకర్మ యనగా.

భా॥ విశ్వంకృత్స్నంకర్మక్రియావ్యాపారోయస్యసఃవిశ్వకర్మా । ౧
విశ్వం ప్రపంచ కర్మయస్యసః విశ్వకర్మా । ౨
విశ్వంకర్మ యస్యసః విశ్వకర్మా । ౩
విశ్వంసర్వకర్మక్రియామాణమ్యః స్యసః విశ్వకర్మా । ౪
విశ్వం కర్మక్రియా యస్యసః విశ్వకర్మా ॥ ౫

తా। ఇందలి ముఖ్య భావమేమనిన విశ్వమనగా సమస్తమైన జగత్తును సృజింపజేయుట యెవనికిగలదో యట్టివాడు విశ్వకర్మయని చెప్పబడుచున్నాడు కనుక మరియొకప్రమాణం బెరింగించెద వినుము.

## తైత్తిరీయోపనిషత్.

శ్రుతి॥ యతోవాఇమానిభూతానిజాయంతేయేనజాతానిజీవంతి ।
యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి ॥

తా॥ అను నీ శ్రుతి ననుసరించి యెవనివలన సమస్తమైన భూతములు బుట్టుచున్నవో యెవనివలన బుట్టిన భూతంబులు జీవింపబడుచున్నవో యెవనివలన జీవింపబడు భూతంబులు నశింపబడుచున్నవో యట్టివాడు బ్రహ్మస్వరూపుఁడగు పరమేశ్వరు డని తెలియబడుచుండుటవలన నా విశ్వకర్మ పరమేశ్వరుఁడని రాద్ధాంత పఱచుచున్నాము.

## కృష్ణయజుర్వేదము 4 వ కాండము.

### 3 వ ప్రపాఠము 3 వ అనువాకము 3 వ మంత్రము.

శ్రుతి॥ విశ్వకర్మఋషిః ॥

అథర్వణవేదము 3 వ సంపుటము 1 వ సూక్తము.

13 వ మంత్రము 12 వ కాండము 204 వ పత్రము.

శ్రుతి॥ యస్యాం వేదపరిగృహ్ణాంతి భూమ్యాం యస్యాం యజ్ఞ తన్వతే
విశ్వకర్మా ॥

తా॥ అను నీరెండు శ్రుతులయందు జెప్పఁబడిన విశ్వకర్మయను నతడు పూర్వోక్తవిధి ననుసరించి భువనమహర్షియొక్క రెండవపుత్రుం డగుటవలన నతండు బ్రాహ్మణుఁడై తపోమహిమచే మహర్షియై దేవశిల్పకుఁడై యజ్ఞాదులచే దేవత్వమును బొందుటయేగాక తుదకు ప్రజాపతి (బ్రహ్మ) యైనట్టు జెప్పఁబడు చుండె, గనుక మఱియు నెరింగించెద వినుము.

కృష్ణయజుర్వేదము 3 వ కాండము 4 వ ప్రపాఠము.

7 వ అనువాకము 1 వ మంత్రము.

శ్రుతి॥ ప్రజాపతిర్విశ్వకర్మామనః ॥

ఉపనిషత్.

శ్రుతి॥ ప్రజాపతిర్విశ్వకర్మా మనోగంధర్వ స్తస్యరాఌ
మాన్యప్సరసోవహ్నయోనామన ఇదంబ్రహ్మ
క్షత్రంపాతుతస్మై స్వాహా ॥

తా॥ అను నీరెండు శ్రుతులయందుగూడా చెప్పియుండిన విశ్వకర్మ యను నతడు పైనిజెప్పిన భువనమహర్షియొక్క రెండవ పుత్రుండై తుదకు ప్రజాపతి (బ్రహ్మ) యైనట్టి స్పష్టముగా దెలియబడుచుండె గనుక నీక్రిందగంసాల శబ్దోత్పత్తిని గూర్చి వ్రాయుచున్నాము.

కంసాలశబ్దోత్పత్తిక్రమము.

అమరకోశము ద్వితీయకాండము.

శ్లో॥ కంవారిశిచమూర్ధని॥

తా॥ కంశాల యనువదమున కాద్యంబునజెప్పియుండు కకారము బిందువుతో గూడియున్నందున నదియుదకమునకు శిరస్సునకు రెండర్థంబులయ్యె శాలయను రెండక్షరములు నివాసంబునకు గృహంబున కర్థంబయ్యె గనుక నీరెండర్థంబుల ననుసరించి చెప్పెదవినుము.

## దేవబ్రాహ్మణమహాత్మ్యము

శ్రుతి॥ పఞ్చముహో బ్రహ్మభ్యో అఖిలంజగత్ ॥

తా॥ పూర్వము పంచముఖ విశ్వకర్మ తన మాయచేత సర్వ ప్రపంచము సృజించుటకు ముందుగా.

## మూలస్తంభము.

శ్లో॥ ఆపఃపృథివిసంభూతాః ॥

తా॥ ఉదకము నిర్మించి యందుమీద భూమి నిర్మాణము జేసి దానిపై బ్రహ్మాండమంతయు నొక్క గృహంబుగా నిర్మించుటచేతనే కంశాలయను పౌరుష బిరుదాంకితము కలిగియుండె గాలక్రమంబున శబ్దయోగభేదముచేత గంసాల యను పేరుతో బ్రజలు పిలచుచుండిరి కనుక మరియు నెఱింగించెద వినుము.

## దేవబ్రాహ్మణమహాత్మ్యము.

శ్లో॥ విశ్వకర్మాసదానందో । పంచాస్యో మేరునిర్మితః ॥

తా॥ విశ్వకర్మ యాకాశంబునకు దిగువ భూమియందు మహా మేరుపర్వతము నిర్మించి దానిమీదను (అగశాలః) అనునప్పుడు మొదట నగ యను రెండక్షరములు పర్వతంబున కర్థంబు గలిగియుండుటనుబట్టి యామేరుపర్వతము మీద దేవతా గృహంబులను గట్టుటవలన నగసాలయను రెండవ పౌరుషనామంబుగూడా యతనికే గల్గియుండె నందువలన నీక్రిందశ్లోకమునుబట్టి యతండే భగవంతుండని తెలియబడు చుండె నది యెట్లనిన.

## దేవబ్రాహ్మణమహాత్మ్యము.

శ్లో॥ కంసాలో శ్రీమహారేనామ । బ్రాహ్మణో హరికేతనః ॥

తా॥ విశ్వకర్మ వంశోద్భవుండైన శ్రీమన్నారాయణుండే బ్రాహ్మణ స్వరూపుండని చెప్పబడుచుండె గనుక రథకారబ్రాహ్మణ శబ్దోత్పత్తిక్రమం బెరింగించెద వినుము.

రథకారబ్రాహ్మణశబ్దోత్పత్తి.

స్కందపురాణనాగరఖండము.

శ్లో॥ దారుకారస్స్వర్ణకారః । శిలాకారస్తథైవచ ।
అయస్కారోలోహకారః । పఞ్చైతేరథకారకాః ॥

శ్లో॥ విశ్వకర్మసుతాహ్యేతే । రథకారస్తుపంచచ ।
వైదికేనైవమార్గేణ । తద్వంశానాంవిశేషితః ॥

తా॥ ఈ రెంటియందు జెప్పబడిన ప్రకారము విశ్వకర్మపుత్రులగు మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞు లను పంచబ్రహ్మలు పంచకృత్యము లాదిగాగల రథ నిర్మాణములను జేయుటవలన రథకారు లను పేరుగలిగి యుండెను. నీరథకారాది శబ్దవాచ్యులగు విశ్వబ్రాహ్మణులు బ్రాహ్మణజాతి వాచ్యులై యున్నా రనుటకే యభ్యంతరమును గన్పట్టజాలదు కనుక మరియొక ప్రమాణం బెరింగించెద వినుము.

నానార్థరత్నమాల 246 వ పేజి

శ్లో॥ రథకారస్తక్షణిస్యా । న్మాహిష్యాత్కరణీభవే ॥

తా॥ ఇందుల కర్థమేమనియెదరేని తక్షకవంశజులగు విశ్వబ్రాహ్మణులు రథ కారు లనియును, గరణజాతి స్త్రీయందు మాహిష్యపురుషుని వలన జన్మించినవారు కూడా రథకారులనియును, రెండు విధంబులుగ జెప్పబడుచుండె గనుక నిందును గూర్చి పాణినీమహర్షి వ్యాకరణ సూత్రము లీక్రింద వ్రాయుచున్నాము.

పాణినీసూత్రము 6, 2, 77.

సూ॥ సంజ్ఞాయాంచ ॥

సిద్ధాంతకౌముది సర్వప్రక్రియ 326 వ పత్రము.

అణంతేపరేతస్తువాచయోర్నామక్రిమిః అకర్తృఙ్ ఇత్యేవరథకారో నామ బ్రాహ్మణః ॥

### పాణినీసూత్రము 6, 2, 77

సూ॥ సంజ్ఞాయాంచ ॥

### కాశికావృత్తి 2 వ సంపుటము 184 వ పత్రము.

సూ॥ సంజ్ఞాయాం విషయేఽణన్త ఉత్తరపదేఽకృఞ్ పూర్వపద మాద్యుదాత్తంభవతి తన్తువాయోనామకీటః వాలవాయో నామపర్వతః । రథకారోనామబ్రాహ్మణః ॥

తా॥ ఇందుల కర్థమేమనిన బూర్వోక్తమైన యణ్ ప్రత్యయాంతశబ్దము సంజ్ఞావాచకశబ్దము ఆద్యుదాత్తమువల్ల సిద్ధమగుచున్నది. ఇందుల కుదాహరణ మేమనిన దంతువాయ మనుకీటక మొకవిధమైన తన శరీరమునుండి రాబడు తంతువులచే గోష్ఠ మను నొకదానిని నిర్మించునట్టి క్రిమిజాతి విశేషమైన కీటకమై యున్నది. ఈ కీటకమునందు జాతిచే గ్రిమిత్వమును గుణమున ననగా వ్యాపారము చేతను శరీరమునందు జనించునట్టి తంతువులచే గోష్ఠనిర్మాణరూపమైన శిల్పిత్వ మును జూపించుచున్నది మరియును (కృఞ్) ధాతుపూర్వకమునందు (అణ్) అంత్యము, సంజ్ఞావాచకమై యంత్యోదాత్త మగుటవలన శిల్పివాచకమైయున్నది. ఇందుల కుదాహరణ మెట్లనిన వాజపేయమైనాది యజ్ఞసంబంధములైనట్టివియును, దేవసంబంధములైనట్టివియును, నీ మొదలగు పవిత్రములైన కార్యములగు రథ ములు మొదలగువానిని జేయునట్టి బ్రాహ్మణజాతి విశేషుడు రథకారు డనబడు చున్నాడు. ఈ సంజ్ఞా సూత్రము ననుసరించి రథకారశబ్దము శిల్పముతో గూడిన బ్రాహ్మణజాతి విశేషమైయున్నదని తెలియబడుచున్నది ఇంతియేగాదు.

### ఆపస్తంబశ్రౌతసూత్రము.

సూ॥ వసంతే బ్రాహ్మణస్య గ్రీష్మే రాజన్యస్య హేమంతో వాశరద్వైశ్యస్య వర్షాసురథకారస్య ॥

తా॥ బ్రాహ్మణుడు వసంతఋతువునందును, క్షత్రియుడు గ్రీష్మఋతువు నందును, అథవా హేమంతఋతువునందును, వైశ్యుడు శరదృతువునందును, రథకారుడు వర్షఋతువునందును, నాధానమొనర్పదగి యున్నాడని చెప్పబడు చుండెను. కనుక నిందుకు సరియైన మరియొక ప్రమాణం బెరింగించెద వినుము.

రుద్రదత్తవ్యాఖ్యానము.

వ్యా॥ ఆధానకాలఇతి శేషః కిమత్రరథకారఇతిద్విజాతిభ్యః అన్యజాతీయస్య అంతర ప్రభవస్య గ్రహణం నేత్యాహ ॥

తా॥ ఈ రథకారులు బ్రాహ్మణజాతిలో జేరినవారని వక్కాణింపుచుండె గనుక నింకొక ప్రమాణం బెరింగించెద వినుము

ఆపస్తంబశ్రౌతసూత్రము.

సూ॥ యేత్రయాణాం వర్ణానా మేతత్కర్మకుర్యుస్తేషామేషకాలః ॥

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య లను మూడువర్ణములయం దెవ్వరైనను రథనిర్మాణ మొనర్చుచుండువారే రథకారు లనిచెప్పబడుచుండె గనుక నిందుకు సరియగు మరియొక ప్రమాణం బెరింగించెద వినుము

రుద్రదత్తవ్యాఖ్యానము.

వ్యా॥ త్రిషువర్ణేషు అంతర్భూతఏవయేరథం
కుర్వంతి తేషామయమాధానకాలః ॥

తా॥ ఈ రథకారులు మూడు కులములలో జేరినవారని చెప్పబడుచుండె గనుక నిందుకు సరియగు మరియొక ప్రమాణం బెరింగించెద వినుము.

ధూర్తస్వామిభాష్యము.

భా॥ ఇదానీంత్వయమభిప్రాయః సూత్రకారస్య త్రయాణా మంతర్భూతఏవ యేకుర్వంతి రథకరణం తేరథకారాః ॥

తా॥ ఇందుల కర్థమేమనిన బై జెప్పబడినరీతిగ విశ్వబ్రాహ్మణులకు రథకారు లను నామంబు చెల్లుచుండెనని చెప్పబడుచుండె గనుక మరియొక ప్రమాణం బెరింగించెద వినుము.

తైత్తిరీయోపనిషత్.

అష్టకము 1 ప్రకరణము 1 అనువాకము 34.

శ్రు॥ ఋభూణాంత్వాదేవానాం వ్రతపతే వ్రతేన దధామీతి రథకారస్య ॥

తా॥ ఈ ఋభువులను రథకారులు సుధన్వునిసంతని వారగు విశ్వబ్రాహ్మణులని చెప్పబడుచుండె గనుక మరియు నెరింగించెద వినుము

## తక్షకశబ్దోత్పత్తి.

### అమరకోశము 2 వ కాండము.

శ్లో॥ తక్షాతువర్ధకి స్త్వష్టా । రథకారశ్చకాష్టతట్ ॥

తా॥ ఇందువలన దక్షకశబ్దము రథకారశబ్దమునకు బర్యాయశబ్దమైయున్నదని యెప్పుడు దెలియబడినదో యప్పుడు పూర్వోక్తవిధి ననుసరించి రథకారులు బ్రాహ్మణులై యున్నారని స్పష్టముగ దెలియబరచుట యైనది. ఈ తక్షకశబ్దము రథకారశబ్దమునకు బర్యాయపద మగుటవలన గుణవాచకముచే భిన్నార్థముగ స్ఫురించుచున్నను జాతివాచకముక్రింద మాత్రము రథకారశబ్దమునకు బర్యాయపదమై యున్నది అట్టి విశ్వకర్మశబ్దము పూర్వోక్తమైన రథకార శబ్దమునకు బర్యాయ శబ్దమగునో కాదో యిట్టి విషయము దెలసుకొనుట యవసరమైయున్నది. ఇంతియె కాక విశ్వబ్రహ్మకులోత్సాహ యను గ్రంథమునందు నాగరభాషలో ననేకంగు ప్రమాణములున్నవి. వానినన్నిటి నిచ్చట వ్రాయుటను గురించి విరమించుకొంటిమి. కనుక సుధన్వుని జన్మనిర్ణయం బెరింగించెద వినుము.

## సుధన్వునిజన్మనిర్ణయము.

### ఋగ్వేదము అష్టకము 1, 7, 30, 4.

శ్రుతి॥ విష్ట్వీశమీతరణిత్వేనవాఘతో మర్తాసస్సంతో । అమృతత్వమానశుః । సౌధన్వనాఋభవస్సూరచక్షసస్సంవత్సరేసమపృచ్యంతధీతిభిః ॥

తా॥ ఇందుల భావమేమనియెదరేని ఋత్విక్కులతో గూడిన ఋభువులు యజ్ఞములను దానములను మరియు నితరములైన యొక చమసము నాలుగు చమసములు నిర్మిజేసియిచ్చుటచేతను, సీమొదలగు కార్యంబులు నెరవేర్చుటచేతను, దేవతల కృపచే దాము మనుష్యులై యుండినను దేవత్వమును బొందిరి ఇట్లు దేవత్వమును బొందిన సుధన్వునియొక్క పుత్రులు ఋభువులనువారు సూర్యునితో మానమైన ప్రకాశముచేత తెలిగిగలవారైన నా ఋభువులు సంవత్సరభాగమును

వసంతాది కాలములయందు బ్రాహ్మణాదులచే జేయఁదగిన యగ్నిష్టోమాది కర్మలలో హవిర్భాగంబులకు దగినవారైరని తెలియబడుచున్నది. ఇందులో జెప్పిన దానినిబట్టి చూడ సుధన్వుని పుత్రులగు ఋభువులైన వీరు దేవతలకు యజ్ఞాది క్రతువులలో సాధనసామగ్రులను సంవత్సరలో జేసి యిచ్చుటచేత నా దేవతలకు నీ ఋభువుల యందు దయగలిగి దేవత్వంబును నొసఁగిరి ఈ ఋభువులశ్వినీకుమారులు దేవత్వం బును బొందినట్టుగాక బ్రాహ్మణాదులచేవసంతాదిఋతువులయందు జేయబడునగ్నిష్టో మాదిక్రతువులలో హవిర్భాగంబులనుగూడా బొందుటకు దగినవారైరని తెలియు చున్నది కాని విశ్వకర్మ యొక్క పుత్రులుఋభువులని పై శ్రుతి యందెచ్చటనుగన్ప ట్టుటలేదు ఒకవేళ శ్రుతియందుండునట్టి సౌధన్వశబ్దంబుచే యోచించగా సుధన్వు డనువా డొకండుండినట్లుపై శ్రుతినిబట్టి తెలియుచున్నది కాబట్టి సుధన్వుడనునప్పుడు విశ్వకర్మయని విశ్వనిఘంటువు మొదలగు నిఘంటువులయందు జెప్పబడియున్నది కనుక నీసుధన్వునిగూర్చి ధర్మశాస్త్రమునందుగూడా మరియొకస్మృతి వ్యతిరిక్తముగ వ్రాసియున్నది. అది యెట్లంటిరేని.

మనుస్మృతి 10వ అధ్యాయము 23వ శ్లోకము

శ్లో॥ వైశ్యాంతుజాయతే వ్రాత్యా । సుధన్వాచార్యఏవచ ॥

తా॥ ఇందుల కర్థమేమని యెదరేని వ్రాత్యుడనగా నుపనయనాది సంస్కార హీనుడైన వైశ్యునివలన సువర్ణయైన వైశ్య స్త్రీయందు జన్మించినవాడు సుధన్వు డనియు లేక సుధన్వాచార్యుడనియు జెప్పియుండెనుగాని విశ్వకర్మయగు సుధన్వుడే సంకరుడని చెప్పియుండలేదు. కనుక నిందనుగురించి పూర్వమీమాంసయందుగూడా సుధన్వునిపుత్రులగు సౌధన్వులు చతుర్వర్ణములకంటె హీనులై యుండుటవలన వీరికి బ్రాహ్మణత్వసిద్ధిలేనట్టి సంకరులగు రథకారులైయున్నారని వ్యతిరేకముగ జెప్పబడియుండెను మరియు నధికారాధికరణమునందు బూర్వోత్తరభాగములయందు జెప్పబడిన సూత్రము లీక్రింద వ్రాయుచున్నాము.

మీమాంస 6వ అధ్యాయము 1 పాదము

పూర్వభాగము

సూ॥ వచనాద్రథకారస్యాధానేఽస్యసర్వశేషత్వాత్ ॥ ౧

సూ॥ న్యాయోవాకర్మసంయోగాచ్ఛూద్రస్యప్రతిషిద్ధత్వాత్ ॥ ౨

సూ॥ అకర్మత్వాత్ నైవంస్యాత్ ॥

సూ॥ అనర్థక్యంచసంయోగాత్ ॥

సూ॥ గుణార్థేనేతిచేత్ ॥

సూ॥ ఉక్తమనిమిత్తత్వమ్ ॥

సూ॥ సౌధన్వవాస్తుహీనత్వాన్నస్మం॥ తవర్ణాత్ప్రతీయేరన్ ॥

తా॥ ఇందులకు బైజెప్పిన భిన్నాభిప్రాయమే స్ఫురించుచున్నది కనుక నీ సుధన్వునిగురించి వ్యాసు డీక్రింద దనప్రణీతంబైన నిరుక్త వ్యాకరణమున నేమి వ్రాసియున్నాడో యా విషయమును గొంత జూడుడు.

నిరుక్తము 5 అ, 2పా 16. 4

సూ॥ కృత్వాకర్మాణి క్షిప్రపత్వేసవోఘారోవా ధావినోహిమర్త్యాసః సన్తోఽమృతత్వమానశిరే మేసౌధన్వనాఋభవః సూరచక్షసా వా సూరప్రజ్ఞానత్సరే సమపృచ్ఛన్త ధీతిభిః కర్మభిః ఋభ్వారిభ్వావాజ ఇతి సుధన్వన ఆంగిరసస్య త్రయఃపుత్రాః బభూవస్తేషాం ప్రథమోత్తమాభ్యాం బహువన్నిగమాభవన్తి నమధ్యమేన తదేతదృభోశ్చ బహువచనేన చమసస్య చసంస్తవేన బహూనిదశత్రయీషు సూక్తాని భవన్తి ఆదిత్యరశ్మయోఽప్యృభవఉచ్యన్తే ॥

తా॥ ఇందులో సుధన్వుడనునప్పు డాంగిరసమహర్షియొక్క సంతతివాడని చెప్పియున్నది. కాని ఈ సుధన్వుడు విశ్వకర్మయనిగాని, యుపనయనాది సంస్కారహీనుండైన వైశ్యునివలనసువర్ణయైన వైశ్యస్త్రీయందు బుట్టినవాడని, వేత్వేఋగా జెప్పియుండలేదు అట్లు చెప్పకుండినను నాంగిరసమహర్షియొక్క సంతతియని చెప్పియుండుట వలన నట్టి యాంగిరసమహర్షి విరాడ్విశ్వకర్మ యందుద్భవించిన సప్తమహర్షులలో నొకఋషియని చెప్పుటనుబట్టి యాంగిరసమహర్షిసంతతి సుధన్వుడు విశ్వకర్మయని స్పష్టముగ దెలియబడుచుండె గనుక మరల వ్యాసుడీక్రింద దనప్రణీతంబైన [illegible] వ్రాసియునాడు.

భారతము అనుశాసన పర్వము 85వ అధ్యాయము

శ్లో॥ అష్టౌచాంగిరసఃపుత్రా । ఆగ్నేయస్తే ప్యుదాహృతాః।
బృహస్పతిరుతథ్యశ్చ । పయస్యఃశాంతిరేవచ ।
ఘోరోవిరూపఃసంవర్తః । సుధన్వాచాష్టమస్స్మృతః॥

తా॥ ఆంగీరసమహర్షికి జనించిన యెనిమిదిమంది పుత్రులతో సుధన్వాచార్యు డొకపుత్రు డని చెప్పబడుచుండె గనుక నీ విషయమును గురించి విష్ణుపురాణమందలి యొకప్రాచీనశ్లోకము నిందు వ్రాయుచున్నాము.

విష్ణుపురాణము

శ్లో॥ ఏతేక్షత్రప్రసూతావై । పునశ్చాంగిరసఃస్మృతాః।
రథీతరాణాంప్రవరాః । క్షత్రోపేతాద్విజాతయః॥

తా॥ ఇందువలన గౌంతమంది క్షత్రీయు లాంగీరసులని ప్రసిద్ధినొంది యున్నారు. ఇట్లు చెప్పినప్పుడు వారుకూడా విశ్వకర్మ సంతతిలో జేరినవారుగనే కన్పట్టుచున్నారు. కాని మరియొకటుకాదు కనుక నిందునుగూర్చి యీ క్రిందవ్యాస కృతమైన స్మృతి ప్రమాణంబువలన సమాధానము జెప్పుచున్నాము.

వ్యాసస్మృతి

శ్లో॥ ద్విజాతీనాంషోడశైవస్యుః । శూద్రాణాంద్వాదశైవహి ।
పంచైవమిశ్రజాతీనాం । సంన్యాసాఃకులధర్మతః॥

తా॥ అనగా బ్రాహ్మణులకు షోడశకర్మలును శూద్రులకు ద్వాదశకర్మలును మిశ్రజాతికి బంచకర్మలును నిర్ణయించి యుండె గనుక నీ విశ్వబ్రాహ్మణులు గాకుండుట నిశ్చయమైయుండిన యెడల శూద్రజాతి కర్మల నాచరించు కొనుచుండ వలయును. అటువలె నాచరించక పూర్వోక్తమైన షోడశకర్మల ననాదిసిద్ధముగ జేసుకొనుటవలన వీరిని బ్రాహ్మణజాతివారై యున్నారని లోపట్టున దిట్టమగునట్టుగ నొక్కివక్కాణించుచున్నాము.

బ్రాహ్మణోత్పత్తి మార్తాండము

శ్లో॥ పంచవక్త్రాత్సముత్పన్నాః । పంచభిః కర్మభిర్ద్విజాః ।
మనుర్మయస్త్వష్టా । శిల్పకశ్చతథైవచ ।

దైవజ్ఞః పంచమశ్చైవ । బ్రాహ్మణాః పంచకీర్తితః ।
పాంచాలానాంచసర్వేషాం । శాఖావై వైశ్వకర్మణి ।
తేషాంవై పంచగోత్రాణాం । ప్రవరంపంచకస్మృతః ॥

తా॥ ఇందున విశ్వకర్మపుత్రులగు మనుమయత్వష్టశిల్పి విశ్వజ్ఞులను నీయైదుగురు బ్రాహ్మణులైయున్నారు. ఇట్టి పాంచాల బ్రాహ్మణులగు విశ్వబ్రాహ్మణులు విశ్వకర్మయెట్టి శాఖాగతుఁడైయుండెనో వీరును నట్టిశాఖాగతులై యుందురనియు మరియు, బంచగోత్రములగు సానగ సనాతన అహభూన ప్రత్నస సుపర్ణస యను నీగోత్రగతులై పంచప్రవరలతో నుందురనియు, నిట్లుగ దెలియబడుచున్నది. ఈపైని వివరించిన వాక్యములను బ్రాహ్మణోత్పత్తి మార్తాండ గ్రంథకర్తలు శివాగమమునుండి తమ గ్రంథమునకు బ్రమాణవాక్యములుగా గైకొనియున్నారు. ఈపాంచాల బ్రాహ్మణులగు విశ్వబ్రాహ్మణులు బ్రాహ్మణులుగాని నిశ్చయమైయుండిన యెడల ప్రత్యేకము నార్షేయ బ్రాహ్మణుల యుత్పత్తిని గూర్చిచెప్పునట్టి ఏతద్గ్రంథమగు బ్రాహ్మణోత్పత్తి మార్తాండమున నీపాంచాల బ్రాహ్మణులగు విశ్వబ్రాహ్మణులగూర్చి యెట్లుజెప్పబడగలిగినది? అట్లుగానిచో దమగ్రంథమున బ్రకటించుకొనుట కెట్లుపొసగును కాబట్టి ఈవిశ్వబ్రాహ్మణులు బహుకాలమునుండి స్వగృహములందు జరుగునట్టి వివాహోపనయనాది కార్యములయందు షోడశకర్మలను జేసికొనుట యాచారమైయున్నది. అందువలన వారియందు బ్రాహ్మణత్వము సిద్ధమైయున్నదని చెప్పుటకు బ్రబలవిదర్శనమైయున్నది కనుక నిట్లు జెప్పబడు శ్రుతిప్రతిపాదితులైన సౌధన్వులు మొదలగువారు పూజ్యులని కొన్ని శ్రుతి ప్రమాణములచే నీక్రింద వివరించుచున్నాము. అదియెట్లనియెదరేని ఋగ్వేదము ౧వ అష్టకము ౧వ అధ్యాయము ౧వ వర్గు ౧మొదలు ౮వ మంత్రమువరకును మరియు ఋగ్వేదము ౧వ అష్టకము ౨వఅధ్యాయము ౩౨వ వర్గు ౧౧౦వ సూక్తము ౧వ మంత్రము వెండియు ఋగ్వేదైతరేయ బ్రాహ్మణము ౨౧౮వ అధ్యాయము ౪వ కాండము ౨౧౧వ పత్రము ఐతరేయబ్రాహ్మణము ౩౦వ అధ్యాయము ౧వ కాండము ౧వ మంత్రము మొదలగు ప్రమాణములచే సుధన్వుని, నతని పుత్రులగు సౌధన్వులు మొదలగువారిని బ్రాహ్మణులైయున్నారని ఖండించియున్నాము కనుక సంకరులగు రథకారులను నీక్రింది ప్రమాణములచే దెలియపఱచుచున్నాము.

## రథకారశబ్ద విమర్శనము.

యాజ్ఞవల్క్యస్మృతి ఆచారకాండము 95వ శ్లోకము

శ్లో॥ మాహిష్యేణ కరణ్యాంతు । రథకారః ప్రజాయతే ॥

తా॥ మాహిష్యజాతి పురుషునకును గరణజాతిస్త్రీకిని బుట్టినవాడు రథకారుడని చెప్పబడియుండె మరియు

ఔశనసస్మృతి 5వ శ్లోకము

శ్లో॥ బ్రాహ్మణ్యాంక్షత్రియాచ్చౌర్యా । ద్రథకారః ప్రజాయతే ॥

బ్రాహ్మణ స్త్రీయందు క్షత్రియునివలన దొంగతనముగ జన్మించినవాడు రథకారుడని మరియొక విధముగ జెప్పియుండెను. బోధాయనస్మృతి ౧వ ప్రశ్నము ౯వ అధ్యాయమున ౬వ అంకమునందు జెప్పబడు ప్రమాణవచనము వైశ్యుని వలన శూద్రస్త్రీయందు బుట్టినవాడు రథకారుడని పైరెంటిస్మృతులకున్నను వ్యతిరిక్తముగ జెప్పియుండె గనుక నీరథకారులనుగూర్చి ఈమూడు స్మృతుల యందు మూడువిధములుగ జెప్పియుండుటవలన నీ రథకారు లన్యజాతీయులుగా గన్పట్టుచున్నారు కాని బ్రాహ్మణజాతిలో జేరిన రథకారులు కారని పూర్వోక్త శ్రుతి ప్రమాణములనుబట్టి స్పష్టముగ దెలియబడు చుండెగనుక విశ్వకర్మ సృష్టినిగూర్చి శ్రీ మహాభాగవతమునందుండు మరియొక ప్రమాణము నిక్రింద వ్రాయుచున్నాము.

### జగత్సృష్టి క్రమము

### శ్రీమహాభాగవతము

క॥ విశ్వాత్ముడు విశ్వేశుడు
విశ్వమయుండఖిలనేత । విష్ణుడజుండీ
విశ్వములో దానుండును
విశ్వముదనలోనె తాను । వెలుగుచునుండున్ ॥

తా॥ విశ్వాత్ముడనియు, విశ్వేశ్వరుడనియు, విశ్వమయుండనియు, విష్ణువనియు, నజుండనియు, నతండే విశ్వమందుండుననియు, నతనికుక్షియందీ విశ్వమంతయు నిండియుండెననియు, జెప్పబడుచుండె గనుక నందువలన బంచముఖ బ్రహ్మయనియు, సహస్రశీర్షుండనియు, విశ్వకర్మవృషంబనియు, బరమాత్మయనియు

సదాశివుండనియు, పరాత్పరుండనియు, సగుణబ్రహ్మయనియు, నిర్గుణబ్రహ్మయనియు, చిన్మయుండనియు, చిద్రూపుండనియు, జగద్గురుండనియు, సంకల్పమాత్రుండనే కారణపురుషుండనియు, నింకననేక నామంబులుగలిగి ప్రకాశించు సర్వాత్ముండైన విశ్వకర్మ సమస్తము సృజియించుటకు ముందుగానే తన సంకల్పమాత్రమున బెందోటపట్టణంబు నిర్మించి యందునవరత్న పీఠంబునందుపోవిష్టుడై

తే॥ సీ॥ తనదు దేహంబునైదుపా । ళ్లొనరజేసి
యచ్చులకు నాద్యమైనట్టి । యక్కరమును
వెలయనంతస్థలనుప్రభ । వింపజేసి
పంచభూతంబులను సృజి । యించిపిదప ॥

తా॥ తనయాత్మ నైదు భాగంబులుగా విభజించి యందు, అ, య, ర, వ, ల, యను నైదు బీజంబులను బుట్టించి వానివలన బంచతత్వంబుల నిర్మించియుండెను.

పంచతత్వముల జననము

కం॥ ధరపంచబీజములకును
దిరముగ తత్వములుగల్గు । తెరగువానిన్
గరుణామృతసంపూరిత
పరమేశ్వర దెలియబల్కు । భావంబలరన్ ॥

తా॥ స్వామీ ! విశ్వకర్మ పంచబీజములయందు బంచతత్వంబుల నిర్మించు విధం బెరింగింపుడనిన శిష్యునకు గురుండిట్లనియె

తే॥ సీ॥ వినుముశిష్యుండ దెల్పెద । విశదముగను
నయరవలయను బీజంబు । లందు గగన
వాయు వగ్నియు నవని పా । నీయములను
పంచభూతంబుల సృజించె । సంచితముగ ॥

తా॥ ఓయీశిష్యా ! అకారబీజంబున నాకాశతత్వంబును, యకారబీజంబున వాయుతత్వంబును, రకారబీజంబున నగ్నితత్వంబును, వకారబీజంబున నుదకతత్వంబును, లకారబీజంబున భూతత్వంబును నిజయింపజేసి యుండెను

పంచభూతముల రంగులు

కం॥ భూతములకు రంగులు ప్ర
భ్యాతిగ నుదయించువిధము । నరమర లేకన్
భూతలమున వివరించియు
భూతేశ్వర జెప్పుమయ్య । పూర్ణ మనమునన్ ॥

శ్లో॥ గగనం నీలవర్ణంచ । మారుతం ధూమ్రవర్ణకం ।
పావకోరక్తవర్ణంచ । సలిలం శుభ్రవర్ణకం ।
హరిద్రావర్ణకం పృథ్వీ । పంచభూతా ఇతిక్రమాత్ ॥

తా॥ ఆకాశతత్వము నీలవర్ణము, వాయుతత్వము ధూమ్రవర్ణము, నగ్నితత్వ మెఱుపువర్ణము, నుదకతత్వము తెలుపువర్ణము, పృథివితత్వము పసుపువర్ణము, గలిగియుండును, కనుక నీపంచభూతంబులలోనొక్కొక్కతత్వంబునకు బది యుపబీజాక్షరంబులను బుట్టించి యుండెనవి చెప్పెదవినుము.

ఆకాశబీజోత్పత్తి నిర్ణయము.

అ, ఆ, ఏ, అః. జ, ఝ, ణ, న, మ, శ, యనుపది యుపబీజాక్షరంబులను బుట్టించియుండె గనుక వాయు బీజోత్పత్తిలక్షణం బెరింగించెదవినుము

వాయుబీజోత్పత్తినిర్ణయము.

ఇ, ఈ ఐ, క చ, ట, త, ప, య, ష, యనుపది యుపబీజాక్షరంబులనునిర్మించె గనుక నగ్నిబీజోత్పత్తిలక్షణం బెరింగించెద వినుము.

అగ్ని బీజోత్పత్తినిర్ణయము.

ఉ, ఊ, ఓ, ఖ, ఛ, ఠ, థ, ఫ, ర, స, యనుపది యుపబీజాక్షరంబులనునిర్మించె గనుక నుదక బీజోత్పత్తిలక్షణం బెరింగించెద వినుము.

## ఉదక బీజోత్పత్తి నిర్ణయము.

ఇ, ఈ, అం, ఘ, ఝ, ఢ, ధ, భ, వ, ఙ, యనుపది యుపబీజాక్షరంబులసృజించె గనుక పృథివిబీజోత్పత్తిక్రమం బెరింగించెదవినుము.

## పృథివి బీజోత్పత్తి నిర్ణయము.

ఋ, ౠ, ఔ, గ, జ, డ, ద, బ, ల, హ, యనుపది యుపబీజాక్షరంబులను బుట్టించియుండె గనుక నిట్టిబదియక్షరంబులయొక్క ప్రభావం బెరింగించెదవినుము.

## పంచాశద్బీజనిఘంటువు

శ్లో॥ అకారం ఆత్మబీజంచ । ఆకారంపాశబీజకం।
ఈకారాంతు మహామాయా । ఇకారం మాయబీజకం॥ ౧

శ్లో॥ ఉకారం బలవర్ధంచ । ఊకారోచ్చాటనంతథా ।
ఋకారో మోక్షబీజంచ । ౠకారం మోహనంతథా॥ ౨

శ్లో॥ ఌకారంచైవవిద్వేషం । ౡకారోచ్చాటనంతథా ।
ఏకారోవశ్యబీజంచ । ఐకారంవశ్యబీజకం॥ ౩

శ్లో॥ ఓకారంమోహవశ్యంచ । ఔకారంజనవశ్యకం।
అంకారంమశ్రువశ్యంచ । అః కారంమృత్యునాశనం ॥ ౪

శ్లో॥ కకారంకామబీజంచ । అంకుశంచతథైవచ।
ఖకారంగరుడాఖ్యంచ । గకారంగణపతిస్తథా॥ ౫

శ్లో॥ ఘకారంస్తంభనంచైవ । జకారంప్రాణబీజకం॥
చకారంచండికాబీజం । ఛకారంభద్రకాళికం॥ ౬

శ్లో॥ జకారంచంద్రబీజంచ । ఝకారంమంత్రబీజకం।
ఞకారంశూలబీజంచ । టకారోచ్చాటనంతథా॥ ౭

శ్లో॥ ఠకారంస్తంభనంబీజం । డకారం గరుడంతథా ।
ఢకారం భైరవబీజం । ణకారంరక్షకబీజం ॥ ౮

శ్లో॥ తకారంధనబీజంచ । థకారం ధర్మబీజకం ।
దకారంవారుణీబీజం । దుర్గాబీజంతథైవచ ॥ ౯

శ్లో॥ ధకారంనైరృతిబీజం । నకారంధూమబీజకం ।
పకారంవీరభద్రంచ । ఫకారంవాసుదేవకం॥ ౧౦

శ్లో॥ బకారంచాశ్వనీబీజం । భకారం భద్రకాళికం ।
మకారంపార్వతీబీజం। యకారంవాయుబీజకం॥ ౧౧

శ్లో॥ రకారంవహ్నిబీజంచ , రుద్రబీజంతథైవచ ।
లకారంపృథివీబీజం । ఇంద్రమన్మథయోస్తథా ॥

శ్లో॥ వకారంవారుణీబీజం । ప్రద్యామ్నమృతబలాయుచ ।
శకారం శ్రీమహాబీజం । లక్ష్మీబీజంతథైవచ ॥ ౧౩

శ్లో॥ షకారంనైరృతిబీజం । విద్వేషకరంపరం।
సకారంయక్షబీజంచ । తమోబీజంతథైవచ ॥

శ్లో॥ హకారంయమబీజంచ । ళకారాఖ్యంతథైవచ ।
క్షకారంభైరవబీజం , క్షేత్రపాలంతథైవచ ॥ ౧౫

తా॥ ఓయి శిష్యా సమస్తమంత్రయంత్రంబులకు మూలాధారంబైన నీపంచాశద్బీజాక్షరంబులయొక్క ప్రభావం బిట్లుగల్గియుండెనని యెఱుంగుము.

పంచబ్రహ్మల జననము

క॥ ఆవిశ్వకర్మమూర్తికిన
నేవిధిగాబంచబ్రుషులు । నేర్పడిరి భువిన్
దీవర్యులనామంబులు
భావించియుదెల్పుమిపుడు । పరమమునీంద్రా ॥

విశ్వబ్రహ్మోపనిషత్

శ్రుతి॥ పూర్వాననాత్సానగః । దక్షిణాత్సనాతనః ।
అపరాదహభూనః । ప్రత్నఉదీచ్యాంఊర్ధ్వాత్సుపర్ణః ॥

తా॥ ఆపంచముఖబ్రహ్మర్షి యొక్క ప్రాఙ్ముఖంబున సానగ మహర్షియగు మనుబ్రహ్మయు, నవాఙ్ముఖంబున సనాతనమహర్షియగు మయబ్రహ్మయు, ప్రత్యఙ్ముఖంబున నహభూనమహర్షియగు త్వష్టృబ్రహ్మయు, నుదఙ్ముఖంబున ప్రత్నమహర్షియగు శిల్పిబ్రహ్మయు, నూర్ధ్వముఖంబున సుపర్ణమహర్షియగు విశ్వజ్ఞబ్రహ్మయు, నీయైదుగురు పుత్రులు కలిగియుండిరి కనుక వారల రూపంబులను జెప్పెదవినుము.

## పంచబ్రహ్మల దేహవర్ణనము

### మూలస్తంభము.

శ్లో॥ మనుస్స్ఫటికవర్ణంచ । మయానాంనీలవర్ణయోః ।
త్వష్టృకంతామ్రవర్ణంచ । శిల్పినాం ధూమ్రవర్ణయోః ॥

శ్లో॥ విశ్వజ్ఞకోసువర్ణంచ । పంచసాదాఖ్యవర్ణయోః ।
పంచబ్రహ్మయతేరూపం । ద్వితీయేజన్మనిర్ణయం ॥

తా॥ మనుబ్రహ్మ తెలుపు, మయబ్రహ్మ నలుపు, త్వష్టృబ్రహ్మ యెఱుపు, శిల్పిబ్రహ్మ నలుపు గలిగినయెఱుపు, విశ్వజ్ఞబ్రహ్మ పసిమి, యనునీయైదురూపంబులు గల్గియుండె గనుక వారలకు ప్రతినామంబు లెరింగించెదవినుము.

## పంచబ్రహ్మల ప్రతినామములు.

### విశ్వబ్రహ్మోపనిషత్.

శ్రుతి॥ మయ్యాప్రోక్తోమనుర్నామ । స్సాక్షాదీశ్వరఏవచ ।
మయోనారాయణస్సాక్షా । త్వష్టాసాక్షాత్పితామహః ॥
శిల్పీచాఖండలస్సాక్షా । ద్విశ్వజ్ఞస్సూర్యఏవచ ।
యోతానుపాసతేనిత్యం । సర్వమంగళమశ్నుతే ।
యఏక మేకంయజతే । సర్వపూజాఫలంభవేత్ ॥

తా॥ మనుబ్రహ్మకుసాక్షదీశ్వరుండనియు, మయబ్రహ్మకుసాక్షాన్నారాయణుండనియు, త్వష్టృబ్రహ్మకుసాక్షాత్పితామహుండనియు, శిల్పిబ్రహ్మకుసాక్షాద్దేవేంద్రుండనియు విశ్వజ్ఞబ్రహ్మకుసాక్షాత్సూర్యుండనియు, నింకననేకములగునామంబులు గల్గివర్తించుచుండిరి. వారల నెవ్వరుపాసనచేయుదురో వారలకధికశుభంబులొసగుచుందురు కనుక బంచవేదంబులజననం బెరింగించెదవినుము.

పంచవేదములజననము.

విశ్వబ్రహ్మోపనిషత్.

శ్రుతి॥ పూర్వే వేదాస్సముజాయంత ౧

ఋగ్యజుస్సామాథర్వణప్రణవాఖ్యా ౨

తా॥ విశ్వకర్మతూర్పుముఖంబున ఋగ్వేదము,దక్షిణముఖంబునయజుర్వేదము పశ్చిమ ముఖంబునసామవేదము, నుత్తరముఖంబుననధర్వణవేదమ నూర్ధ్వముఖంబున ప్రణవవేదము. లనునివియుద్భవించియుండె గనుక నందుమనుబ్రహ్మపారాయణ కృత్యంబు లెరింగించెద వినుము.

మనుబ్రహ్మపారాయణకృత్యములు.

కృష్ణయజుర్వేదము.

శ్రుతి॥ అయోమనుస్తుఋగ్జాతం॥

తా॥ మనుబ్రహ్మకుఋగ్వేదపారాయణము, నౌపాసనము, రుద్రరూపమైన కత్తిచే సమస్తవర్ణాశ్రమములకు సృష్టిపరిపాలనమగునట్లు గర్భమందుద్భవించినశిశువు యొక్క నాభినాళమును దల్లివేఱుగనుబిడ్డవేఱుగను, ఖండించిన వెనుక ధర్మార్ధకామ మోక్షంబను చతుర్విధ పురుషార్ధసిద్ధులు వెలుంగునట్లు కఱ్ఱమైన, కత్తిమైన, కొదురుమైన, త్రాసుమైన, గంటపుమైన, యీయైదింటివలన లోకసంరక్షణచేయుట కాజ్ఞయొసంగె గనుక మయబ్రహ్మపారాయణకృత్యంబు లెరింగించెదవినుము.

మయబ్రహ్మపారాయణకృత్యములు.

కృష్ణయజుర్వేదము.

శ్రుతి॥ మయోదారుయజుస్తథా॥

తా॥ మయబ్రహ్మకుయజుర్వేదపారాయణము సకలజీవుల ప్రాణరక్షణకొరకు దేవానుకూలమైన సర్వవిధసామగ్రీలుజేయుటకాజ్ఞయొసంగె కనుకత్వష్టబ్రహ్మపారాయణకృత్యంబు లెరింగించెదవినుము

త్వష్టబ్రహ్మపారాయణకృత్యములు.

కృష్ణయజుర్వేదము.

శ్రుతి॥ తామ్రమత్వష్టారజోసామం॥

తా॥ త్వష్ట్రబ్రహ్మకు సామవేదపారాయణము, తామ్రసృష్టియు గరుడెత్తిర్ర పేర్పఱచిన షణ్మతస్థాపనవిగ్రహములున్ను, యాగశాలలోగల శావాహనమున్ను, ధూపదీపాదియుపకరణములున్ను, జేయుచు దమని యాజ్ఞయొసంగె గనుకశిల్పాచార్యు నియొక్క నిర్ణయంబెరింగించెద వినుము.

శిల్పిబ్రహ్మపారాయణకృత్యములు.

కృష్ణయజుర్వేదము.

శ్రుతి॥ శిలాంశిల్పీ అధర్వణః॥

తా॥ శిల్పిబ్రహ్మకథర్వణవేదపారాయణమును, ముప్పది రెండుశిల్పములును, షణ్మతస్థాపనమును గోపురస్తూని మొదలైన శతకోటిదేవ తానిర్మిలోద్ధారణమును, వేదమంత్రబీజావాహనమును, నష్టాదశక్రియలును, నిర్మాణించి మోక్షార్థమై బ్రహ్మ జ్ఞానులకు నియమనిష్ఠాగరిష్ఠా ష్టాంగయోగసమాధిక్రియాసంప్రదాద్వైతబ్రహ్మస్వరూ పంబను విరాడ్విశ్వబ్రహ్మమును జెందుటకు హేతువుగానున్ను, దేవతలకు స్థపతి యాచార్యులై యుండి సమస్తమంత్రాంశములవలన సర్వాధారదేవతలను నష్టాదశపు ములను మోక్షమును బొందునటుల జేయుమని యాజ్ఞాపించెగనుక విశ్వజ్ఞబ్రహ్మపా రాయణకృత్యంబు లెరింగించెదవినుము.

విశ్వజ్ఞబ్రహ్మపారాయణకృత్యములు.

కృష్ణయజుర్వేదము.

శ్రుతి॥ రౌప్యస్వర్ణార్కప్రణవం॥

తా॥ విశ్వజ్ఞబ్రహ్మకు ప్రణవవేదపారాయణము త్రయత్రింశత్కోటిదేవత లకును సమస్తవర్ణాశ్రమస్థులకును ప్రకాశమునొందిన స్వర్ణముచేత రత్నాభరణాదులు సృష్టించుటయును, నష్టాదశవర్ణంబులు నష్టవివాహంబులకులోబడిన వర్ణాశ్రమములలో దుర్మార్గస్త్రీలవలన నుత్పత్తియైన యతిలోముడు ప్రతిలోముడునంతరాళుడుకరణుడు కుండకుడు గోళకుడు మొదలైన వర్ణబీజనిషిద్ధములు లేకుండ కులస్త్రీల జేయ మాంగల్యమను ముద్రసృష్టించిచతుర్విధపురుషార్థములు పొందునట్లుచేయుచుండు మనియాజ్ఞయొసంగె నంత వారలు సమస్తకృత్యంబు లొక్కొక్కరే చేయగల వారై యుండిరి కనుక బంచశక్తులజననం బెరింగించెదవినుము.

## పంచశక్తులజననము.

శ్లో॥ విశ్వస్యశ్వదనేపూర్వే । ఆదిశక్తిసముద్భవా।
అవాచీనాపరాశక్తి । రిచ్ఛాప్రత్యశ్వ మేభవా
క్రియాఉత్తరసంజాతా । ఊర్ధ్వేజ్ఞానశక్తిసంభవా॥

తా॥ విశ్వకర్మ తూర్పుముఖంబున నాదిశక్తియు,దక్షిణముఖంబునబరాశక్తియు, బడమరముఖంబున నిచ్ఛాశక్తియు, నుత్తర ముఖంబున క్రియాశక్తియు, నూర్ధ్వముఖంబున జ్ఞానశక్తియు, నీయైదుగురు జనించి సకలవిద్యలుదం డ్రివలన గ్రహించి యుండిరి అంత నాపంచబ్రహ్మలు దేవోపాసకులై యుండువిధం బెరింగించెదవినుము.

## పంచబ్రహ్మల ఉపాసన క్రమము.

శ్రుతి ॥ ఓం అస్య శ్రీసావిత్రీకూర్మపీఠాధీశ్వరస్తోత్ర మహామంత్రస్య ప్రత్నసవిశ్వకర్మాభగవాన్ ఋషిః అనుష్టుప్ ఛందఃఋ్పణిరితి ద్వే అక్షరఇతిబీజం సూర్యఇతిచాయాత్రిణి దేవీంవాచమితిశక్తిః ప్రణవోదేవీతికీలకం విశ్వకర్మదైవత్యం ఆదిత్యఇతిపత ద్వేసావిత్య్రష్టాక్షరంపదగ్ం శ్రీయాభిప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః ॥

## కరన్యాసము.

శ్రుతి॥ ఓం ఋచోఅక్షరే అంగుష్టాభ్యాంనమః యస్మిన్ దేవాఇతితర్జనీభ్యాంనమః యస్తన్నవేదఇతిమధ్యమాభ్యాంనమః యఇత్తద్విదుస్తఇతిఅనామికాభ్యాంనమః సహవాఏతస్యఇతికనిష్టకాభ్యాంనమః యస్సావిత్రంవేదమితి కరతలకరపృష్టాభ్యాంనమః
(ఏవంహృదయాదిన్యాసః)

శ్రుతి॥ ఓంఋచోఅక్షరే హృదయాయైనమః యస్మిన్ దేవాఇతి శిరసేస్వాహా యస్తన్నవేదఇతి శిఖాయైవషట్ యఇత్తద్విదుస్తఇతికవచాయహుం సహవాఏతస్యఇతి నేత్రత్రయాయవషట్ యస్సావిత్రంవేదమితి అస్త్రాయఫట్ భూర్భువస్సువరోమితిదిగ్బంధః ॥

## ధ్యానమ్

శ్లో॥ సావిత్రీంనవయౌవనాం త్రినయనాం వైయాఘ్రచర్మాంబరాం।
ఖట్వాంగాం త్రిశిఖాకుసూత్రవలయాం భీతీవదానంబిరాం,
విద్యుత్పింగజటాకలాపవిలసద్బాలేందుమౌళీం సదా।
సావిత్రీం వృషవాహనీంసితతనుం ధ్యాయేయజుశ్శాఖినీం ॥

శ్లో॥ పరబ్రహ్మాత్మికాందేవీం। భుక్తిముక్తిఫలప్రదాం।
ప్రణమ్యస్తౌమి తామేవ। జ్ఞానశక్తిసమాహితః।
లమిత్యాదిపంచపూజాంకుర్యాత్ ॥

## మనుబ్రహ్మఛందస్సు

శ్రుతి॥ విశ్వసృజఇత్యస్యమంత్రస్య సానగఋషిః శ్రీసావిత్రీగాయత్రీ ఛందః అధర్వణసావిత్రీదేవతాఘృణిరితిబీజం మమసావిత్రీప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః ॥

శ్రుతి॥ విశ్వసృజసావిత్రీదేవీప్రథమానస్రతమాసుతా। సహస్రసమంత్రసువేనయన్తఃతతోహజిజ్ఞే। భువనస్యగోపాః హిరణ్మయశ్శకుని బ్రహ్మనామ ॥

శ్లో॥ యావేదాంతార్థతత్త్వైక। స్వరూపా పరమార్థతః।
నామరూపాత్మికావ్యక్తా। సావిత్రీధ్యానమాచరేత్ ॥

## మయబ్రహ్మఛందస్సు.

శ్రుతి॥ ఏనసూర్యస్తపతి ఇత్యస్య మంత్రస్య సనాతనఋషిః గాయత్రీ ఛందః శ్రీసావిత్రీదేవతా సరస్వతీ త్రీణితిబీజం శ్రీసావిత్రీప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః ॥

శ్రుతి॥ ఏనసూర్యస్తపతి తేజసేద్ధః। పితాపుత్రేణపితృమాన్। యోనియోనౌ నావేదవిన్మనుమ తేతంబృహంతం। సర్వాన్ భుమాత్మానగ్ం సంపరాయే ॥

శ్లో॥ యాసాంగోపాంగవేదేషు । పంచఋష్వేతిగీయతే ।
విశ్వబ్రాహ్మణసక్తస్య । సావిత్రీధ్యానమాచరేత్ ॥

త్వష్టబ్రహ్మ ఛందస్సు

శ్రుతి॥ అయందక్షిణాఇత్యస్యమంత్రస్య వైశ్వానరో అహోభానఋషిః। శ్రీసరస్వతీఛందః శ్రీసావిత్రీదేవతా ఆదిత్యఇతిత్రీణిత్ర్యక్షరే । మమవాక్సిద్ధ్యర్థే జపేవినియోగః ॥

శ్రుతి॥ అయందక్షిణాం విశ్వకర్మా తస్యరథస్వనశ్చరథే । చిత్రస్య సేనానిగ్రామణ్యౌ మేనకాచ సహజన్యాచాప్సర । సౌదం శ్రవః పశవో హేతిః పౌరుషేయోవధః । ప్రహేతి స్తేభ్యో నమస్తే నోమృడయంతు తేయంద్విష్మో । యశ్చనో ద్వేష్టితం భోజంభేదధామి ॥

శ్లో॥ యవర్ణపదమాఖ్యార్థం । స్వాహాపేణప్రవర్ధతే ।
అనాదివిధనానంత । సావిత్రీధ్యానమాచరేత్ ॥

శిల్పిబ్రహ్మ ఛందస్సు

శ్రుతి॥ అయంపశ్చాద్విశ్వకర్మా ఇత్యస్యమంత్రస్య ప్రత్నసఋషిః త్రిష్టుప్ ఛందః శ్రీసావిత్రీదేవతా ఘృణిరితిద్వ్యక్షరే సూర్య ఇతి త్రీణి ఏతద్దైవసావిత్ర్యాస్యాష్టాక్షర ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

శ్రుతి॥ అయంపశ్చా ద్విశ్వవ్యచా రథ ప్రోతస్య సేనానిగ్రామణ్యౌ పరిమోచంతి చానుమోచంతి చాప్సరసౌ హేత్యతివ్యాఘూః పరిహేతిస్తేభ్యోస్తేనో మృడయంతుస్తేయంద్విష్మోయశ్చనోద్వేష్టి తంబంజందధామి॥

శ్లో॥ అధ్యాత్మికాధిదైవంచ । దేవానాంసమ్యోశ్వరిం ।
ప్రత్యగాస్త్రైవసంతీయా । సావిత్రీధ్యానమాచరేత్ ॥

యుండునటుల జేసి యందు సూర్యమండలమున బగటికాలమునకు సూర్యుని, చంద్ర మండలమున రాత్రికాలమునకు జంద్రుని, రాజ్యపరిపాలనము జేయుటకాజ్ఞయొసంగిన పిమ్మట సమస్తజనులకు.

కం॥ ప్రత్యక్షము రవిచంద్రులు
ప్రత్యక్షము వాయువగ్ని । పానీయంబుల్
ప్రత్యక్షంబాకాశము
ప్రత్యక్షము పృథివియనగ । బరగెను వేమా ॥

తా॥ అనునార్యోక్తిప్రమాణంబు చొప్పున వారిరువురు సమస్తమైనలోకం బులకు రెండు నేత్రంబులుగానుండి రక్షించుచుండిరి కనుక మరియు నెఱింగించెద వినుము.

శ్లో॥ త్రిస్థానమేకయోపేతం । శతార్ధకోటిరుచ్యతే ।
తద్భూమిజలమధ్యస్థే । ఆధారంకథ్యతే శృణు ॥

తా॥ ఉదకము, భూమి, యాకాశము, నీ మూడుసంఖ్యల మొత్తము నేబది కోట్ల యోజనముల ప్రమాణము కలిగియుండె నందు భూమియు, నుదకము, నీరెంటి నడుమనుండు నాధారం బెఱింగించెదవినుము.

శ్లో॥ తిమంగళశివాధారం । గజాగోత్రివిధారయత్ ।
అహ్యాశక్తించమధ్యంచ । కూర్మనాధారయేత్రియం ॥

తా॥ ఆదిశేషుడు, నాదిశక్తి, కూర్మము, యను నీ మూడు స్వరూపంబులచే నొక్క కూర్మమును బుట్టించి దాని నాజలముమధ్య నొక్కకోటి యోజనముల లోతున నిల్పి యనంతరమున నష్టదిగ్గజముల నిర్మించెనది చెప్పెదవినుము.

అష్టదిగ్గజముల జననము

శ్లో॥ ఐరావతః పుండరీకో । వామనః కుముదోంజనః ।
పుష్పదంతస్సార్వభౌమ । స్సుప్రతీకోష్టదిగ్గజాః ॥

తా॥ ఇట్లు నిర్మించి యాకమఠంబుమీద బ్రదక్షణక్రమముగ నొకటి తూర్పున నైరావతము, రెండాగ్నేయంబున బుండరీకము, మూడు దక్షిణమున వామనము, నాలుగు నైరృతియందు గుముదము, నైదుపడమర నంజనము, నారువాయువ్యమున

ఋష్యదంతము, నేడుత్తరమున సార్వభౌమము, నెనిమిదీశాన్యమునసుప్రతీకము నీప్రకారంబుననిల్ప యటు పిమ్మట నష్టవసువులనిల్పు విధం బెరింగించెద వినుము.

### అష్టవసువుల వివరము

శ్లో॥ అనంతస్తక్షకశ్చైవ । వాసుకిశ్శంఖపాలయోః ।
పద్మకర్కోటకశ్చైవ । క్రౌధశ్చభుజగంధరే ॥

తా। అనంతుఁడు, పద్మకుఁడు, వాసుకుఁడు, తక్షకుడు, కర్కోటకుఁడు, శంఖపాలకుఁడు, క్రౌధకుఁడు, భుజంగుడను నీయష్టవసువులకు ప్రదక్షణక్రమముగా నిల్పి వానిపై మహామేరుపర్వతము నిర్మిచు విధం బెరింగించెదవినుము.

### విశ్వకర్మ మహామేరువు నిర్మించుట
### మూలస్తంభము

శ్లో॥ అరవిందదళాకారం । మేరుమూలంప్రతిష్టితం ।
ద్వాత్రింశల్లక్షచౌచానాం । మధ్యేవింశతిలక్షయోః ॥

శ్లో॥ ఉత్సేధమష్టకోటీనా । మూలంతుద్విముఖేస్థితం ।
తన్మస్తకేచవిస్తీర్ణం । చౌషష్టిలక్షయోజనే ॥

తా॥ ఇందులకర్తమేఁని యెదరేని మేరుపర్వతము మొదలుచతురము (32) లక్షలయోజనముల ప్రమాణమున దామరపుష్పమువలె గుండ్రముగా ముఖముగల్గి యుండునటులను, దానిమధ్యస్థమైన చతురము (20) లక్షలయోజనముల ప్రమాణముగల్గి యుండునటులను (8) కోట్లయోజనముల ప్రమాణమున పొడవుగల్గి యుండునటులను, దాని శిరస్సు యొక్క చతురము (64 లక్షల యోజనముల ప్రమాణమున యుమ్మెత్తపుష్పమాదిరిగా ముఖమును గల్గియుండునట్లుగా జేసి.

శ్లో॥ పృథ్వీమధ్యస్థితం మేరు । విశ్వశంఖ ప్రతిష్టితం ।
తథాధోసత్యలోకానాం । మేరుమూలంప్రవర్తతే ॥

తా॥ విశ్వకర్మభూమికి నడుబొడ్డున నీమేరుపర్వతమును సత్యలోక పర్యంతమునాధారమై యుండునట్లుగా శంకుస్థాపన జేసి యష్టదిగ్గజ ప్రాశనకాలంబున నీఫణులు మహామేరువును, భూభారమును, వహించుచుందునటులను, నీఫణుల ప్రాశన కాలంబున దిగ్గజములు మహామేరువును, భూభారమును, వహించుచుందునటులను జేసి యటుపిమ్మట.

శ్లో॥ తిలకస్య చతుశ్శృంగం । నామపర్యాయకథ్యతే ।
అరుణోదయాదభద్రంచ । శీతంచైవనిషాదయః ॥

తా॥ ఆ పర్వతమునకు దూర్పుననరుణము, దక్షిణమున నుభయభద్రేకము, పడమరశీతము, నుత్తరమున నిషాద, మనునీనాల్గు రాతికొమ్ములు చతుర్గనొక్క యోజనము పొడవున బుట్టించి యందుపైన నాలుగు నుపగిరుల సృజించుటం బెరింగించెద వినుము.

శ్లో॥ చాతుర్గిరోపరోమాని । క్రియతేద్విభుజకర్మణి ।
కీలకోగిరివిస్తారం । లక్షతూర్థ్వంచమానసః ॥

తా॥ ఇవ్విధంబున నొకలక్షయోజనముల పొడవున నుపగిరుల నాల్గింటి బుట్టించియుండెగనుక వానిపేర్లు జెప్పెద నాకర్ణింపుము.

శ్లో॥ పూర్వంతుమందరంచైవ । గంధమాదనదక్షిణే ।
పశ్చిమేగిరినామంచ । సుపార్శ్వంచస్థితంతథా ॥
శంఖకుత్సంచనామేతి । ఉత్తరేభాగసంస్థితం ॥

తా॥ తూర్పుకొమ్మనందు మందరపర్వతము, దక్షిణపుకొమ్మనగంధమాదన పర్వతము, పడమరకొమ్మన సుపార్శ్వపర్వతము, నుత్తరపుకొమ్మన శంఖకుత్స మనే పర్వతము, నీనాల్గు నొక్కలక్షయోజనముల పొడవున సృష్టించినందులనామేరు పర్వతము నాలుగు ముఖములుగ నేర్పడియుండెను. మఱియు నా పర్వతము యొక్క శిరస్సు మూడు శిఖరములు మూడు గిరులుగను, మూడుగిరులు మూడువర్ణములుగను, జేసియుండు క్రమం బెరింగించెదవినుము.

శ్లో॥ హేమరజతవర్ణానాం । శృంగత్రిరత్నవర్ణకం ।
ఈశత్రిస్థాన లీలాచ । త్రిగిర్యాకారకథ్యతే ॥

తా॥ ఒకటి బంగారువర్ణము, రెండు వెండివర్ణము, మూడు రత్నవర్ణము, గలిగియుండునట్లుగాజేసి దేవలోకంబగు నామేరుపర్వతము మూడు శిఖరములయందు స్వర్గ మర్త్య పాతాళంబులను త్రిలోకంబుల సృజింపజేసి యందైదుపట్టణంబుల నిర్మించియుండె నదియెట్లనిన ప్రథమపట్టణమునకు వెండివర్ణముగల్గిన కైలాసగిరి యనునామంబిడి యందు రత్నసింహాసనంబున నీశ్వరుండు నివసించుటకును, రెండవ

పట్టణమునకు బంగారువర్ణముగల్గిన వైకుంఠమను పేరిడి యందురత్నసింహాసనమున విష్ణువునివసించుటకను, మూడవపట్టణమునకు రత్నవర్ణముగల సత్యలోకమనుపేరిడి యందు రత్నసింహాసనమున బ్రహ్మనివసించుటకును నాల్గవపట్టణమున కమరావతి యనునామంబిడి యందు రత్నసింహాసనమున నింద్రుడునివసించుటకును, ఐదవ పట్టణమునకు సూర్యమండలంబను పేరిడి యందు రత్నసింహాసనంబున సూర్యుడు నివసించుటకును, నేర్పరచి యచ్చట ఫలవృక్షంబుల నిర్మించువిధం బెరింగించెద వినుము

శ్లో॥ అశ్వత్థపూర్వదిగ్భాగే । జంబూవృక్షంచదక్షిణాన్ ।
కదంబఃపశ్చిమేచైవ । చందనద్రుమముత్తరం ।
దక్షిణేజంబూవృక్షంచ । ఫలంగజప్రమాణయోః ॥

తా॥ తూర్పుపర్వతముమీద రావివృక్షము, దక్షిణపర్వతము మీద నేరేడు వృక్షము, పడమరపర్వతముమీద కదంబవృక్షము, నుత్తరపర్వతముమీద మలయ వృక్షము నిర్మించియుండె నందు దక్షిణదిక్కున నుండే నేరేడుమానిపండ్లు యేను గలంతేసివై యుండును. గనుక మరియు నెరింగించెదవినుము.

శ్లో॥ తత్ఫలేంసప్రవాహే । జంబూనామంచవాహినీ ।
తదంశేస్వర్ణశైలేనా । జంబూనామసువర్ణకం ॥

తా॥ ఆజంబూఫలరస మేరై పారగా జంబూనది యనుపేరు గలిగెను. నారసముసోకినరాళ్లు బంగారమయ్యెను.

శ్లో॥ తేరసే దేవభోజ్యంచ । రసాయనమృతేస్తథా ।
దేవానాంచరణత్యాజ్యే । నాగాసురభూషణః ॥

తా॥ ఆరసము దేవతాభోజ్యమైన యమృతరసాయన మనిపించుకొనును గనుక నామ్రానియాకులు దేవతలకు బాదములైన కారణమున నాగాసురునికి భూష ణములయ్యె గనుక నామేరుపర్వతము చుట్టునున్న వనంబుల నెరింగించెదవినుము.

శ్లో॥ నందనంవనపూర్వశ్చైవ । చైత్రాజేదక్షిణాస్తథా ।
పశ్చిమేగంధమాదశ్చ । చైత్రంచైవంచముత్తరం ॥

తా॥ తూర్పుదిక్కున నందనవనము, దక్షిణమున వైభ్రాజితవనము పడమర గంధమాదనవనము, నుత్తరమున జైత్రవనము, గలగియుండె గనుక వాపేరు పర్వతమునకు సమానముగ సప్తపర్వతముల నిర్మించువిధం బెరింగించెద వినుము.

సప్తపర్వతంబుల నిర్మించుట

శ్లో॥ సితాద్రించ హిందికించైవ । మలయంకురంగ స్తథా ।
వైద్రకాంతికౌశనేత్రంచ । విధిసిధంగకాయథా ॥

తా॥ హిమాచలము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగి, మాల్యవంతమును, సృజించి యచ్చట తొమ్మిదిజీవనదుం నిర్మించువిధం బెరింగించెద వినుము.

జీవనదులు నిర్మించుట

తే॥ గీ॥ గంగయమున సరస్వతి । తుంగభద్ర
కృష్ణకావేరిసింధుభా । గీరథియును
జెలగిగోదావరియనెడి । జీవనదుల
విశ్వకర్మసృజించెను । వినుముశిష్య ॥

తా॥ గంగ, యమున, సరస్వతీ, తుంగభద్ర, కృష్ణ, కావేరి, సింధు, భాగీరథి గోదావరి, యను తొమ్మిదిజీవనదుల విశ్వకర్మ నిర్మించె గనుక సప్తసాగరముల సృజించువిధం బెరింగించెదవినుము.

సప్తసాగరముల వివరము

శ్లో॥ ద్విలక్షయోజనంక్షారం । క్షీరంచ త్వారిలక్షయోః ।
అష్టలక్షదధించైవ । ఘృతంషోడశలక్షయోః ॥

తా॥ రెండులక్షల యోజనముల ప్రమాణము ఉప్పుసముద్రము, నాలుగులక్షల యోజనముల ప్రమాణము పాలసముద్రము, యెనిమిదిలక్షల యోజనముల ప్రమాణము పెరుగుసముద్రము. పదునారులక్షల యోజనముల ప్రమాణము నేతిసముద్రము మరియు.

శ్లో॥ మధుద్వాత్రింశల్లక్షంచ । లక్షంచౌషష్టిఇక్షుజా ।
ఉదకంశతవింశత్యా । స్సప్తవార్ధించలక్షణం ॥

తా॥ ముప్పది రెండులక్షలయోజనముల ప్రమాణము కల్లుసముద్రము, నిరువది నాలుగులక్షలయోజనముల ప్రమాణము చెరుకుపాల సముద్రము, నూటయిరువదిలక్షల యోజనముల ప్రమాణము శుద్ధోదక సముద్రము, నిర్మించియుండె గనుక సప్తద్వీపంబులసృజించువిధం బెరిఁగించెదవినుము.

సప్తద్వీపంబులనిర్మించుట.

శ్లో॥ క్షారయేచ్ఛుక్రకమధ్యంచ । కర్ణికాద్వీపనామయోః।
తత్క్షారక్షీరమధ్యంచ । శాకలద్వీపనామయోః।

తా॥ లవణసముద్రము నడుమ కర్ణికాద్వీపము, లవణక్షీరసముద్రములరెంటి నడుమ శాకద్వీపంబును, మరియు.

శ్లో॥ తత్క్షీరదధిమధ్యంచ । కుశద్వీపంచనామయోః
తత్రతఘృతదధిర్మధ్యం । క్రౌంచద్వీపేననామయోః॥

తా॥ ఆపాల పెరుగుసముద్రము రెంటినడుమ గుశద్వీపంబును, పెరుగునేతి సముద్రముల రెంటినడుమ గ్రౌంచద్వీపంబును,

శ్లో॥ తఘృతేమధుమధ్యస్థం । గోమేధికంచద్వీపయోః॥
తన్మధూఇక్షుమధ్యంచ । బర్బరద్వీపనామయోః।

తా॥ ఆనేతిసురసముద్రములకు మధ్య గోమేధికద్వీపంబును, సురచెరుకుపాల సముద్రముల రెంటికినడుమ బర్బరద్వీపంబును,

శ్లో॥ ఇక్షుజోసచ్ఛితోమధ్యే । పుష్కరనామద్వీపయోః॥

తా॥ ఆచెరుకురససముద్రము, నుదక సముద్రముల నడుమ పుష్కరద్వీపము మొదలగు సమస్తముగలుగ జేసి యందునవ వర్షంబులను గురిపించువిధం బెరింగిం చెదవినుము.

నవవర్షంబుల నిర్మించుట

క॥ భరతముకింపురుషంబును
హరివర్షమిలావృతంబు । హైరణ్యంబుః
గురురమ్యకభద్రాశ్వము
లరయంగా కేతుమాల । యనుతొమ్మిదగున్ ॥

క॥ ఈతోర్మ్యాదివర్షంబులో
కేతీరుసుమేరువందు । నెప్పుడు గురియున్
స్రోతస్వినలై పాఱును
చాతుర్దిశలందుజలము । తుమ్మెలఁ మెల్లన్॥

తా॥ భారతవర్షము, కింపురుషవర్షము, హరివర్షము, ఇలావృత వర్షము,రమ్యకవర్షము, హైరణ్యవర్షము, కురువర్షము, భద్రాశ్వవర్షము, కేతుమాలవర్షము, ననుదొమ్మిదివర్షములుమహాప్రవాహములైపాఱుచుండునటులజేసియుండెనంతటబ్రహ్మ లోకంబున ప్రజలకు వివాహోపనయనాది సమస్త శుభకార్యంబులజరిగించుకొనుటకు పంచాంగము గుణించుక్రమం బెఱింగెం జెదవినుము.

మను బ్రహ్మతిథినిర్మించుట
హనుమచ్ఛిల్పశాస్త్రము.

శ్లో॥ తిథిరూపమనుః ప్రోక్తః॥

తా॥ మనుబ్రహ్మ యాచంద్రసూర్యులుసంచరించు నహోరాత్రంబునఁగూర్చి యొక్కదివసంబుగాఁ జేసియాదివసంబునకు శుద్ధపాడ్యమియనిపేరిడి వీనికిఁ శుభాశుభంబుల విమర్శించియది మొదలుకొని యట్లుపదునైదుతిథులను గావించి యద్దివసంబునాటికి గుఱుతు చంద్రుఁడభివృద్ధియగుటచే మనకదిశుక్లపక్షం బనియు, పూర్ణిమయనియు నదిపితృదేవతలకొకపగలనియుఁ నామంబిడియుండెను.మరలనావరుసపదునైదవనాటికి గుఱుతు చంద్రుఁడు క్షీణించుటచే మనకదికృష్ణపక్షంబనియు నమావాస్యయనియు, బేరిడియుండెను అదియే పితృదేవతల కొకరాత్రిగాజేసియుండెను. మరియునీరెండు పక్షంబులనుజేర్చి మనకు ముప్పదిదినంబులుగానిర్ణయించియుండెను అట్టిదివసంబులు పితృదేవతల కొకయహోరాత్రంబుగాఘటించె గనుక మనకరువదిదివసంబులచేత నొకటి చైత్రము రెండు వైశాఖ మనిపేరిడియారెండుమాసంబుల కొకటి వసంతర్తువనియు, మరల నాదివసంబులరువదిచే జ్యేష్ఠాషాఢంబులనియు నామంబిడి యమ్మాసద్వయంబునకు రెండు గ్రీష్మఋతు వనియు, తదీయఘస్రంబులరువదిచే శ్రావణ భాద్రపదనామంబు లేర్పరచి యారెండు నెలలకు మూడు వసంతఋతువనియు, మరి తద్దివసంబులరువదిచే నాశ్వయుజ కార్తీకంబులను నామధేయములు గల్పించి యట్టిమాసయుగంబునకునాలుగుశరదృతువనియు, దదుపరి యాదివసంబులరువదిచే మార్గశిరపుష్యంబులని పేరిడి తన్మాసయుగ్మంబునకైదుహేమంతర్తువనియు, నట్టిదివసంబు

లపవదియైన మాఘఫాల్గుణనామంబులిడి యమ్మాసద్వయంబున కారు శిశిరువనియు గుర్తించి యట్టిఋతువులారింటిచే మనకు సుత్తరదక్షిణాయనంబులను రెండుగా నిర్మించి యట్టి యాయనంబులు రెండునుంగూర్చి మనకు మొదట ప్రభవయను సంవత్సరముజేసియుండె గనుక మయబ్రహ్మ వారమునిర్మించువిధం బెరింగించెద వినుము.

మయబ్రహ్మవారమున్సృజించుట

హనుమచ్ఛిల్పశాస్త్రము.

శ్లో॥ వారంచమయసంభవం॥

తా॥ మయబ్రహ్మ (6) కనురెప్పపాట్లకాలమ (1) విఘడియ యనియు (60) విఘడియల కాలమొకఘడియయనియు, ($2\frac{1}{2}$) ఘడియ యొకఘంట యనియు 24) ఘంటలొకదివసమనియు, నాదివసమే మొదటియాదివారమనియు, రెండు సోమవారమనియు, మూడు మంగళవారమనియు, నాలుగు బుధవారమనియు, నైదు గురువారమనియు, నారు శుక్రవారమనియు, నేడుశనివారమనియు, నీవిధంబుగా నేడువారములు సృజించియుండె గనుక త్వష్టృబ్రహ్మ నక్షత్రమునిర్మించు క్రమం బెరింగించెదవినుము.

త్వష్టృబ్రహ్మనక్షత్రమునిర్మించుట.

హనుమచ్ఛిల్ప శాస్త్రము

శ్లో॥ నక్షత్రంత్వష్టృహూకంచ ॥

తా॥ త్వష్టృబ్రహ్మ యశ్వని, భరణి, యను సప్తవింశతినక్షత్రంబులను. మేషాదిద్వాదశలగ్నంబులను, దశఫలితార్థంబును, సృష్టించి యుండె గనుక శిల్పి బ్రహ్మ సప్తవింశతియోగంబుల నిర్మించువిధం బెరింగించెదవినుము.

శిల్పిబ్రహ్మయోగము నిర్మించుట

హనుమచ్ఛిల్పశాస్త్రము

శ్లో॥ శిల్పియోగంత్వథ వచ ॥

తా॥ శిల్పిబ్రహ్మ విష్కంభమాదిగాగల సప్తవింశతియోగంబులను, దత్కాలాంశములను, నుద్భవింపజేసియుండెగాన విశ్వజ్ఞబ్రహ్మ కరణము నిర్మించువిధం బెరింగించెద వినుము

విశ్వజ్ఞబ్రహ్మకరణమునిర్మించుట.

హనుమచ్ఛిల్పశాస్త్రము.

శ్లో॥ విశ్వజ్ఞ కరణంచైవ ॥

తా॥ విశ్వజ్ఞబ్రహ్మ బవబాలవలయను పదునొకండు కరణంబులను దత్ఫలితాఫలితంబులను బుట్టించియుండె గనుక మరియు నెరింగించెద వినుము.

హనుమచ్ఛిల్పశాస్త్రము.

శ్లో॥ పంచాంగమధిదేవతాః॥

తా॥ ఇట్లు పంచబ్రహ్మలు పంచాంగమున కధిదేవతలుగానుండి సుముహూర్తముల నిశ్చయించుకొనుటకు పంచాంగమును గుణించి యుండిరి ఆ విశ్వకర పంచకులముల నిర్మించు విధం బెరింగించెద వినుము.

పంచకులములజననము.

కృష్ణయజుర్వేదము

శ్రుతి॥ బ్రహ్మణోస్యముఖమాసీత్ బాహూరాజన్యఃకృతః ఊరూతదస్యయద్వైశ్య పద్భ్యాగ్ం శూద్రో అజాయత పాదేనఘేషు పంచమా ॥

తా॥ విశ్వకర్మ తనముఖమునందు బ్రాహ్మణులను, భుజములందు క్షత్రియులను, దొడలందు వైశ్యులను, పాదములందు శూద్రులను, గోళ్ళయందు పంచములను నీయైదుకులములయందు నాలుగులక్షల మానవులను సృజించి యటుపిమ్మట బృథివివలన నోషధులు, నోషధులవల్ల నన్నము, నాయన్నమువలన నీ యైదువర్ణముల సంతతి యావన్మంది ప్రజలు అభివృద్ధి బొందునటులను, వారలకు బ్రహ్మత్వము గలిగియుండునటులను, వారికి సంబంధములు గలిగియుండునటులను నేరచి యనంతరంబున.

శ్లో॥ త్రింశల్లక్షాః పశుశ్చైవ । స్థావరో లక్షవింశతి ।
లక్షాశ్చతుర్థిర్మానుష్యా । న్నవలక్షజలేచరః॥

శ్లో॥ క్రిమ్యాదేకదశంలక్షః । దశలక్షో విహంగమః।
చతస్రోఽకీతిపతేభ్యః । లక్షేనిర్మితవిశ్వసృట్ ।

తా॥ అతని సృష్టివలన ముప్పదిలక్షల పశువులను, నిరువది లక్షల స్థావరంబులను, దొమ్మిది లక్షల జలచరములు, బదునొకండు లక్షల క్రిమకీటకాదులను, బది లక్షల పక్షిజాతులను, పైనిచెప్పబడిన నాల్గులక్షల మానవుల సంయుతముగ నెనుబది నాలుగు లక్షల మానవుల సంయుతముగ నెనుబది నాలుగు లక్షల రకములగు జీవంబులలో స్థావరంబులకుదప్ప తక్కిన జీవంబులన్నింటిని స్త్రీ పురుష రూపములుగను సృజించి యవ్విధముగ బోషణలయంబులను జేయుచుండె గనుక నిట్లు జెప్పబడిన వర్ణాశ్రమ ధర్మంబులనుగూర్చి కొంత విచారించుచున్నాము పూర్వోక్తమైన శ్రుతినిబట్టి యీ పంచకులములును, నీపంచబ్రహ్మలును, గూడి యతనియొక్క యవయంగములం దుద్భవించియుండుట వలన మనుబ్రహ్మ సంతతి విశ్వబ్రాహ్మణులనియు, మయబ్రహ్మ సంతతి క్షత్రియులనియు, ద్వష్టృబ్రహ్మ సంతతి వైశ్యలనియు. శిల్పిబ్రహ్మసంతతి శూద్రులనియు, విశ్వజ్ఞబ్రహ్మ సంతతిపంచములనియు నన్వయించుకొనవలయు నట్లన్వయించు కొనినప్పు డీక్రింద జెప్పబడిన మొదటి జాతియగు విశ్వబ్రాహ్మణులయొక్క గోత్రప్రవర శాఖలే తక్కిన నాల్గుజాతుల కేర్పడి బ్రహ్మవంశస్థులైయున్నారు, ఇటీవల యార్షేయ బ్రాహ్మణుల బోధవలన నాల్గుజాతులవారు వేదోక్త కర్మల నాచరించక పురాణోక్తముగ గర్మల నాచరించి యీప్రపంచ మునందనేక తెగలవారై యుండునట్టు గన్పట్టుచున్నది మఱియు నతని ముఖమునం దుద్భవించిన బ్రాహ్మణులగు పంచబ్రహ్మలకు గోత్రంబుల నిర్ణయించు విధంబెరింగించెద వినుము.

పంచబ్రహ్మలగోత్రములు.

తే॥ గీ॥ సానగసనాతనయునహ । భూనప్రత్న
సయుసుపర్ణసగోత్రము । లయిదుపంచ
బ్రహ్మలకుగ్రమంబుగబర । బ్రహ్మయపుడు
నిర్ణయించెనుధరయందు । నిశ్చయముగ॥

తా॥ సనుబ్రహ్మకు సానగ, మయబ్రహ్మకు సనాతన, త్వష్టబ్రహ్మకు నహభూన, శిల్పిబ్రహ్మకు బ్రత్నస, విశ్వజ్ఞబ్రహ్మకు సుపర్ణస యను నీయైదు గోత్రములు నిర్ణయించి యటుపిమ్మట వారలకు బంచప్రవరలు నిర్ణయించు విధం బెరింగించెద వినుము,

పంచబ్రహ్మల ప్రవరలు.

శ్లో॥ సద్యోజాత ప్రవరయుక్ । సానగర్షిర్మనోరభూత్ ।
వామదేవ ప్రవరయుక్ । సనాతనఋషిస్త్వ రేః॥

శ్లో॥ అఘోర ప్రవర స్త్వష్టు । రహభూనఋషిర్మదాః।
శిల్పస్యప్రత్నసఋషిః । వత స్తత్పురుషాఖ్యకః॥

శ్లో॥ ఈశాన్యప్రవరేణాపి । యుక్తోవిశ్వవిధాత్రితః॥
సువర్ణసాభిధానేన । ఋషిణా భాతిభూతలే ॥

తా॥ సానగ మహర్షికి సద్యోజాత ప్రవరయు, సనాతనమహర్షికి వామదేవ ప్రవరయు, నహభూనమహర్షికి నఘోరప్రవరయు. బ్రత్న మహర్షికి దత్పురుష ప్రవరయు, సుపర్ణమహర్షి కీశాన్యప్రవరయు గలిగియుండెగనుక బంచబ్రహ్మలకు శాఖలు నియమించు విధంబెరింగించెద వినుము.

పంచబ్రహ్మలశాఖలు.

శ్లో॥ ఋగ్యజుస్సామశాఖాశ్చ। ధర్వణస్సానగస్యహి।
సనాతనస్యాహభూన । ప్రత్నయోః ప్రణవఃసవేః॥

తా॥ సానగ మహర్షికి ఋక్శాఖయు, సనాతన మహర్షికి యజుశ్శాఖయు, నహభూనమహర్షికి సామశాఖయు, బ్రత్నమహర్షికి యధర్వణశాఖయు, సుపర్ణమహర్షికి ప్రణవశాఖయు, నిట్లుగల్పించి వారలకు వాహనంబు లేర్పరచిన తెరంగెరింగించెద వినుము.

పంచబ్రహ్మలవాహనములు.

తే॥ గీ॥ కాలమేఘంబు ప్రథమము । త్రోలద్రోణ
మేఘమది రెండుమహానీల । మేఘత్రయము

కుంభ మేఘుంబునొల్లగు గుఱుతరముగ
వాయు మేఘుంబునైదగు । వరుసతోడ

తా॥ సౌనగమహర్షికి గాలమేఘవాహనము, సనాతనమహర్షికి నుత్తాల్రద్రోణ మేఘవాహనము, నహభూనమహర్షికిమహానీల మేఘవాహనము, ప్రత్నమహర్షికి గుంభమేఘవాహనము, సువర్ణమహర్షికివాయు మేఘవాహనము, నేర్పరచియనంతరము వారలకాసనంబుల నిర్ణయించువిధం బెఱింగించెదవినుము.

## పంచబ్రహ్మలయాసనములు.

శ్లో॥ ఆసనాన్యాని నేతేషాం । సౌనగాదిమహర్షిణాం
ధర్భచిత్రకృష్ణరూప । వ్యాఘ్రపద్మానిచక్రమాత్ ॥

తా॥ సౌనగమహర్షికిదర్భాసనము, సనాతవమహర్షికిజిత్రాసనము, నహభూనమహర్షికికృష్ణాసనము, ప్రత్నమహర్షికివ్యాఘ్రాసనము. సువర్ణమహర్షికిబద్మాసనము నిట్లునియమించి వారలకు హోమగుండంబులనిర్ణయించువిధం బెఱింగించెదవినుము.

## పంచబ్రహ్మలహోమగుండములు.

శ్లో॥ మనుత్రికోణగుండంచ । మయానాంచతుష్కోణయోః॥
త్వష్ట్రకంవర్తులాకారం । శిల్పినాంషట్కోణయోః॥

శ్లో॥ విశ్వజ్ఞ మష్టకోణంచ । పంచహూమ్రపకీర్తితాః॥
ఏతేసాదాఖ్యాహుంచైతే । ద్వితీయుంజన్మనిర్ణయం॥

తా॥ సౌనగమహర్షికిత్రికోణగుండము సనాతనమహర్షికిజతుష్కోణగుండము నహభూనమహర్షికివర్తగుండము, ప్రత్నమహర్షికిషట్కోణగుండము, సువర్ణమహర్షికి అష్టకోణగుండమును, నిర్ణయించివారలకు యోగదండంబు లేర్పరచుక్రమం బెఱింగించెదవినుము.

## పంచబ్రహ్మలయోగదండములు.

శ్లో॥ మనోరజతదండానాం । మయానాం వేణుదండయోః॥
త్వష్టానాంతామ్రదండంచ । శిల్పినాంవేత్రదండయోః॥

శ్లో॥ సువర్ణదండవిశ్వజ్ఞ । పంచైతేదండముచ్యతే ।
పంచసాదాఖ్యయాతత్వం । ద్వితీయంజన్మలీలయోః॥

తా॥ సానగమహర్షికి వెండిదండము, సనాతనమహర్షికి వెదురు దండము సహభూనమహర్షికి రాగిదండము, ప్రత్నమహర్షికి బెత్తపుదండము, సుపర్ణమహర్షికి బంగారుదండము, నివియేర్పరచి వారలకు బ్రహ్మచర్యాశ్రమంబుల నిర్ణయించువిధం బెరింగించెదవినుము.

పంచబ్రహ్మలబ్రహ్మచర్యవ్రతము.

మనుసూత్రము.

శ్లో॥ మేఖలాకుశకౌపీన । ముపవీతంచనిత్యశః॥
దండంచకటిసూత్రంచ । బ్రహ్మచారీచధారయేత్ ॥

తా॥ ఇట్లుపంచబ్రహ్మలకు బిడిచుట్టున స్త్రీములు దర్భలు, గోచులు పవిత్రములు, యోగదండములు, మొలత్రాళ్ళు, సహితముగ నేర్పరచి సుముహూర్తంబున నా మేరుపర్వతపట్టణగృహములయందు భేరీమృదంగాది సమస్త వైభవంబులతో నుపన యనాదికార్యంబుల జేయువిధం బెరింగించెదవినుము.

పంచబ్రహ్మలసూత్రధారణవిధి.

శ్లో॥ మనోరజతసూత్రంచ । మయానాంపద్మసూత్రయోః।
త్వష్టుఃకంతామ్రసూత్రంచ । శిల్పికార్పాససూత్రయోః॥

శ్లో॥ విశ్వజ్ఞస్వర్ణసూత్రంచ । పంచసూత్రః ప్రకీర్తితాః।
ఏతేపంచవిధాతంతు । పంచసాదాఖ్యభూషణాః॥

తా॥ సానగమహర్షికి వెండిజంధ్యము, సనాతనమహర్షికిబద్మ జంధ్యము, సహభూనమహర్షికిరాగిజంధ్యము, ప్రత్నమహర్షికినూలుజంధ్యము. సుపర్ణమహర్షికి బంగారుజంధ్యము, నొసంగియీపంచ బ్రహ్మలకు దండ్రిగాయత్రీమంత్రోపదేశంబు జేయుటవలన బ్రకృతి యందుబద్ధులైయుండిరికనుకవారలకువివాహమహోత్సవంబుల జేయువిధం బెరింగించెదవినుము.

పంచబ్రహ్మలవివాహములు.

శ్లో॥ ఆదిశ్శపరేచ్ఛాస్త్రి పశ్చ । క్రియాజ్ఞానేచయేశుభే ।
భార్యాఃభూవుః క్రమశః । సానగాదిమహర్షిణాం॥

తా॥ సానగమహర్షియైన యీశ్వరున కాదిశక్తిని, సనాతనమహర్షియైన విష్ణువునకు బరాశక్తిని, నహభూన మహర్షియైన బ్రహ్మకు నిచ్ఛాశక్తిని, ప్రత్న మహర్షియైన నింద్రునకు గ్రియాశక్తిని, సువర్ణమహర్షియైన సూర్యునకు జ్ఞానశక్తిని గూర్చి భేరీమృదంగాది సమస్త వైభవములతో బరిణయంబులను గావించె నంత నావిశ్వకర్మ మేరుపర్వతము నలుదిక్కులయందు బంచాశత్కోటి భూమండలము నిర్మించు విధం బెరింగించెద వినుము.

పంచాశత్కోటిభూమినిర్మించుట.

దేవబ్రాహ్మణ మహత్త్వము.

శ్లో॥ షష్టిముష్టిభవేహస్తం । హస్తంచత్వారికోధనుః ।
త్రిసహస్రధనుః క్రోశం । క్రోశంచత్వారియోజనం॥

శ్లో॥ సహస్రయోజనందేశం । దేశంచత్వారిమండలం ।
సహస్రమండలంఖండం । నవఖండంతుమేదినీ॥

తా॥ అరుపిడికెళ్లనొకహస్తము (అనగా నొక మూర) యగును గనుక నాలుగుమూరలొకధనస్సు, మూడుపేలధనస్సులొకక్రోసు, నాలుగుక్రోసులొక యోజనము (అనగా నొక యామడయగునని భావము) వేయియోజనములొక దేశము, నాలుగుదేశములొక మండలము, వేయిమండలములొక ఖండము, తొమ్మిది ఖండములొక మేదిని (అనగా నీభూచక్రమంతయు) నుండు నిర్ణయంబు గనుక నందు నవఖండము లేర్పఱచు క్రమం బెరింగించెద వినుము.

నవఖండముల వివరము

శ్లో॥ ఇంద్రోభరతతామ్రశ్చ । గభస్తిర్నాగవారుణం ।
గంధర్వచరసౌమ్యశ్చ । ఏతేషాంనవఖండయోః॥

తా॥ భరతఖండము, ఇంద్రఖండము, చరఖండము, గభస్తిఖండము, నాగ ఖండము, తామ్రఖండము, వారుణఖండము, సౌమ్యఖండము, గంధర్వఖండము,

లను తొమ్మదిగ నేర్పరచి వానిని బంచబ్రహ్మలేలుట కాజ్ఞ యొసంగెనది యెరిం
గించెద వినుము.

పంచబ్రహ్మలునవఖండము లేలుట.

దేవబ్రాహ్మణమహాత్మ్యము.

శ్లో॥ దేవదేవమహాదేవ। విశ్వకర్మాజగద్గురుః।
విశ్వకర్మసుతానాంచ। విశ్వలోకాదిపాలనః॥

తా॥ మనుబ్రహ్మకు భరతఖండమునందుగల శతకోటి భూమండలము నొక్క
శంఖవత్సరంబులు పరిపాలించుటకును, మయబ్రహ్మకు నిద్రఖండము చంఖండము
లందుగల శతకోటి భూమండలము నొక్క శంఖవత్సరంబులు పరిపాలించుటకును,
త్వష్టబ్రహ్మకు గభస్తిఖండము నాగఖండములందుగల శతకోటి భూమండలము
నొక్క శంఖవత్సరంబులు పరిపాలించుటకును, శిల్పిబ్రహ్మకు ద్రాక్షఖండము
వారుణీఖండములందు గల శతకోటి భూమండలము నొక్క శంఖవత్సరంబులు పరి
పాలించుటకును, విశ్వజ్ఞబ్రహ్మకు సౌమ్యఖండము గంధర్వఖండము లందుగల
శతకోటి భూమండలము నొక్క శంఖవర్షంబులవఱకు బరిపాలనము జేయుటకును,
సృష్టి స్థితి లయాదులకు గర్తలై ప్రవర్తించుటకును, నాజ్ఞ యొసంగిన పిమ్మట
వారు రాజ్యపరిపాలనము జేయుచుండి రంతనావిశ్వకర్మ క్రమక్రమంబుగ ముప్పది
మూడుకోట్ల దేవతలను, నేబదియారుకోట్ల రాక్షసులను సృజించి మేరుపర్వతము
నందు నివసింపజేసియుండె నందువలన

శ్లో॥ విశ్వకర్మకులంసర్వం। సురాసురగణైస్సహ॥

తా॥ ఇట్లు జెప్పబడిన సమస్త దేవగణములును, సమస్త రాక్షస గణములును
విశ్వకర్మ వంశస్థులై యున్నారు. కనుక వారలకు బ్రాహ్మణ పురోహితుని నిర్ణ
యించు విధం బెరింగించెద వినుము.

దేవపురోహితనిర్ణయము.

విశ్వబ్రహ్మోపనిషత్.

శ్రుతి॥ ఉపాభానభద్రదత్తకాండవవిశ్వాకారశ్రీముఖాఖ్యాస్త్రయః॥

శ్లో॥ భద్రదత్తస్యత్వష్టాచ । యజ్ఞపాలకఏవచ ।
కుశధర్మస్తామగర్భః । అతిధాతాచపంచవై॥

శ్లో॥ త్వష్ట్రాపేస్తువిభాషాయాం । జాతాఃకత్యయనస్తధా।
విశ్వరూపోమహావాక్య స్త్రయోమీధర్మవేదినః ॥

తా॥ విరాడ్విశ్వకర్మకు తృతీయ పుత్రుండైన త్వష్టృబ్రహ్మకు సుపాఖ్యాన, భద్రదత్త, కాండవ, విశ్వకార, శ్రీముఖులను నీపంచ బ్రహ్మర్షు లుద్భవించి యుండిరి. అందు ద్వితీయ పుత్రుండైన భద్రదత్త మహర్షికి జ్యేష్ఠపుత్రుండగు త్వష్టృబ్రహ్మను దేవతలకు బురోహితునిగా నియమించినందున నతండట్లజేసి యుండె నటుపిమ్మట నతని ద్వితీయ పుత్రుండైన విశ్వరూపుడనువాడు దేవతలకు బౌరోహిత్య మొనర్చి యుండెనని చెప్పబడుచుండె నదియెట్లనిన.

కృష్ణయజుర్వేదసంహిత.

2 వ కాండము 5 వ ప్రపాఠము 1 అనువాకము.

శ్రుతి॥ విశ్వరూపోవై త్వాష్ట్రిః పురోహితోదేవానామాసీత్ ॥

భా॥ త్వష్టురయంపుత్రః త్వాష్ట్రిః విశ్వరూపః దేవానాంపురోహితః ఆసీత్ ॥

వ॥ మరియు

భాగవతము 6 వ స్కంధము 8 వఅధ్యాయము.

శ్లో॥ తద్విశ్వరూపంభజతాసువిప్రం । తపస్వినంత్వాష్ట్రమధాత్మవంతం।
సభాజితోర్థాన్ సవిధాస్యతేవో । యదిక్షమధ్వంయదుపాసకర్మా।

తా॥ ఒకానొక సమయమున దేవతలకు బురోహితుడు గావలసి వచ్చినప్పుడు చతుర్ముఖబ్రహ్మను విచారించగా నాత్వష్టృ బ్రహ్మపుత్రుండైన విశ్వరూపు డను బ్రాహ్మణుని మీరు పురోహితునిగా గ్రహించుట యుక్తమని చెప్పినందున దేవతలు విశ్వరూపుని నాచార్యునిగా గైకొని యుండిరని చెప్పబడుచుండె గనుక నిందును గురించి వ్యాసప్రణీతంబైన వాయుపురాణంబున మరియొక విధముగ వ్రాయబడు చుండెనది యెట్లనిన.

## వాయుపురాణము 4వ అధ్యాయము
## 85 వశ్లోకము.

శ్లో॥ త్రిశిరావిశ్వరూపవస్తు । త్వష్ట్రపుత్రోభవన్మహాన్ ॥
విశ్వరూపానుజశ్చాపి । విశ్వకర్మాప్రజాపతిః॥

తా॥ ఇందున త్వష్టృబ్రహ్మకు విశ్వరూపుఁడు విశ్వకర్మ ప్రజాపతి యను పుత్రు లిరువురుగల్గిరి. అందు విశ్వరూపుఁడు దేవతలకు పురోహితము జేయు చుండెనని చెప్పినప్పు డావిశ్వరూపుని తాత శుక్రుఁడయ్యెను నాశుక్రుండార్షేయ బ్రాహ్మణుండను భావముతో విశ్వరూపుఁడు దేవపురోహితుడని చెప్పుకొనుచున్నారు కనుక నిందును గూర్చి యీ క్రింద శ్రుతిస్మృతి ప్రమాణముననుబట్టి విచారించు చున్నాము. అది యెట్లని యెదరేని ఋగ్వేదము (8) వ అష్టకము (3) వ అధ్యాయము (2) (3) మంత్రములందు విరాడ్విశ్వకర్మ పరమేశ్వరుడని చెప్పబడి యుండెను. వానియొక్క పుత్రుఁడు బ్రహ్మదేవుఁడని భారతము అను శాసన పర్వము (85) వ అధ్యాయమునందు జెప్పబడియుండెను ఐతరేయ బ్రాహ్మణము అందా బ్రహ్మదేవునికి జన్మించినవాడు భృగుమహర్షియనియు, నా భృగుమహర్షికి జన్మించినవాడు వారుణిభృగువనియు జెప్పియుండె గనుక వాయుపురాణము నాల్గవ అధ్యాయమునందా వారుణిభృగువునకు జన్మించినవాడు శుక్రుఁడని చెప్పియున్నం దున నాశుక్రుఁడు విశ్వబ్రాహ్మణుఁ డగునో ? కాదో ? వారే విచారించుకొనవచ్చును గాబట్టి శుక్రుని మనుమడు విశ్వరూపుడు, త్వష్టృబ్రహ్మ మనుమడు విశ్వరూపుడు. నను వారలిరువురు విశ్వకర్మ వంశీయులైనందున బూర్వము జెప్పిన శ్రుతిప్రమాణ వాక్యముల ననుసరించి త్వష్టృబ్రహ్మ పౌత్రుడగు విశ్వరూపుఁడే దేవపురోహితుఁ డని స్పష్టముగ నిరూపించుచున్నాము.

### యుగవర్షప్రమాణము.

క॥ గురువరనాల్గుయుగంబుల
పరిమితియగువత్సరములు । వానిధర్మముల్ ।
జరిగించువారలెవ్వరో
గురిగానది తెల్పుమయ్య । కోరికదీరన్॥

## కృతయుగధర్మములు.

వ॥ ఓయి శిష్యా! కృతయుగము పదియేడు లక్షల యిరువది యెనిమిదివేల సంవత్సరముల పరిమితిగలదై యా యుగాంతమువరకు సకల జనులు గపటబుద్ధిలేనివారై సంచరించియుండిరి. ధర్మదేవత నాలుగు పాదంబులుగలదై ప్రకాశించియుండెను. భగవంతుఁడు శ్వేతరూపంబున జగంబుల బ్రోచియుండెను. మరియు బ్రహ్మ, క్షత్రియ వైశ్య, శూద్ర, పంచములను, నైదుగురు వర్ణభేదంబులులేక బాంధవ్యంబులచే బంక్తి భోజనము చేయుచు నేక వేదక్రియా యోగ కర్మసంయోగంబున బుణ్యలోకంబును బడసియుండిరి. ఆయుగంబు నందసూయామద మాత్సర్యాది వికారంబులు లేవు. ప్రజాక్షయంబును లేదు. కనుక త్రేతాయుగ ధర్మంబు దెల్పెద వినుము.

## త్రేతాయుగ ధర్మములు

వ॥ ఓయిశిష్యా! త్రేతాయుగము పదిరెండులక్షల తొంబది యారువేల వత్సరముల పరిమాణమును గలదై యాయుగాంతమువరకు ధర్మదేవత త్రిపాదంబుతో వర్తిల్లె నందుజనులు సత్యప్రవర్తకులై యజ్ఞతపోదనాది క్రియలచే నటించిరి. అందు రక్తవర్ణుండై విష్ణుభట్టారకుండు లోకంబును బరిపాలించియుండె. స్త్రీలు గొడ్రాలయ్యేది లేదు. మాతా పితృల యెదుట బుత్రులు నశించుటలేదు. నెలకు మూడు వర్షములు గురిసి సంపదైశ్వర్యము లభివృద్ధి నొందియుండెను. భూమియందెచ్చటను దరిద్రులులేరు. ఒకరి దండనకు నొకరు లోబడుటయును లేదు. కులాచారములు దప్పక నడుచుకొనియుండిరి. కనుక ద్వాపర యుగ ధర్మంబు లెరింగించెద వినుము.

## ద్వాపరయుగధర్మములు.

వ॥ ఓయిశిష్యా! ద్వాపరయుగ మెనిమిదిలక్షల యిరువదినాలుగువేల సంవత్సరంబుల ప్రమాణంబునుగలదై యాయుగాంతమువరకు

ధర్మము రెండుపాదములు గలదైయుండెను. ప్రజలుసత్యహీనులై కామములచేత గర్మల నభిలాషతోఁజేసియుండిరి. అచ్యుతుఁడు కృష్ణవర్ణుడై లోకంబును బాలించియుండె గనుక గలియుగధర్మముఁ జెప్పెద వినుము.

## కలియుగధర్మములు.

శ్లో॥ కలౌపాపినిసంప్రాప్తే । ధర్మహానిర్భవిష్యతి ।
యాతేత్వబ్దసహస్రాణాం । పంచకేపాపినోజనః ॥ ౧

చండాలప్రచురంయాంతి । యాంతిబ్రహ్మద్విషోబలం ।
బుద్ధిభ్రంశోద్విజాతానాం విద్యాకర్మాసంక్షయః ॥ ౨

శాస్త్రశ్చాపార్థవాదశ్చ । శిష్టాచారవినాశనం ।
దుర్భిక్షవ్యనావృష్టి । ర్బహులోత్పాతదర్శనం ॥ ౩

సూర్యాదిగ్రహగోళానాం । గతివైషమ్యసంభవః ,
గంగామాహాత్మ్యహానిశ్చ । శూద్రోపనయనాదికం ॥ ౪

కుండగోళకసంతానం । మద్యమాంసాదిభక్షితః ।
శివకేశవనిందాచ । శ్రాద్ధాదీనాంవిపర్యయః ॥ ౫

ఆచార్యగురుధిక్కారం । పురోహితవిసర్జనం ।
పరనిందాపరస్వత్వం । పరదారాపరిగ్రహః ॥ ౬

స్త్రీణాంపునర్వివాహశ్చ । శూద్రదసన్యాసలక్షణం ।
దేవతామహిమాలోపో । వేదాధ్యయనవర్జితం ॥ ౭

అసత్యంపక్షపాతంచ । నిర్మలాత్మంచపంచకం ।
జ్ఞానద్రోహీశ్రుతిద్రోహి । శిల్పానివివిధానిచ ॥ ౮

వృద్ధతాంమంత్రయంత్రాణాం। మతవాదదురాగ్రహః ।
సముద్రయానంవిప్రాణాం । కలిదోషాద్భవిష్యతి ॥ ౯

తా॥ ఓయి శిష్యా ! కలియుగము నాలుగు లక్షల ముప్పది రెండువేల సంవత్సరముల పరిమితి గలిగి యాయుగమైదువేల సంవత్సరములకు బాపమధిక మగుచుండును.

ధర్మము క్షీణించును జనులందరు పాపముల జేయుదురు చండాలులు విస్తారమగుదురు బ్రహ్మద్వేషంబు గలుగును. విద్యయుగర్మలు నశించును. శాస్త్రంబుల కపార్థముల జెప్పి వాదించెదరు. శిష్టాచారములుడుగును. కలవులు సంభవించును. ననావృష్టి కలుగును, దేశోత్పాతములు గలుగును, సూర్యాది గ్రహములకు వైషమ్యగతి సంభవించును, గంగాది మహానదులు సత్యము దప్పును, శూద్రులుపనాయది కర్మలాచరింతురు, కుండగోళకులు మొదలగువిప్రులు మద్యమాంసాదులు భక్షింతురు, శివకేశవుల నిందించెదరు. శ్రాద్ధాది కర్మలు విపర్యములగును. గురువుల దిరస్కరింతురు. పరుల దూషింతురు, పరస్త్రీల సంగమించెదరు. స్త్రీలకు బునర్వివాహములు జరుగును. శూద్రులు బ్రహ్మజ్ఞాను లయ్యేదరు. దేవతా మహిమలు తగ్గును, వేదాధ్యయనముల వర్జింతురు అసత్యము, పక్షపాతము నధికమగును పెద్దలను వంచన చేయుదురు. జ్ఞానద్రోహులగుదురు. నానావిధములైన దేవత లేర్పడును. మంత్రయంత్రములు ప్రజ్వరిల్లును మత వాదములచే జనులు దురాగ్రహు లగుదురు. విప్రులకు సముద్రగమనముచేయుట మొదలగు ననేక దోషంబులు జరుగుచుండును. గనుక బంచబ్రహ్మలు చతుర్దశ మనువుల నిర్మించు విధం బెరింగించెద వినుము.

## చతుర్ధశమనువులజననము.

వ॥ స్వాయంభువమనువు, స్వారోచిషమనువు, నుత్తమమనువు తామసమనువు, రైవతమనువు, చాక్షుషమనువు, వైవస్వతమనువు, దక్షసావర్ణికమనువు, సూర్యసావర్ణికమనువు, బ్రహ్మసావర్ణికమనువు, రుద్రసావర్ణికమనువు, ధర్మసావర్ణికమనువు, రౌప్యమనువు, నింద్రసావర్ణికమనువు, యనునీపదునలువురను బుట్టించి వారలకు సకల వేదధర్మశాస్త్రంబులు గరపి యందు స్వాయంభువమనుచక్రవర్తికి సర్వరాజ్యపట్టంబుగట్టనతండు సుభిక్షంబుగ రాజ్యపరిపాలనంబు జేయు విధం బెఱింగించెదవినుము.

## మనుచక్రవర్తి రాజ్యమేలుట.

### భాగవతము 5 వ స్కంధము 1వ అశ్వాసము.

ఆ॥ వె॥ సత్యసంధుడనెడు । స్వాయంభువుండను
మనువుబ్రహ్మచేత । మన్ననదగ

నందియంతనార । దానుమతంబున
దనదుసుతునిరాజ్య । మ సనుసల్పి॥

తా॥ ఇట్లు సత్యసంధుఁడను స్వాయంభువను విశ్వకర్మ రాజ్య పరిపాలనము జేయుచు దనపుత్రుండైన ప్రియవ్రతునకు సకల విద్యలు నేర్పించి తన యొక్క రాజ్యం బతనికి బట్టాభిషేకంబుజేసి విషమంబులగు విషయంబులను విషసముద్రాశవలన విముక్తుడై వనంబునకుంజనియెనంత ప్రియవ్రతుం డేకాదశార్బుద పరివత్సరములు సకలజన సౌకర్యంబుగ రాజ్యంబునేలుచు విశ్వకర్మప్రజాపతి పుత్రియగు బర్హిష్మతియను స్త్రీని బత్నిగాబడసి యవ్వధూమణియందు శీలవృత్త గుణరూప వీర్యౌదార్య సమానంబులైన దనకు నాగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు మహావీర, హిరణ్య, రేతోఘృత, పృష్టసవన మేధాతిథి, వీతిహోత్ర, కవి యనునామంబులుగల పుత్రదశకంబును మరియు నూర్జస్వతి యను నొక్కపుత్రికను గాంచి రందు గవి, మహావీర, పృష్టసవను లను ముగ్గురు బాలకులు నూర్ధ్వరేతస్కులై బ్రహ్మవిద్యానిష్ఠాత్ములై యుపశమన శీలురగుచు బరమహంసయోగం బాచరించి సర్వజీవనికాయావాసుండను, భవభీతజనశరణ్యుండును, సర్వాంతర్యామియు, భగవంతుఁడునునగు వాసుదేవుని చరణారవింద నిరంతస్మరణాగత శివపరమ భక్తి యోగానుభవంబున విశోధితాంతః కరణులగుచు నీశ్వరు దాదాత్మ్యంబొందిరంతనాగ్నీధ్రుండును, నిధ్మజిహ్వయు యజ్ఞబాహు. హిరణ్య, రేతోఘృత, పృష్ఠసవన, మేధాతిథి, వీతిహోత్రుల, నొక్కొక్కని నొక్కొక్క ద్వీపంబునకు బట్టాభిషిక్తు నింజేసి యూర్జస్వతి యను నొక్కకన్యకను భార్గవున కిచ్చెను భార్గవుకు నూర్జస్వతియందు దేవయానయను కన్యకారత్నంబు జనించె. నందు నాగ్నీధ్రుండను విశ్వకర్మ బహుకాలము రాజ్యము జేసియుండె గనుక కృత, త్రేత, ద్వాపార, కలియుగము, లను చతుర్యుగంబులు గూడెనేని యదియొక్క మహాయుగ మంబడును, గనుక స్వాయంభువ, స్వారోచి, షోత్తమ, తామస, రైవత, చాక్షుష ముఖ్య షణ్మనువు, లేలి గతించిన కాలమిప్పటికి సప్తవింశతి పర్యాయంబులు మహాయుగంబులు గతించినవి. సూర్యుని కుమారుండైన వైవస్వత మనువుశక మిప్పటికి రెండుకోట్ల యయిదులక్షల ముప్పదిమూడువేల నలుబది సంవత్సరంబులు గతించి యుండె గనుక నింకజెప్పెద వినుము.

## దేవబ్రాహ్మణమాహాత్మ్యము.

వ॥ ఈవైవస్వతమనువిశ్వకర్మకు నిక్ష్వాకుఁడుద్భవించె నీయిత కునకుగల్గినశతతనూజులలో విజయోద్దండవికుక్షు లనుముగ్గురు

సుతులు హిమాచలపర్వత మధ్యక్షోణియందు నేలుచుండు సమయం
బున వికుక్షికి పురంజనుండు గలిగె, నీపురంజనునకు నింద్రబాహుండు,
గకుత్స్థుండు ననుసుతు లిరువురు జన్మించిరి ఆకకుత్స్థునకు బృధువు
జన్మించె నీపృధునకు విశ్వగంధుండు, నావిశ్వగంధునకు చంద్రుండు,
నీచంద్రునకు వాయునాభ్యుండు, నీవాయునాభ్యునకు నాభర్త, నాభ
ర్తకు బృహదాస్యుడు, బృహదాస్యునకు గువలయేశుండు, గువలయే
శునకు దుంధుమారుడు, నీదుంధుమారునకు బృధాస్యుండు, నీపృధాస్య
నకు హర్మన్యుండు. నీహర్మన్యునకు నికుంభి, ఈనికుంభికి బర్హినాభ్యుండు
బర్హినాభ్యునకు గృతాశ్వుడు, గృతాశ్వునకు సేనజిత్తు, సేనజిత్తునకు
పురకుత్సుండు, నాపురకుత్సునకు మాంధాత, మాంధాతకు నంబరీషుడు,
నంబరీషునకు యువనాశ్వుండు, యువనాశ్వునకు హారీతుండు, హారీ
తునకు పురుకుత్సుండు, పురుకుత్సునకు త్రిధన్యుండు, త్రిధన్యునకు త్రి
బంధుడు. త్రిబంధునకు నరణ్యుండు, నరణ్యునకు త్రిసంధుండు త్రిసంధు
నకు సత్యవ్రతుడు, సత్యవ్రతునకు, త్రిశంకుండు, త్రిశంకునకు హరి
శ్చంద్రుడు, హరిశ్చంద్రునకు లోహితుండు, లోహితునకు చంపకనామ
ధేయుడు, చంపకనామధేయునకు సగరుండు, సగరునకు హాళవంతుడు,
హాళవంతునకు దిలీపుండు, దిలీపునకు భగీరథుండు, భగీరథునకు మూల
కుండు, మూలకునకు దశరథుండు, దశరథునకు నైనవిల్లు, నైనవిల్లునకు
విశ్వవహుండు, విశ్వవహునకు ఖట్వాంగుండు ఖట్వాంగునకు దీర్ఘ
బాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకు బుధశ్రయుండు,
బుధశ్రయునకు నజుండు, నజునకు, దశరథుండు, దశరథునకు శ్రీరామ.
లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను, నామంబుగల నలుగురు కుమారులు
గలిగియుండిరి. అందు శ్రీరాములవారి కులగురుండగు వసిష్ఠుని జననం
బునుగూర్చి శ్రుతి ప్రమాణము నీక్రింద వివరముగ వ్రాయుచున్నాము.

వశిష్టుని జననము - విశ్వకర్మ రత్నమాల

శ్రుతి॥ ఓంప్రిణావాక సభ్వాతీతాం । సర్వేష్ణధానాత్ ॥
సమతేగ్రిహావర్ణ ప్రిలిధా । సర్వాంతా సాయతో ।
విశ్వకర్మణాత్పుత్రా । న్వసిష్టాయాంప్రిలిధా ॥

తా॥ కలియుగంబున శ్రీరాములవారు రాజ్యపరిపాలనము జేయుకాలంబున విశ్వకర్మ పుత్రుడైన వసిష్టునకు శిష్యుండై యుండెను గాని వజ్రసూచికోపనిషత్తునదు జెప్పబడిన (వసిష్ఠోఊర్వశీసుతః) అని చెప్పబడిన యూర్వశియను దేవదాసి గర్భంబున నుద్భవించిన వసిష్టునకు మాత్రము శ్రీరాములవారు శిష్యుడై యుండ లేదు కనుక నీవిప్రులు సూర్యవంశోద్భవుండగు శ్రీరామమూర్తి తమ గోత్ర ఋషియగు వసిష్టునకు శిష్యుండని రామాయణము మొదలగు గ్రంథంబుల యందు జెప్పయుండుట యదార్థముకాదని నమ్మము,

ఫలస్తుతి- శ్వేతాశ్వతరోపనిషత్ 5 వ అధ్యాయము.

శృతి॥ ఏష దేవోవిశ్వకర్మా। సదాజనానాం హృదయేసన్నివిష్టః।
హృదామనీషామనసాఽభిక్లప్తో యఏతద్విదురమృతాస్తేభవంతి

తా॥ జగద్రూప మాయాసంసర్గమున జతుర్దశభవన సృష్టికారుడై యెట్ట యెదుట ప్రకాశించు నీ విశ్వకర్మ పరమేశ్వరు డెల్లప్పుడు సకలజీవుల హృదయాకాశమునందును జలదర్పణాదులయందు సూర్యప్రతిబింబంబుపోల్కి జక్కగా నిలచి యుండెను. అతడే సాక్షిరూపుడై పరమాత్మస్వరూప జ్ఞానసాధనంబులగు మనోబుద్ధిచిత్తంబులచే సచ్చిదానంద స్వరూపమున నభివ్యక్తుడయ్యెను. సాధనచతుష్టయ సంపన్నులగు నేమునిజనంబు లీస్వరూపమును తత్త్వమస్యాది వాక్య ప్రతిపాద్యైక రూపఖండైక రసమని నేను బ్రహ్మమైతి నను ప్రత్యక్ష జ్ఞానంబుచే దెలియుచుండిరో యట్టిజ్ఞాన సంపన్నులు పురారవృత్తి రహితంబగు బ్రహ్మపదంబు బొందుచున్నారు.

గద్య

ఇది శ్రీ వీరాఖ్యునార్య కరుణాకటాక్షలబ్ధ కవితాలక్షణుడా విశ్వకర్మ పాంచానన భువనసగోత్ర పవిత్ర చెరుకూరి వంశాబ్ధి సోమ
చలమయ్య పుత్రరత్న వినుత నే శివరామయోగి ప్రణీతంబయిన
శ్రీ వీరబ్రహ్మాండ సర్వశాస్త్ర సమాధానవ్యత్యయ నిత్య
రత్నాకరమనె కృతినుండి పరిమళచోళ చరిత్రము
ద్వితీయాశ్వాసము సంపూర్ణము

ఓం తత్సత్

బ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోనమః

# పరిమళచోళచరిత్రము

## తృతీయాశ్వాసము ప్రారంభవము

ఇష్టదేవతా ప్రార్థన

తే॥ గీ॥ శ్రీహిమాద్రితనూజావ । శీకృతాంగ
రాజితసుధాంశు రేఖాళి । రః కిరీట
దర్పకధ్వంసపారీ౦ । దహననేత్ర
సుజనరక్షకభీకర । శూలపాణి ॥

క॥ ధరనుఫణీంద్రపురంబున
వరవంశోద్భవుండు బాహు । బలసంయుతుండౌ
పరిమళ చోళాధీశుడు
తిరముగ బాలించుచుండె । దేశంబులు ॥

వ॥ ఇట్లు పరిమళచోళమహారాజు శివభక్తుండై ఫణీంద్రపట్టణము సుఖంబుగ రాజ్యాధిపత్యె మొనర్చుచుండి యొకదినంబున దన గురునకు నమస్కరించి యిట్లనియె.

మహర్షి వంశోత్పత్తిక్రమము.

క॥ శంకరుసన్నిభ తేజుఁడ
సంకరులౌ మధ్యఋషుల । జన్మకథనము న్
శంకయు లేక వచింపుము
సంకించి గ్రహింతు నాహృ । దంతర మొప్పన్ ॥

తా॥ ఈ కలియుగంబున ఋషివంశము జననంబైన విధం బెఱింగింపుడనిన నతనికి గురుండిట్లనియె.

వజ్రసూచికోపనిషత్.

శ్రుతి॥ ఋష్యశృంగో మృగేజాతః । కౌశికో గాధినందనః ।
జంబుకో జంబుకోత్పత్తి । ర్గౌతమో గౌతిసంభవః ।
వాల్మీకో శరభోత్పత్తి । రగస్త్యః కుమ్భసంభవః ।
వ్యాసో లుబ్ధక సంభూతో । వసిష్ఠో ఊర్వశీసుతః ।
నారదో రజకీపుత్రో । కౌండిన్యో మండూకీసుతః ।
సాంఖ్య శ్వపచసంభూతో । గార్గేయో గర్ధభీసుతః ।
శునకీగర్భసంభూతో । శౌనక సుమహాముని ॥

తా॥ అను శ్రుతి ప్రమాణ వచనమునుబట్టి యుత్తర కాశీఘట్టమునందు ద్వాదశమహర్షు లుద్భవించియున్నట్టు దెలియబడుచున్నది. అది యెట్లని యెదరేని ఋష్యశృంగుడు లేడికడుపునను, గౌశికుండు గాధిమహారాజునకునను, జంబుకుండు నక్క కడుపునను, గౌతముండావు గర్భమందునను, వాల్మీకుడు వేటగానిగర్భంబునను, నగస్త్యుడు భాండమునందునను, వ్యాసుంతు పల్లెదాని గర్భంబునను, వసిష్ఠుడు వేశ్య గర్భంబునను, నారదుండు చాకలిదాని గర్భంబునందునను, సాంఖ్యుడు మాల దానికడుపునందునను, గార్గేయుడు గాడిద గర్భంబునను శౌనకుండు కుక్క కడుపునను బుట్టియుండిరి అందువలన నీ ఋషులందరు ననులోమ, విలోమ, కానీన, కుండక, గోళకాది, హీనజాతులవారై యుండిరి. వారిలో గడపటి ఋషియగు వ్యాసునికిదప్ప తక్కినవారలకు బ్రహ్మత్వ మెవ్వనివలన సిద్ధించినది. గోచరింప బడకున్నయది. ఈ ఋషులందరును నార్షేయ బ్రాహ్మణులకు గోత్రఋషులనియును, వీరి పుత్రులగువారిని బ్రవరఋషులనియును, జెప్పబడుచున్నారు కావున వ్యాసుని జన్మకాల నిర్ణయం బెఱింగించెద వినుము.

వ్యాసునిజన్మకాలనిర్ణయము.
శంకరవిజయము.

శ్లో॥ ఆద్యే సత్త్వమునిస్సతాం వితరతిజ్ఞానం ద్వితీయే యుగే ।
దత్తో ద్వాపరనామకే తు సుమతిర్వ్యాసః కలౌ శంకరః ॥

తా॥ ఇందుల కర్దమేమనిన కృతయుగంబున సత్త్వమునియు, త్రేతాయుగంబున సుమతియు, ద్వాపరంబున వ్యాసమహామునియు, గలియుగంబున శంకరాచార్యుండై జన్మించి యుండెననియు జెప్పబడియున్నది. అతఁడు ద్వాపరంబున నుద్భవించి క్రీస్తుశకమునకు బూర్వము 600 సంవత్సరములకు శ్రీమహాభారతము, క్రీస్తుశకమునకు బూర్వము, 400 సంవత్సరములక గరుడపురాణము, క్రీస్తుశకమునకు బూర్వము, 300 సంవత్సరములకు భవిష్యపురాణము, క్రీస్తుశకమునకు బూర్వము, 100, సంవత్సరములకు వసిష్ఠపురాణము, క్రీస్తుశకమునకు బూర్వము 50, సంవత్సరములకు వరాహపురాణము, క్రీస్తుశకము 100, సంవత్సరములకు వాయుపురాణము, క్రీస్తుశకము, 200, సంవత్సరములకు వైవస్వతపురాణము, పద్మపురాణము, క్రీస్తుశకము, 600 సంవత్సరములకు మత్స్యపురాణము, క్రీస్తుశకము 400, సంవత్సరముల కాదిత్యపురాణము, బ్రహ్మాండపురాణము, క్రీస్తుశకము, 400, లేక 500, సంవత్సరముల కగ్నిపురాణము, క్రీస్తుశకము, 600 సంవత్సరములకు స్కాందపురాణము, మార్కండేయపురాణము, క్రీస్తుశకము, 500, లేక 600, సంవత్సరములకు విష్ణుపురాణము, కూర్మపురాణము, క్రీస్తుశకము, 600 సంవత్సరములకు బ్రహ్మవైవర్తపురాణము. లింగపురాణ మాదిగాగల పదునెనిమిది పురాణ కట్టుకథలు రచించి యుండెనని కొన్ని గ్రంథములయందు జెప్పియుండెను గాబట్టి ద్వాపరము నందుద్భవించిన వ్యాసుఁడు క్రీస్తుశకము, 600, సంవత్సరముల వరకు అనగా ద్వాపరమున గడచిన సంవత్సరములు గాక కలియుగమున (3696) సంవత్సరములకు పైగా భూమియందు బ్రతికియుండినట్లభూతకల్పనచే వ్రాయబడినదంతయు నీ దిగువ మూడు గ్రంథములనుబట్టి ముక్కలుముక్కలుగా ఖండించి మా సిద్ధాంతము స్థాయిపరచుచున్నాము. అది యెట్లని యెదరేని క్రీస్తుశకమునకు బూర్వము, 600 సంవత్సరములకు పాణినీ మహర్షి వ్యాకరణ సూత్రములను వ్రాసియుండెనని కొందరు విద్వాంసులు పురాణ నిరీక్షణమను గ్రంథమునందు జెప్పియుండి నందునను నీ వ్యాసుడు పాణినీసూత్ర రచనకాలమున నిరుక్తవ్యాకరణము వ్రాసియుండినందునను, మఱియు విశ్వకర్మ యను గ్రంథమునందు క్రీస్తుశకమునకు బూర్వము 600, సంవత్సరములకు మందోటీ నగరమును నిర్మించుకొని యందుండిన విశ్వబ్రాహ్మణులను నశింపజేయ బ్రయత్నించినట్టు వ్రాసియున్నందునను, నీ మూడు ప్రమాణములను బట్టి క్రీస్తుశకమునకు బూర్వము 640, సంవత్సరములకు సరియగు కలియుగారంభము లగాయితు, (2456) వ సంవత్సర ప్రారంభమున బరాశరమునికి

మత్స్యగంధికి వ్యాసుడు జన్మించి విరాడ్విశ్వకర్మ వంశస్థుడైన మరియొక విశ్వకర్మ దగ్గర విద్యల నభ్యసించి యుండెననియీ క్రిందశ్లోక ప్రమాణమూలముగ దెలియ జేయుచున్నాము.

వ్యాసుఁడు విశ్వకర్మయొద్ద జదువుకొనుట

మూల కాలజ్ఞానము

శ్లో॥ వ్యాసఃపరం ప్రీతమనాః ప్రసాద్య
విశ్వస్యకర్తారముపేత్యవిద్యాః ।
శుశ్రూషమాణఃశరదోదశద్వే ।
జహారలోకస్యహితాయసర్వాః ॥

తా॥ వ్యాసు డావిశ్వకర్మకు బదిరెండుసంవత్సరంబులు శుశ్రూషచేసి యతని దగ్గఱ సమస్త విద్యలు చదువుకొని యతని వేదశాస్త్రంబులగొన్ని తస్కరించుకొని యక్కాశీపురంబునకు ప్రవేశించి యటుపిమ్మట బ్రహ్మత్వమును బొందుటకు మనుమయవిశ్వజ్ఞులను, త్రిమూర్తులనుగూర్చి తపంబు జేయదొడఁగె. నదియెట్లనిన

వ్యాసుఁడు త్రిమూర్తులనుగూర్చి తపంబుజేయుట

తే॥ గీ॥ ఘనతపదిరెండువర్షముల్ । వనమునందు
వ్యాసుఁడతిఘోరతపముజే । యంగమనువు
మయుఁడువిశ్వజ్ఞుఁడనుబుషి । త్రయమునతని
కప్పుడుప్రత్యక్షులై మయుం । డనియెనిటుల ॥

క॥ వినుమావ్యాసుఁడనీవును
ఘనతరముగజేయుతపము । గాంచితిమికనీ
మనసునగోరిక దెల్పుము
ఇనుమిక్కిలిప్రియముచేత । నిచ్చెదవరమున్ ॥

ఓయి శిష్యా ! నీవుచేయు తపంబునకు మెచ్చితి గనుక నీకేమి వరము కావలయు నొసంగెద గోరుమనిన వ్యాసుఁడిట్లనియె.

వ్యాసుడు బ్రహ్మత్వమును గోరుట

తే॥ గీ॥ అవధరింపుమనివ్యాసు డపుడువారి
పాదములపైని వ్రాలిస । ద్భక్తిఁ దోఁడ
నాదువంశమునంతనీ । యవనియందు
బ్రహ్మకులమగువరమిమ్మ । ప్రమదమునను॥

తా॥ స్వామీ ; మీమువ్వురు నాయందు సంపూర్ణానుగ్రహముచే నావంశము బ్రహ్మవంశమగునట్లు వరమొసంగుడు.

మయుఁడు వ్యాసుని దిరస్కరించుట

విశ్వకర్మ శాస్త్రము

శ్లో॥ అహోవ్యాస ! మతిభ్రష్ట ।

తా॥ ఓరి వ్యాసా ; ఉపలబ్ధివిహీనా ; యెంతదుర్వాంఛితుండవై తివి

వ్యాసుఁడు భృత్యుడై మయబ్రహ్మనడుగుట

విశ్వకర్మ శాస్త్రము

శ్లో॥ కిందూష్యంచనకారణమ్ ॥

తా॥ స్వామీ ; నన్ను మీరు దూషింపదగిన కారణమేమియు లేదుగదా ?

వ॥ అనినవిని త్రిమూర్తులు సంతసించి యిట్లనిరి.

త్రిమూర్తులు వ్యాసునకు బ్రహ్మత్వమిచ్చుట.

విశ్వకర్మశాస్త్రము.

శ్లో॥ మనూనాంయజ్ఞసూత్రంచ । మయోదండకమండలం ।
విశ్వజ్ఞకర్ణముద్రంచ । పంచముద్రంచబ్రాహ్మణః ॥

తా॥ మనుబ్రహ్మ యజ్ఞోపవీత మొసంగె, మయబ్రహ్మ దండకమండలము లిచ్చె, విశ్వజ్ఞబ్రహ్మ చెవులో దివ్యజ్ఞాన మంత్రోపదేశంబు జేసియుండెనంత మయుండిట్లనియె,

మయబ్రహ్మ వ్యాసునకు వరమిచ్చుట.

విశ్వకర్మశాస్త్రము

శ్లో॥ వ్యాసస్త్వత్వమయాదత్తం । విప్రస్సర్వత్రపూజ్యతే ।
కలౌపంచసహస్రాణి । జాయతేవర్ణ సంకరః ॥

తా॥ మీరు విప్రులను నామాంతరముల వహించి కలియుగ మైదువేల సంపత్సరముల వరకు నావంశజులైన విశ్వబ్రాహ్మణులు దప్ప తక్కిన సమస్త కులములవారివలన భూజింపబడి యటుపిమ్మట నపూజితులగుదు రనిచెప్పి యా ముప్వురునుగూడి వారి యాశ్రమంబుల కరిగినంత వ్యాసుడు వైష్ణవమత మాచరించి యామతాచారంబున దన వంశజులకు బ్రహ్మత్వ మొసగినందున వారలు దశవిధ విప్రులై విలసిల్లిరి కనుక వారల నెరింగించెద వినుము.

దశవిధవిప్రుల వివరము.

పద్మపురాణోత్తర ఖండమునందు.

అధికమాహాత్మ్యము 4వ అధ్యాయము.

శ్లో॥ దేవోమునిర్ద్విజో రాజ । వైశ్యశూద్రో బిడాలకః ।
పశుమ్లేచ్ఛశ్చచండాలో । దశవిప్రః ప్రకీర్తితాః ॥

తా॥ దేవవిప్రులు, మునివిప్రులు, ద్విజవిప్రులు, రాజవిప్రులు, వైశ్య విప్రులు, శూద్రవిప్రులు, బిడాలకవిప్రులు, గోవిప్రులు, మ్లేచ్ఛవిప్రులు, చండాల విప్రులు, మొదలగు పదికులములేర్పడి వారు తపస్సుచే బ్రహ్మర్షులై యుండిరి. అట్టివారలకు బంచవేదములయం దొక్క పంక్తిగాని యొకయక్షరముగాని బాధ్యత కలిగి యుండకపోవుటచే వ్యాసకృతమగు మత్స్యపురాణమునందును, వారి గోత్ర, ప్రవరసంగ్రహము నందును, విశ్వబ్రాహ్మణ మహర్షులగు, అత్రి, వసిష్ఠ, కశ్యప, అంగిరస,భృగు, మరీచి,పులస్త్య, పౌలస్త్య,పులహ, బోదయన, విఘనస కాత్యాయన, సాంఖ్యాయనాది, పదుమువ్వురను వారి ఋషులయందు జేర్చుకొని ప్రమాణ వచనములకు వాడుకొనుచున్నారు కావున నీ దశవిధ విప్రులయం దుద్భవించిన బ్రాహ్మణులు ధరించియుండు వారివారి నామంబులను గొంత వివరించి జెప్పెద వినుము.

దశవిధవిప్రుల సంతతి వివరము.

బ్రాహ్మణోత్పత్తిమార్తాండము.

శ్లో॥ విప్రాదశవిధాః ప్రోక్తాః । తత్రగౌడాస్తుపంచధాః ।
ద్రావిడాశ్చతథాపంచే । త్యేవంలోకేప్రపఠీయతే ॥

శ్లో॥ సారస్వతాః కాన్యకుబ్జా । గౌడాశ్చోత్కళమైథులాః ।
పంచగౌడఇమేఖ్యాతా । వింధ్యస్యోత్తరవాసినః ॥

శ్లో॥ ద్రావిడాంధ్రాశ్చకర్ణాట । మహారాష్ట్రాశ్చఘూర్జరాః ।
పంచైతే ద్రావిడాఖ్యాత । వింధ్యదక్షిణవాసినః ॥

తా॥ ఇందుల భావమేమనిన నీ భరతఖండమునందు బ్రాహ్మణులందరు పది తెగలవారై యున్నారనియు, నీ పది తెగలవారిలో నైదు తెగలవారు పంచగౌడులను నామాంతరములచే వింధ్యపర్వతమున కుత్తరభాగమున నివసించియున్నారనియు దదితరులైన నైదుతెగలవారు పంచద్రావిడులను నామాంతరములచే వింధ్యపర్వతమునకు దక్షిణభాగమున నివసించియున్నారనియు, దెలియబడుచున్నది. ఈ పది తెగలవారిలో బంచగౌడులను వారెవరనిన 1) సారస్వతబ్రాహ్మణులు 2) కాన్యకుబ్జబ్రాహ్మణులు 3) గౌడబ్రాహ్మణులు 4 ఉత్కళబ్రాహ్మణులు 5) మైధిలబ్రాహ్మణులు నయియున్నారు ఇటులనే పంచద్రావిడులను వారు 1) ద్రావిడబ్రాహ్మణులు 2) ఆంధ్రబ్రాహ్మణులు 3) కర్ణాటకబ్రాహ్మణులు 4) మహారాష్ట్రబ్రాహ్మణులు 5) ఘూర్జరబ్రాహ్మణులు నయియున్నారు ఈ పదితెగలవారగు బ్రాహ్మణులు గుణకర్మభేదములవలన మొత్తముమీద రెండు తెగలువారుగ నగుచున్నారు అది యెట్లనిన.

శ్లో॥ బ్రాహ్మణాద్విధాప్రోక్తాః । పండితాః పామరాస్స్మృతాః ।
పామరాద్విధానామ । బ్రాహ్మణ్యభువధారకాః ।
పండితాద్విధాప్రోక్తాః । నియోగవైదికాస్స్మృతాః ॥

తా॥ అనగా నీ భరతఖండమునందు నీ దశవిధ బ్రాహ్మణులందరును వారి వారి వృత్తిభేదములచే నిరుతెగలవారై యున్నారు, అట్టి యిరుతెగలవారెవరనిన పండితులనియు, పామరులనియు వ్యవహరింపబడుచున్నారు, ఇందున నుదహరింపబడిన పామరులు మరి రెండు తెగలువారుగ నున్నట్టు స్పష్టమగుచున్నది. అట్టివారెవరనిన బ్రాహ్మణ బుధువులనియు. బ్రాహ్మణనామధారులనియు, దెలియబడు

చున్నవి మరియును బండడితులిరుతెగల వారైయున్నారు అట్టి యిరుతెగల పండితులెవరనిన నియోగులనియు, వైదికులనియు స్పష్టముగ దెలియబడుచున్నది. ఇట్లు పూర్వోక్తములైన దశవిధ బ్రాహ్మణులందరు వృత్తి భేదంబుల వల్లనైన నిరుతెగలవారు గాక మరియును, నవాంతర భేదములచే శాఖానాది భేదంబుల గల్పించుకొని బహువిధంబులుగ సంచరించుచున్నారు ఇట్లు సంచరించుచుండు నవాంతరశాఖలలో మొట్టమొదట నౌత్తరీయులగు పంచగౌడులలోనుండు నవాంతర శాఖలనుగూర్చి యీ క్రింద వివరముగ వ్రాయుచున్నాము. 1) నాగర బ్రాహ్మణులు, 2) వాయదా బ్రాహ్మణులు, 3) ఉన్నతవాశీ బ్రాహ్మణులు, 4) గడవాలీ బ్రాహ్మణులు 5) సురౌలా బ్రాహ్మణులు, 6) గిరినారాయణ బ్రాహ్మణులు 7) కండౌలా బ్రాహ్మణులు, 8) గంగారహి బ్రాహ్మణులు, 9) కూర్మాచలీయ బ్రాహ్మణులు, 10) శ్రీమౌలి బ్రాహ్మణులు, 11 వాల్మీక బ్రాహ్మణులు, 12) శుక్ల యజుర్వేదీయ బ్రాహ్మణులు, 13) మోవాడ బ్రాహ్మణులు, 14) హ్మలోరా బ్రాహ్మణులు, 15 గుగ్గులీయ బ్రాహ్మణులు, 16) బంగాలీ బ్రాహ్మణులు, 17) వారేంద్ర బ్రాహ్మణులు, 18) కాశ్మీర బ్రాహ్మణులు, 19) దధీచి బ్రాహ్మణులు, 20) దాయమాస బ్రాహ్మణులు, 21) దినంపాల బ్రాహ్మణులు, 22) బేదాపాల బ్రాహ్మణులు, 23) రాయకపాల బ్రాహ్మణులు, 24) రోడపాల బ్రాహ్మణులు 25) భార్గవ బ్రాహ్మణులు, 26) వేదపాఠ (లేక) వేదపాఠీ బ్రాహ్మణులు, 27) ద్విపాఠీ బ్రాహ్మణులు, 28) త్రిపాఠీ బ్రాహ్మణులు, 29) చతుర్వేదపాఠీ (లేక చతుఃపాఠీ బ్రాహ్మణులు, 30) మోతాపాల బ్రాహ్మణులు, 31) గయావాల బ్రాహ్మణులు, 32) నర్మదీయ బ్రాహ్మణులు, 33) సోమకూరి బ్రాహ్మణులు, 34) మాధ్యంజనఖస్తియ బ్రాహ్మణులు 35) భక్తిసు బ్రాహ్మణులు, 36) కత్థాద బ్రాహ్మణులు, 37) తవాజీ బ్రాహ్మణులు, 38) దేవరుఖ బ్రాహ్మణులు, 39) ఆబీబిల్లి బ్రాహ్మణులు, 40) భద్రక బ్రాహ్మణులు మొదలగు వారును మరికొన్ని తెగలవారును గలసి యౌత్తరీయులగు పంచగౌడులై యున్నారని బ్రాహ్మణోత్పత్తి మార్తాండాది గ్రంథంబుల ననుసరించి తెలియబడుచున్నది. ఇట్లుండ వింధ్యపర్వతంబునకు దక్షిణదిశను మొట్టమొదట నివసించి యుండు పంచద్రావిడలలో జేరిన ద్రావిడ బ్రాహ్మణులను గూర్చి యీ క్రింద వివరముగ వ్రాయుచున్నాము.

## ద్రావిడబ్రాహ్మణులు.

శ్లో॥ ద్రావిడేష్వథవిప్రేషు । భేదాద్ద్వాదశసమ్మతాః॥
ఆరామకోనసీమానా । తుమ్మగుంటపుదూరకా॥

శ్లో॥ వడమాష్టసహస్రాచ । బృహచ్చరణవాద్ధిమా।
శ్రీవైష్ణవాశ్చతేపంచ । భేదతః ప్రచరంతిహి॥ ౨

శ్లో॥ వడఘల్తెంగలితిచ । గండికోటవిఖానసా।
పాంచరాత్రాశ్చసంస్కారే । పరస్పరసమానతః॥ 3

తా॥ ఇందుల కర్దమేమనిన ద్రావిడబ్రాహ్మణులలోను బదిరెండు విధములగు భేదములు గలవారున్నట్టు గన్పట్టుచున్నారు. అట్టి పదిరెండు తెగల వారెవరని యెదరేని 1) ఆరామద్రావిడబ్రాహ్మణులు, 2) కోనసీమద్రావిడబ్రాహ్మణులు. 3) తుమ్మగుంటద్రావిడాబ్రాహ్మణులు, 4) పుదూరుద్రావిడబ్రాహ్మణులు, 5) వడమద్రావిడబ్రాహ్మణులు, 6) అష్టసహస్రద్రావిడబ్రాహ్మణులు, 7) బృహచ్చరణద్రావిడబ్రాహ్మణులు, 8) వడఘల్ వైష్ణవబ్రాహ్మణులు, 9) తెంగలవైష్ణవబ్రాహ్మణులు, 10) గండికోటవైష్ణవబ్రాహ్మణులు, 11) వైఖానసవైష్ణవబ్రాహ్మణులు, 12) పాంచరాత్రవైష్ణవబ్రాహ్మణులు, నుం యున్నారు. మరియు పై వచనములలో జెప్పిన వారికన్న నధికముగ మరికొందరున్నట్టు తెలియుచున్నది అట్టి వారెవరని యెదరేని 13) నంబూరిబ్రాహ్మణులు, 14) గురుక్కళ (లేక) హరద్విజబ్రాహ్మణులు, 15) బహుగోత్రబ్రాహ్మనులు, 16) అష్టగోత్రబ్రాహ్మణులుగా నేర్పడియుండిరి. కనుక నాంధ్రబ్రాహ్మణులను గూర్చి వివరించుచున్నాము.

## ఆంధ్రబ్రాహ్మణులు.

శ్లో॥ ఆంధ్రేష్వపితుభేదాద్వా । ప్రాచీనాస్తుపరస్పరం ।
వైదికశ్చనియోగీచ । వైదికాస్తేపిషడ్విధాః॥ ౧

శ్లో॥ తెలగాణీ వెలనాడు । వేగినాడ్ముల్కినాడపి ।
కాశులాన్డుతథాకర్ణ । కమ్మనాడితిషడ్విధాః॥ ౨

శ్లో॥ నియోగిశ్చషోడాహి । భేదతస్త్రాన్నబివీమధ్య ।
షట్సహస్రానందవరాః । ప్రాజ్ఞాడ్పెసరవాయినః ॥ ౩

శ్లో॥ మాధ్యందినాగోలకొండాః । షడ్సహసద్విధామతాః ।
షడ్సహస్రాశ్చదేశస్థా । సర్వేఽమీమేలయంత్యపి ॥ ౪

శ్లో॥ ఆరాధ్యఅపరభాజశ్చ । సంకీర్ణత్వంగతాఇహ ॥

తా॥ ఇందుల భావమేమనిన నాంధ్రబ్రాహ్మణులలోను నిరుతెగలవారున్నట్టు గన్పట్టుచున్నారు ఆ యిరుతెగల వారెవరనినచో వైదికబ్రాహ్మణులనియు, లౌకికులనబడు నియోగిబ్రాహ్మణులనియు, రెండు విధంబులుగా నీక్రింద వచనమునుబట్టి మనము దెలుసుకొనదగియున్నది.

శ్లో॥ బ్రాహణాద్వివిధాప్రోక్తాః । వైదికాలౌకికాఇతి ।
పండితాద్వివిధాప్రోక్తాః ! నియోగావైదికాఇతి ॥

తా॥ ఈ రెండు తెగలవారిలో నొకతెగవారగు వైదికులయందు నారుతెగల వారుండినట్లు గనుపడుచున్నారు, అట్టివారెవరనిన 7) తెలగాణ్యబ్రాహ్మణులు, 18) వెలనాటబ్రాహ్మణులు, 19) వేగినాటబ్రాహ్మణులు, 20) ముల్కినాడుబ్రాహ్మణులు, (అథవా) మురికినాటబ్రాహ్మణులు, 21) కాశులాన్టబ్రాహ్మణులు 22 కర్ణకమ్మబ్రాహ్మణులుగా తెలియబడుచున్నారు. ఇంతియేకాదు లౌకికులనబడుని యోగులలోను నారుతెగలవారుగ నున్నారని తెలియబడుచున్నది. అట్టి వారెవరని యెదరేని 23) ఆరువేలనియోగి బ్రాహ్మణులు, 24) ప్రాజ్ఞాడునియోగి బ్రాహ్మణులు 25) నందవరనియోగి బ్రాహ్మణులు, 26) పెసరవాయినియోగి బ్రాహ్మణులు, 27) మాద్యందినయోగి బ్రాహ్మణులు, 28) గోలకొండ నియోగి బ్రాహ్మణులుగా

దెలియబడుచున్నారు మరియు నిందులో నారువేల నియోగి బ్రాహ్మణులు రెండు తెగలవారై యున్నారు. అట్టివారెవరనిన 26 వేల నియోగి బ్రాహ్మణులనియు, 30 దేశస్థ వ్యాపారబ్రాహ్మణులనియు దెలియబడుచున్నారు మరియు 31 ఆరాధ్య బ్రాహ్మణు లనువారొకరు కొంతసంకీర్ణత్వమును జెందినవారుగ గూడానున్నారు. ఇప్పుడు పైన ప్రమాణవచనములలో గన్పడని బ్రాహ్మణులు లీయాంధ్రదేశమున మరికొందరుకూడ నున్నారు వారెవరనియెదరేని 32 కాణ్వబ్రాహ్మణులు, 33) శివార్చక బ్రాహ్మణులు మొదలగువారై యున్నారు కనుక కర్ణాటక బ్రాహ్మణులనుగూర్చి కొంతవిచారించుచున్నాము.

## కర్ణాటబ్రాహ్మణులు.

శ్లో॥ కర్ణాటాఅపి శ్చేషట్చ । భేదాన్ సంధారయంతిహి॥
బడగల్శుద్ధకర్ణాటా । స్తథాభాగవతా అపి।
పూర్వకర్ణాటకా దేశ । స్థామాధ్వాఇతి తేచషట్ ॥

తా॥ ఇందుల భావమేమనిన గర్ణాటక బ్రాహ్మణులలో 6 తెగలవారున్నారని తెలియబడుచున్నది అట్టి వారెవరని యెదరేని 34) బడగల్నాటబ్రాహ్మణులు, 35) శుద్ధకర్ణాటకబ్రాహ్మణులు, 36) భాగవతసంప్రదాయబ్రాహ్మణులు, 37) పూర్వకర్ణాటకబ్రాహ్మణులు, 38 దేశస్థబ్రాహ్మణులు, 39. మాధ్వబ్రాహ్మణులు, నని తెలియబడుచున్నది కనుక మహారాష్ట్రబ్రాహ్మణులను గూర్చి కొంత విచారించుచున్నాము

## మహారాష్ట్రబ్రాహ్మణులు.

శ్లో॥ మహారాష్ట్రాఃపంచభేదాః । దేశస్థాశ్చితిపావనాః ।
కరహాటాభాగవతా । జీగరాద్యాశ్చపంచధాః॥

తా॥ ఇందుల భావమేమనిన మహారాష్ట్ర బ్రాహ్మణులలో నైదు తెగలవారున్నారని దెలియుచున్నది. అట్టి వారెవరని యెదరేని 40) దేశస్థ, 41) చిత్పావన 42) కరహాట 43) భాగవత, 44) జీగరాబ్రాహ్మణులు నిట్టివారుగాక మరికొందఱున్నట్లు దెలియబడుచుండె నదియెద్దియనిన 45) కొంకణ, 46) కళంకిబ్రాహ్మణులు మొదలగు వారైయున్నారు. కనుక ఘూర్జరవిప్రులను గూర్చి విచారించుచున్నాము.

ఘూర్జరబ్రాహ్మణులు.

శ్లో॥ ఘూర్జరాఅపి తేపంచ । భేదానిసందధ్రుధునం ।
తేషాంవిలక్షణాచార । స్సమ్మేళయతుచైకతః॥

తా॥ ఇందువల్ల మనకు తెలియబడిన దేమనిన బూర్వోక్తములైన పంచగౌడ పంచద్రావిడ విప్రులయొక్క నామములనుబట్టి విచారించ, గాశ్మీర, వేదపాఠీ, ద్విపాఠీ, త్రిపాఠీవిప్రు, లను నీ నామములన్నియు పౌరుషేయములుగా సంపాదింపబడినవి. కొన్ని నామంబులుగాను మరికొన్ని దేశీయ నామంబులుగాను నున్నవని స్పష్టముగ దెలియబడుచున్నవి. ఇంతియేకాక కాశ్మీర, వేదపాఠీ, వెలనాట, వేగినాట ఆరాధ్య, యను నీ బ్రాహ్మణులవలన నీపై వివరించిన విప్రులెల్లరు బుట్టియుండ లేదని స్పష్టముగ దెలియబడుచున్నది. ఇట్టి పూర్వోక్తములైన నామములన్నియు బూర్వమొక తెగవారిగనుండి కాలాంతరముల గార్యాంతరములచే దేశీయ పౌరుషేయములుగా సంపాదింపబడిన నామములైయున్నవని యీ క్రింది ప్రమాణముచే దెలియబడుచున్నది.

శ్లో॥ దేశీయనామాన్యేతాని । వైదికానామశాస్త్రతః ।
నాడీభేదస్తుకైశ్చిత్ప్రి । తారకైఃకల్పితోధ్రువం ॥

తా॥ అనగా బూర్వోక్తములైన నామములన్నియు దేశీయములైనవిగాను, నాడీభేదములవల్లనయినవిగాను, నున్నవని కొందఱు చెప్పుచున్నారు. ఇంతియేగాని మరొండు విధమున నుండినట్టు గన్పడజాలదు. కనుక నీ నామములన్నియు లోక ప్రసిద్ధికై కల్పించుకొనియుండిరి మఱియు వీరియందధికులుగా జెప్పుకొను నియోగి, వైదిక, బ్రాహ్మణులగూర్చి కొన్ని గ్రంధములయందలి విషయములను వివరించుచున్నాము.

శ్లో॥ పురాక్షత్రియవర్గేతు । వినాశంభార్గవాద్గతిః।
తత్కన్యకాసుసంభూతః । విప్రేభ్యశ్చనియోగినః॥

తా॥ పూర్వము క్షత్రియులందరు పరశురామునివలన సంహరింపబడగా నా వంశమున బురుషులు లేనందున నా కన్యకలు వ్యభిచారవృత్తితో బ్రవర్తింపుచుండ విప్రులు వారితో సంభోగముచేయ నా యుభయులకు జన్మించినవారు నియోగులు (అనగా దల్లి వలన నియోగింపబడిన శీలవ్యాపారములతో వర్తించినవారు) అని చెప్పబడుచున్నది. ఇంక వైదికులగూర్చి చెప్పెద నాకర్ణింపుము.

శ్లో॥ భట్టినీషుయథాజాతా । విదికాసుతవైదికాః ।
అతఏవహి తేషాంచ భట్టుశబ్దప్రదాసదా ॥

తా॥ ఇందుల భావమేమనిన పరశురామునిచే హతులైన క్షత్రియులభార్యలు జారప్రవర్తనముచే ప్రవర్తింపుచుండ నందు విదుకయను పేరుగల యొకానొక స్త్రీ యందు బ్రాహ్మణుని వలన జన్మించినవారికి (విదికాయాఃఅపత్యంపుమాన్ వైదికః) యను సూత్రప్రకారము వైదికులని కొందరు పెద్దలు నిర్ణయించియుండిరి. వీరు తమ వంశమునకు (భట్టిని) మూలమైయుండుటచేత భట్టుశబ్దము (అనగా వెంకం భట్టు, సూరంభట్టు, తిప్పభట్టు, ఇత్యాదులు) వంశపారంపర్యముగ వాడుకొనుచు వచ్చిరి. వీరు గ్రామపాలకులై యాచకవృత్తిచే జీవించుచుండిరి అందువలన బ్రహ్మవంశస్థులు రెండు తెగలవారుగనుండినట్లు వ్యాసుడు స్వకల్పితబ్రహ్మాండ పురాణమున నిట్లు వ్రాసియుంచెను

## బ్రహ్మవంశభేదము.

### బ్రహ్మాండపురాణము.

శ్లో॥ బ్రాహ్మణానాంకులంపూర్వం । ద్వేధావిరచితంసురైః।
ఆర్షేయుంపౌరుషేయంచ । జన్మకర్మవిశేషితః ।

తా॥ పూర్వము దేవతలార్షేయబ్రాహ్మణులనియు, పౌరుషేయబ్రాహ్మణులనియు, రెండు విధంబులుగ నేర్పరచియుండుటకు గారణమేమన

### స్కాందపురాణము.

శ్లో॥ మనుర్మయ స్తథాత్వష్టా । శిల్పీవిశ్వజ్ఞ ఏవచ ।
పఞ్చైతే దేవఋషయో । విశ్వకర్మముఖోద్భవాః
ఆర్షేయుంతువశిష్ఠాది । ప్యాముష్మిక మునిసత్తమః ।
జన్మనాజాయతే శూద్రః । కర్మణాజాయతే ద్విజః ।
వేదపాఠేనవిప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః॥

తా॥ విరాడ్విశ్వకర్మ ముఖమునందుద్భవించిన పంచబ్రహ్మర్షుల యొక్క పరంపరలగు విశ్వబ్రాహ్మణులను వారే పౌరుషేయ బ్రాహ్మణులై యున్నారు, మధ్యర్షియగు వసిష్ఠ పరంపర లగు నార్షేయులకు జన్మకాలమున శూద్రత్వమును

నుపనాయనాది సంస్కారములచేత ద్విజత్వమును గలిగియుండుటవలన నశ్రేష్ఠ బ్రాహ్మణులై యున్నారు. అందుచే బ్రాహ్మణ కులములను రెండు విధములుగ నిర్ణయింపబడియుండె గనుక నందు వ్యాసుఁడు భారతాద్యష్టాదశపురాణ కట్టుకథలు రచించి యచ్చటచ్చట ప్రజలకవిబోధింప నెవ్వరంగీకరింపకుండిరి.

రాజు గురువునడుగుట.

క॥ మృగములకు మనుజబృందం
బగణితముగ బుట్టుననుట । న్యాయంబౌనా
మృగములనాము మెనగులకు
జగమున గలిగుండెననుట । జనసమ్మతమే॥

తా॥ ఆ కాలమునందుండు మనుష్యుల కవినామంబులు గలిగియుండవచ్చును గాని నానాజాతి మృగములయందు మనుష్యులు జన్మించిరని మీరుపల్కు వాక్యంబు లను మాత్రము నమ్మటకు వీలుకాదనిన వానికి గురుండిట్లనియె

మూల స్తంభము.

శ్లో॥ చతుర్థకద్రువేపత్నీ । మహాస్త్రీగర్భసంభవః ।
శేషోనవకులానాథ । ఉగ్రరూపబహూర్జనైః॥ ౧

శ్లో॥ ఏకాదశశ్చయోపత్నీ । ధాతప్రభాతనామని ।
తత్సతిగర్భసంభూతం । కూర్మోజలచరైస్సమః॥ ౨

శ్లో॥ ద్వాదశాస్యతీనామేచ । కుసుమావతినామని ।
తేపత్నీగర్భసంభూతౌ । స్వరతసుధేనుయోః॥ ౩

శ్లో॥ త్రిదశోసతినామేచ । పార్వతిన్నిమహాత్మనీ ।
తేదేవిగర్భసంభూతో । శేషోపర్వతేకులైః॥ ౪

తా॥ కశ్యపబ్రహ్మ నాల్గవభార్య కద్రువ గర్భమందు శేషుఁడు మొదలైన తొమ్మిదికులముల సర్పములును బుట్టియుండెననియును, బదునొకండవభార్యయగు ప్రభాగర్భంబున జలమునందు సంచరించు కూర్మములు మొదలైన సమస్తజంతువు లును బుట్టియుండెననియును, బదిరెండవభార్యయగు కుసుమావతి గర్భంబున గల్ప

వృక్షంబులును కామధేనువులును గలిగియుండెననియును, బదుమూడవ భార్యయగు పార్వతి గర్భమందు సప్తపర్వతములు బుట్టియుండెననియును జెప్పియుండెను.

రాజు వేదధర్మంబునడుగుట.

వ్యా॥ విశ్వంకర్మయుతీతివిశ్వకర్మా ॥

తా॥ విశ్వకర్మ యనంతకోటి బ్రహ్మాండంబుల సృజియించియుండెనని చెప్ప బడుచుండె గనుక నా భగవంతుఁడు గొందరియందు దయారసమును, మరికొందరి యందు బక్షపాతమును, గలిగి పుట్టింపుచుండెనా ; యేమి యీ చిత్రము ; నీ మాటలు పామరులు నమ్ముదురేకాని పండితులైనవారు నమ్మరుగదా ;

కలిధర్మంబు జెప్పుట.

శ్లో॥ కుండగోళకసంతానం మద్యమాంసాదిభక్షితం ॥

తా॥ అనుసీ ప్రమాణవచనంబువలన గుండక గోళకాది హీన జాతులవారై యుద్భవించియుండిరి కాని పరమాత్ముని పక్షపాతంబువలన బుట్టినట్టు గనుపించదు. కనుక నందువ్యాసుఁడు దనయష్టాదశపురాణ గ్రంధముల సహితముగ బరిమళచోళ మహాప్రభు స్థానంబునకేతెంచి యతనికి నమస్కరించి యిట్లనియె

వ్యాసుఁడుపరిమళచోళునాశ్రయించుట.

చ॥ ఎలమినినేనుమున్నుబదు । నెన్మిదియైనపురాణముల్ వెసన్ ।
లలితముగారచించియుని । లన్ బ్రకటింపదలంచియీసభా ।
స్థలికిటువచ్చినాడనృప । సత్తమనన్గరుణించిగ్రంధముల్ ।
విలసితకీర్తినొప్పగను । వేగమెతద్విధిజేయఁగోరెదన్

తా। నేనష్టాదశ పురాణంబులను రచించుకొని మీ సముఖంబున కేతెంచితి గనుక నాయందు దయయుంచి వెంటనే గ్రంధములను బ్రచురింబజేయ మనిన వ్యాసునికి రాజిట్లనియె.

క॥ నీవురచించినగ్రంధము
లేవియొవడిచదువుమిపుడు । నింపుదలిర్పన్ ॥
నేవినితత్సారాంశము ।
భావించియుబ్రకటనంబు । బదపడిచేతున్ ॥

తా॥ నీవుచేసిన పదునెనిమిది పురాణగ్రంథంబులలో మొక్కొక్క పురాణము నందు వ్రాసిన విషయంబును జదివి బోధించిన వెంటనే యందుండు ఫలితార్థమును గ్రహించి యటుపిమ్మట ప్రకటనచేయుట కాజ్ఞయొసంగెదనన వ్యాసుఁడు దన పురాణగ్రంథంబుల తనికి బోధింపవిని వానియందలి వ్యత్యాసముల విమర్శింప దొడఁగె నదియెట్లనిన.

## పురాణవ్యత్యాస విమర్శనము.

### శివపురాణము.

శ్లో॥ ఆదిశక్తిమయంబీజం। బీజంశక్తిమయంశివః।
శివశక్తిమయంవిష్ణు స్సర్వంవిష్ణుమయంజగత్ ॥

తా॥ ఆదిశక్తియందుండి యొక బీజముద్భవించి దానియొక్క మహిమచేత శివుడుత్పత్తియయ్యెననియు, నా శివుని మహిమవలన విష్ణువు జనించెననియు, నట్టి విష్ణుమయమే సర్వజగత్తనియు, జెప్పబడుచుండె మరియు,

### వరాహపురాణము

శ్లో॥ సర్వవ్యాపీశభగవాన్ । తస్మాత్సర్వగతశ్శివః ॥

తా॥ ఆ భగవంతుం డనదగినశివుండు సర్వ ప్రపంచమునందు నిండియుం డెను. మరియు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ముప్వురిలో నొకశక్తికలిగి మూడు చీలికలై లక్ష్మి, కాళి, సరస్వతి యనువారలు గలిగియుండిరి మరియు

శ్లో॥ మహాయోనిమహాద్బ్రహ్మా ॥

తా॥ అందుండి శ్రీమహావిష్ణుమూర్తి రూపింపజేసి విడియుండె, గనుక దత్తాత్రేయ చరిత్రంబునఁగూడా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, బ్రాహ్మణవేషులై వచ్చి యనసూయ యనుదానిని వ్రతభంగము జేయుటకాపెను దిగంబరిగ వచ్చి యతిథి పూజలుసల్పుమని కోరినందున నాస్త్రీ వారిని శిశువులుగాజేసి యొకమూల ద్రోసి వేయగా ననేకదినంబులచ్చట బడియుండిరని చెప్పబడియుండెను.

### మత్స్యపురాణము.

3వ అధ్యాయము 16వ శ్లోకము.

శ్లో॥ గుణేభఃక్షుభ్యమాణేభ్య। స్త్రయోదేవా జజ్ఞిరే।
ఏకమూర్తిస్త్రయోభాగా। ద్బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ॥

తా॥ బ్రహ్మయొక్క సత్వరజస్తమోగుణములచేత మూడుభాగములుగ, దానే విభజింపబడి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులై యున్నారని వ్రాయబడి యుండెనింక.

లింగపురాణము

20వ అధ్యాయము 2వశ్లోకము

శ్లో॥ ఆసీదేకార్ణవంఘోరం । మవిభాగంతమోమయం ॥ ౨

శ్లో॥ మధ్యేచైకార్ణవేతస్మిన్ । శంఖచక్రగదాధరః ।
నీలజీమూతసంకాశః । కిరీటీశ్రీపతిర్హరిః ॥ 3

శ్లో॥ ఏసంతతశ్శయానేన । విష్ణునాప్రభవిష్ణునా ।
ఆత్మారామేణక్రీడార్థం । లీలయాక్లిష్టకర్మణా ॥ ౬

శ్లో॥ శతయోజనవిస్తీర్ణం । తరుణాదిత్యసన్నిభం ।
వజ్రదండమహోత్సేధం । నాభ్యాంసృష్టంతుపుష్కరం ॥

శ్లో॥ తస్యైవంక్రీడమానస్య । సమీపందేవమీఢుషః ।
హేమగర్భాండజోబ్రహ్మ । రుక్మవర్ణోయతీంద్రియః ॥ ౬

శ్లో॥ చతుర్వక్త్రోవిశాలాక్షః । సమాగమ్యయదృచ్ఛయా ।
శ్రియాయుక్తేనదివ్యేన । సుశుభేనసుగంధినా । ౧౦

తా॥ తమోమయమైన ఘోరార్ణవమునందు శంఖచక్రగదాధరుడును, నీలమేఘ సమానుడను, నైనవిష్ణువు శేషశాయియైయుండ నాతని నాభియందు గమలము జన్మించి దానియందు బ్రహ్మ జన్మించెనని తెలియుచున్నది

పద్మపురాణము

శ్లో॥ అన్యదేవంవరత్వేన । న్యపదంతజ్ఞానమోహితాః ।
నారాయణోజగన్నాథ । ద్దేవపాషండినస్మృతాః ॥

తా॥ జగన్నాథునకు మించిన యితరదైవము గలదని చెప్పువారు బుద్ధిహీనులను, పతితపాషండులును, పాపిష్ఠులును నగుదురు. అందుచే నెల్లరు నతనినే ప్రార్థింపవలయును,

శ్లో॥ వేశ్యాసందర్శనంపుణ్యం । స్పర్శనంపాపనాశనం ।
చుంబనంసర్వతీర్థానాం । మైధునంమోక్షసాధనం॥

తా॥ వేశ్యలను దర్శించుటవలన బుణ్యము లభించుననియు, వారి నంటుట వలన బాపవిమోచనమగుననియు, నధరపానము జేయుటవలన సర్వతీర్థసమాన ఫలంబనియు, మైధునము జేయుటవలన మోక్షప్రాప్తిగుననియు, జెప్పియుండుటను బట్టి యధికాశ్చర్యంబుతో నతనికిట్లనియె.

రాజు వ్యాసునకు బ్రత్యుత్తరమిచ్చుట

వ॥ శ్రుతి ప్రమాణవచనమునుబట్టి విచారించగ విరాట్పురుషుని ముఖము మొదలుకొని యతని యవయవంగములయం దుద్భవించిన వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచము లనునీయైదు వర్ణములుమాత్రిము బ్రాహ్మణులుగా గన్పట్టుచున్నారు. మఱియు వజ్రిసూచికోపనిషత్తు ననుసరించిచూడ నీవు నీఋషులందరు నానాజాతి యోనిముఖముల యందుద్భవించినవారగుటచే సాంకర్యులుగ స్పష్టముగ గన్పట్టుచున్నారు కాబట్టి యట్టిస్థితిలోనుండి నీవు విశ్వకర్మ తావున సమస్త విద్యలు చదువుకొని యతని వేదశాస్త్రముల గొన్ని దొంగతనముగ నాక్రమించుకొని నీవు బ్రాహ్మణత్వమును లేక బహు దినములు తపస్సుచేసి త్రిమూర్తులవలన బ్రహ్మజ్ఞానమును బొంది బ్రాహ్మణుండవై యుంటివిగాని పుట్టుకవల్ల బ్రాహ్మణుండైనవాడవు కాదు. ఇదియునుంగాక నీవు గురుద్రోహివై రచించిన పదునెనిమిది పురాణకట్టుకథలయందు బంచముఖ పరబ్రహ్మను జతుర్ముఖ బహ్మ యనియు, బంచమూర్తులకు ద్రిమూర్తులనియు,బంచవేదంబులకు తు ర్వేదంబులనియు, బంచయుగంబులకు నాల్గుయుగంబులనియు, బంచ శక్తులకు మూడుశక్తులనియు, బంచవర్ణములకునష్టాదశవర్ణంబులనియు నొకరి కొకరు భోజనములేక విరోధము బుట్టించునటులను, నమృతము విషముగను, విషము నమృతముగను, సుజ్ఞానము నజ్ఞానముగను, నజ్ఞానము సుజ్ఞానముగను, జేయదగిన తాంత్రిక మహేంద్ర జాలముగల

డవై యుంటివి మరియు నీతల్లియగు మత్స్యగంధిని శంతన మహారాజు రెండవభార్యగా గైకొని దానియందు చిత్రాంగద, విచిత్రవీర్యు లను పుత్రులిరువురను బడసియుండెను. వారలిరువురును సంతతి గల్గకుండిన నిమ్మట వారిభార్యలగు నంబికయు, నంబాలికయు, ననునీయిద్దరు విధవ స్త్రీలతో నీవుభోగించి ధృతరాష్ట్రుడు, పాండురాజు, యనువారిని బడసియున్నట్లు నీవురచించిన శ్రీమహాభారత గ్రంథమే ప్రమాణమై చెప్పుచుండె గనుక నీ గ్రంథములు లోకంబున ప్రచుర పఱచుటకు యోగ్యములైనవి కావుపొమ్మనె.

వ్యాసుడు తనపీఠము పూజింపుమనుట

క॥ నరవర మీగురుపీఠము
బరివర్తన మిప్పుడు చేసి । ప్రియదంబునమ
ద్గురువరపీఠము నిల్పుము
తిరముగ నాగామి వార్త । దెల్పెద నీకున్ ॥

తా॥ రాజా! మీ కులగురువు పీఠంబును దీసి మా గురుపీఠంబును నిల్పి పూజించినయెడల మీ గురువుకంటె నధికముగ భూతభవిష్యద్వర్తమానంబు లెరింగించెదము.

రాజు వ్యాసుని నిరసించుట

క॥ నిరతము విశ్వ బ్రాహ్మణ
గురుమూర్తియగు గలండు సర్వ । గతులు చెప్పన్
ధరజండాలుని పీఠము
పురమున నిలుపంగ మాకు । బోదు నిజమున్ ॥

తా॥ పూర్వమునుంచి మాకు విశ్వకర్మగురుపీఠస్థులే సమస్త విషయము లెల్లప్పుడు చెప్పుచుందురు కనుక మీహీనజాతి గురుపీఠము నగరంబున నుంచితిమేని మాకవమానంబు సంభవించు నింతియేగాక మఱియు నెఱింగించెద నవధరింపుము.

వ॥ ఇట్లు పరిమళచోళమహారాజు పల్కిన వాక్యంబులు విని యుచ్చట నిలువంజాలక తిరిగి వ్యాసుడు మందోటి నగరమందుండు

నయనస్కాంతమార్గమున నివసించిన విశ్వబ్రాహ్మణవంశ నాశనము చేయుటకు భద్రగిరిపట్టణమేలు భర్తృహరిరాజ సహాయమున దశరథగజతురగ పదాతులతో బయలు దేరి యా కోటను ముట్టడించిన వారు పగలు సూర్యకాంతము, రాత్రి చంద్రకాంతము జూపించుచు వచ్చినశత్రుబలము నధోగతి చేసినందున వారలు దమతమపురంబులకుంజనినపిమ్మట నతని సహోదరుండగు పణ్యబలిచోళమహారాజునకు బట్టాభిషేకంబు జేసి తీర్థయాత్రలు సేవించి యతండు స్వర్గలోకంబునకుంజనియెనంత.

## మూలస్తంభము.

శ్లో॥ సత్యంనాస్తి శుచిర్నాస్తి । నాస్తిఇంద్రియనిగ్రహం ।
వేదవాక్యస్థితంనాస్తి । ఏతేచండాలలక్షణం ॥ ౧

తా॥ సత్యము, శౌచము, ఇంద్రియనిగ్రహత్వము, వేదవాక్యముల యందు విశ్వాసము మొదలగునవి లేకుండుటయే చండాలుని యొక్క లక్షణము.

శ్లో॥ అసత్యంపక్షపాతంచ । నిర్మలాత్మంచపంచకా ।
జ్ఞానద్రోహీ శ్రుతిద్రోహీ । ఏతేబ్రహ్మంచపాతకః ! ౨

తా॥ అసత్యంబువలన పక్షపాతంబునదమనేకాని యాత్మ నిర్మలముగానేరదు, అట్టివాడు జ్ఞానద్రోహియనియు, శ్రుతిద్రోహియనియు, పరమచండాలుడనియు, బ్రహ్మపాతకుండనియును జెప్పబడుచుండెనింక.

శ్లో॥ తజ్జిహ్వాసత్యమేవాక్యం । అసత్యాంతేజజిహ్వయోః ।
తత్పురుషాత్మఘాతజ్ఞా । తదంమోక్షమిదంశృణు ॥ ౩

తా॥ సత్యంబువలన మోక్షంబు సిద్ధించుననియును, నసత్యంబువలన నాత్మఘాతకము లభించుననియును, జెప్పబడియుండె గనుక చాణక్యనీతియందు శ్లోకమును క్రింద వివరముగ వ్రాయుచున్నాము.

## చాణక్యనీతిశ్లోకము.

శ్లో॥ పరకార్యవిహంతాచ । దాంభికస్స్వార్థసాధకః ।
ఛలద్వేషీమృదుఃక్రూరో । విప్రోమార్జాలఉచ్యతే ॥ ౪

తా॥ అనగా విప్రులు పరకార్యములను నశింపజేయుదురనియును, డాంబికులనియును, స్వార్థసాధకులనియును, ఘడియ ఘడియకు ద్వేషించువారనియును, బాహ్యమునకు మాత్రము మృదుత్వముగ మాట్లాడువారనియు, నంతరంగమునందు గ్రాంత్వము గలవారనియును, మార్జాలముతో దుల్యులుగనుండు వారనియును, జెప్పబడుచుండె గనుక నిట్టి శుష్కప్రియములు బలుకునట్టి మీ విప్రులు మాటలను లక్ష్యపెట్టక యుండునట్టి బుద్ధిని భగవంతుడగు పరమేశ్వరుడు మా కొసంగునని ప్రార్థించుచున్నాను.

ఫలస్తుతి.

శ్లో॥ అనాదిమ ప్రమాణంచ । ఆయాపంతః జయాజయం ।
త్రైలోక్యానాంజగన్నాథా । విశ్వకర్మనమోస్తుతే॥

గద్య

ఇది శ్రీ వీరాఖ్యానార్య కరుణాకటాక్షలబ్ధ కవితాలక్షణుడా విశ్వకర్మ పాంచానన భువనసగోత్ర పవిత్ర చెరుకూరి వంశాబ్ధి సోమ చలమయ్య పుత్రరత్న వినుత నే శివరామయోగి ప్రణీతంబయిన శ్రీ వీరబ్రహ్మాండ సద్శాస్త్ర సమాధానవ్యాత్యాయ నిత్య రత్నాకరమనె కృతియందలి పరిమళచోళ చరిత్రము తృతీయాశ్వాసము సంపూర్ణము

ఓం తత్సత్

బ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోనమః

# పరిమళచోళచరిత్రము

## చతుర్థాశ్వాసము ప్రారంభము

ఇష్టదేవతా ప్రార్థన

తే॥ గీ॥ శ్రీమను బ్రహ్మరూపాయ । చిన్మయాయ
పంచవదనాయ త్రిభువన । పాలకాయ
శంకరాయ భుజంగరా । ట్కంకణాయ
అఖిలసురవందితాయ తు । భ్యం నమోస్తు॥

క॥ భుజగేంద్రపురవరంబును
నిజబాహుబలంబు మెఱయ । నిఖిలారితతుల్
భజియింప నేలుచుండెను
సుజనస్తుతిపణ్బులియను । చోళాధిపుడున్ ॥

వ॥ ఇట్లు పణ్బులిచోళమహారాజు శివభక్తుండై సకలపరివార జనంబులతో గూడి పూర్వాచారము ననుసరించి యప్పట్టణము ధర్మపరిపాలనంబు జేయుచుండు సమయంబున.

ఆ॥ వె॥ కాశినుండి వెడలి । ఘనముగ వ్యాసుండు
తనపురాణకథల । ధరణినెల్ల
విస్తరింపజేయ । వేడుకతోడ నే
తెంచి రాజునాత్మ । యెంచెనిటుల ॥

వ్యాసుఁడుషణ్ముఖిచోళునాశ్రయించుట.

పంచపాది.

తే॥ గీ॥ వసుమతీనాథనీకును । వందనంబు
చెరవుమీగురుపీఠంబు । విడచిపెట్టి
కాశియందుననుండెను । ఘనతనాదు
పీఠమద్దానినిల్పుము । ప్రియముమీర
నికనుభూతభవిష్యత్తు । తెలుగగలవు ॥

తా॥ దేవా! ఎట్టి సదుపాయంబైనను మీ గురుపీఠంబును విడచి కాశీదేశము నందున్న మద్గురుపీఠమును దెప్పించి పూజించితివేని మీకు భూతభవిష్య ద్విజయ పరాజితంబు లెరింగించెదను.

రాజు వ్యాసుని దిరస్కరించుట.

క॥ కులహీనుఁడుబోధించిన
గలుగునెఫలితంబుమాకు । ఘనతరలీలన్
దిలకించినీదువాక్యము
సలలితముగనమ్మదగునె । సత్యముచేతన్ ॥

తా॥ నీవంటివానిని గులగురువుగా భావించుకొని యుండువారలకు మోక్షం బెంతమాత్రము చిక్కనేరదు కనుక

క॥ విశ్వబ్రాహ్మణపీఠము
శాశ్వతకాలము సపర్య । సల్పెడిమాకున్
నోశ్వపచుఁడమీపీఠము
విశ్వంబుననర్హమగుట । వినికనియెలుగన్ ॥

తా॥ మేము విశ్వబ్రాహ్మణగురుపీఠమునే పూజింపవలయునుగాని యితర గురువుల బూజింపవనిలేదు కనుక నీవిచ్చటనుండక మరలిపొమ్ము.

వ॥ ఇట్లు భూవరుడు బల్కు కట్టడివాక్యంబుల కాతండు మిక్కిలి వ్యసనంబునొందుచు దనపురంబునకేతెంచి యందుండు తన కులఋషిగణంబులతో నిట్లనియె.

వ్యాసుఁడు ఋషులతో నాలోచించుట.

తే॥ గీ॥ గ్రంథముల జేసి ప్రభువుల । కడకు నేగి
యాశ్రయించితే వారలు । నరసి మనల
జేరనివ్వక యుండిరి । చేయఁదగిన
కారణంబేమి దెల్పుఁడు । ఘనత మీరు॥

తా॥ అవసవ్యశాస్త్రము లనేకము రచియించి యవి లోకంబున బ్రచరింప జేయుటకు జోళప్రభుస్థానంబునకుఁ జని యాశ్రయించిన వారంగీకరింపకుండిరి కనుక నిందుకేమి యుపాయంబు గలదో నాకెరింగింపు డనిని నతనికి ఋషులిట్లనిరి.

పంచపాది

తే॥ గీ॥ అధికకులగురువుల శిష్యు । డైన యట్టి
ప్రభువుదరిజేరి గ్రంథముల్ । ప్రకటనంబు
జేయఁగోరిన హీనుని । జేర్పకొను నె
కనుక నాతని వేశ్యకు । గలిగియున్న
గురికళింగుని చేసము । కూడు పనులు॥

తా॥ సకలజీవంబుల కాధారభూతుండైన విశ్వకర్మ ప్రియశిష్యాగ్రగణ్యులగు క్షత్రియుల నాశ్రయించిన మనవిద్యనభివృద్ధి నొందించుట కష్టపడు కాన నతని వేశ్యకు జన్మించిన కళింగునితో జెలిమి చేసినయెడల నీకోర్కె లీడేరునని మాకు దోచుచున్నయది

వ॥ అంతట సంకరవ్యాసుం డిదియే యోచనయని సంతసించి యచ్చటకేగి యాకళింగుని స్నేహంబునల్పుచు నొకదినంబున నతనితో నిట్లనియె.

వ్యాసుఁడు కళింగునకు దుర్నీతి గఱపుట.

క॥ గొనకొని చోళుఁడు దనసుతు
ఘనముగ భూపతిని జేయ । గాదలచిననీ
కనునీ రాజ్యపుపట్టం
బనువుగ గట్టంగ వలయు । నని నేబలుకన్॥

తా॥ ఓయి కళింగరాజా! మీ పినతండ్రి తనపుత్రుండైన పాలనచోళుని యువరాజుగ నేర్పరచ బ్రయత్నించినప్పుడు నేను నిన్ను యువరాజుగా జేయవలయు నని పక్కాణించ మీ పినతండ్రి తన కులగురువును బిలపించి,

శా॥ స్వామీ పాలనచోళునాదుతనయున్ । క్ష్మానాథు జేయన్ మదిన్
బ్రేమన్నెనుదలంపవ్యాసుడపుడున్ । వేశ్యాంగనాపుత్రునిన్
భూమీపాలుని జేయుమోనృపవరా । ముఖ్యంబుగానీవనన్
నేమీయాజ్ఞ ప్రకారమేరబ్బచనై । హృద్యంబుగా నెంచితిన్॥

తా॥ గురువర్యా! నా కుమారుండైన పాలనచోళుని యువరాజునిజేయ దలంపుగలిగియుండ నీవ్యాసుండాకళింగుని యువరాజుగాని యమించుమని వక్కాణించుచుండె గనుక మీ యాజ్ఞప్రకారము ప్రర్తించెద సెలవొసంగుమన నతండు.

క॥ వినుముకళింగుడు వేశ్యాం
గనతనయుండట్టివాని । ఘనరాజును జే
యనుప్రకమింగ చుటెదియును
మనుజేశ్వరకూడదనిరి । మన్వాదులుమున్॥

క॥ కావునభవదీయాత్మజు
క్ష్మావల్లభు జేయసర్వ । శాస్త్రోక్తంబై
ధీవరులెల్లను మెచ్చెద
రావిధిగాపంపుమయ్య । యనసీనాథా ॥

తా॥ ఓయిరాజా! లంజెకుమారుండు యువరాజ్యాధిపత్యంబుజేయుట కర్హత లేదు కావున నీపుత్రుని నటుల నియమించుము.

వ॥ ఇట్లు గురుండానతిచ్చిన పిమ్మట మణ్బులిచోళాధిపుండు తన సూతుండైన పాలనచోళునకు యువరాజ్యాధిపతిత్వం బొసంగదలంచి యుండె,

క॥ అంతటసమష్టిరాజ్యము
సంతతమతడేలుచుండె । సర్వజ్ఞుండై

యింతకునీకీజగమున
సుంతైననులేదుకీర్తి । చూడుము రాజా ॥

కళింగుడు పినతండ్రినిజంపు యుక్తి యడుగుట.

ఆ॥ వె॥ విశ్వకర్మగురుఁడు । విఘ్నంబునాకిటు
చేసియుండె నేమి । చేయవలయు
నీవు తెల్పుమింక । నిశ్చయంబుగనేను
జేతుసద్ది తెగువ । శీఘ్రముగను ॥

తా॥ ఈ దుర్మార్గుడు చేసిన యపకారంబునకు బ్రతిహతముగ జేయు కర్తవ్యంబు దెల్పుము నేనతివేగంబున జేసెదనని కళింగునకు వ్యాసుం డిట్లనియె.

క॥ రేపటిసూర్యోదయమున
సాపుగసేనలనుగూడి । సద్వనమునకున్
మీపినతండ్రియునరుగును
బాపమనకజంపుమతని । బార్థివనీవున్

తా॥ రాజా రేపటిదినంబున మీపినతండ్రి సకలపరివారజనం బులనుగూడి మృగంబులసంహరింప నడవికేతెంచును గనుకనీవుమాయోపాయంబులచేత నిరిగియత నిని గూల్చుము.

తే॥ గీ॥ విశ్వకర్మపీఠంబును । విడచినీవు
నాదుగురుపీఠమునుభవ । న్నగరమందు
నిల్పుపట్టాభిషేకంబు । నీకుజేసి
యేష్యగతులనుబోధింతు । నృపతివర్య ॥

తా॥ అంతట మీగురుపీఠంబునువిడనాడి నాగురుపీఠంబు నీపురంబున నిల్పుకొంటివేని నిన్ను బట్టాభిషిక్తునిగాజేసి సమస్తహేతుర్భూతంబు లెరింగిచెదను

వ॥ ఆపలుకుల కతండుసమ్మతించియుండి యొకదినంబున దన పినతండ్రి సైన్యంబుతోఁగూడి మహారణ్యంబునకుంజని వేటాడి యలసి సొలసి యొకవటవృక్షంబుక్రింద బవ్వళించి యుండుసమయంబున.

కళింగుడు పినతండ్రినిజంపుట

క॥ మనమునసంతోషంబున
దనమిత్రులతోడనతఁడు । తరలియడవికిన్
ఘనపాదచాటున దాగియు
దనఖడ్గముచేతబిన్న । తండ్రినిజంపెన్ ॥

వ॥ ఇవ్విధంబున దనఖడ్గంబుచే పిన్నచోళుని సంహరించి భవనంబున కేతెంచి వ్యాసునితో నిట్లనియె.

ఆ॥ వె॥ వినుము వ్యాసమౌని । వివరించు నీకును
నెళవ్రునడవికేగి । నేటిదినము
నీవు తెల్పినటుల । నేనుజేసితినింక
జేయదగిన పనులు । చెప్పుమయ్య॥

వ్యాసుడు తనపీఠము పూజింపమనుట

తే॥ గీ॥ గురునివిశ్వకర్మను విడి । కూర్మినాదు
పీఠమీవును దెప్పించి । పేర్మిపలుప
బురినినాటించి యీసర్వ । భూమినిప్పుడు
దిట్టముగనీవు పట్టంబు । గట్టుకొనుము ॥

తా॥ ఓయీరాజా: మీ గురుపీఠంబును వదిలి కాశీపుణ్యక్షేత్రంబున నుండు మా గురుపీఠమునిటకు రావించి నీ నగరంబునసాటించి యీ స్వరాజ్యంబు నీవు పట్టాభిషేకంబు గావించుకొనుము

వ॥ అనగళింగుడు తన గురువరుండైన శంకరాచార్యుల రప్పించి యిట్లనియె.

కళింగుడు విశ్వబ్రాహ్మణపీఠము వలదనుట.

క॥ ధరయందు మాకు వ్యాసుని
గురుపీఠముగలిగియుండె । గూరిమిచేతన్
వరుసగ నాచార్యత్వము
జరిగింపనువారెవరలు । శాస్త్రోక్తముగన్ ॥

క॥ కావున మీగురుపీఠము
సేవయొనర్పుటయు మాకు । జెల్లదు వినుమీ
భావంబున గోపించక
దేవా సల్పుమిక బంచ । కృత్యముల్ ధరన్ ॥

తా॥ స్వామీ మాకు విప్రవ్యాసుని కులగురుపీఠస్థులే పంచాంగపౌరోహిత్య క్రియలు జరిగించుచుందు రందువలన నీ గురుపీఠంబు బూజింప మాకిష్టము లేదు కనుక మీ వంశస్థులీలోక సంరక్షణకు దైతులకు పేద్యంబునకుపయోగించు కొరముట్లు మాత్రము చేయుచుండవలయును.

వ॥ అంతట గురువరుండు కోపంబుచే దలయూచి యా నిదక్కు చూచి

## గురువు కళింగునకు నీతిచెప్పుట

ఉ॥ దుష్టుఁడు వ్యాసుఁ డెంతయో । మదోన్నతిమాపయి దప్పులెన్నిని
స్పష్టముగానునీకుగఱ । పన్ గడుసంభ్రమమందియాతఁడో
గష్టమటంచెఱుంగకజ । గద్గురులౌ మమున్ద్రోచిపుచ్చియూ
సృష్టియొనర్పుడంచును వ । చించెదవోరకళింగచాలికన్ ॥

శా॥ అంతేవాసియొకండు నోయెననిమా । యాత్మన్ విచారంబు ర
వ్వంతైనన్ మరిలేదు స్వేచ్ఛగనిఁకన్ । వర్తించినన్ మాకునీ
చెంతన్ జేరియు బంచకృత్యములికన్ । జేయంగనేరీతిగా
స్వాంతంబొప్పనవీనదేశికునిచే । సాగింపుమేలాగునో ॥

తా॥ ఓరి శిష్యా నీవు దుష్టవ్యాసునిబోధవిని యతని గులగురువుగా భావించుకొని మాకు శూశ్రుషలుమాని పంచకృత్యములు మాత్రము సల్పుమనుట ధర్మమా? అయినను నీవు గురువును నిందించినంత మాత్రమున మాకేమి కొరంతగలదు కనుక నీపనులుగూడా యతనివల్లనే నెరవేర్చుకొమ్ము.

వ॥ ఇట్లు గురువరుండును దత్సంఘాధ్యక్షులును బల్క విని వ్యాసుండిట్లు శూద్రాదిసకలజనంబుల గట్టుదేయవాడంగె.

### వ్యాసుఁడు సమ్మోకట్టు జేయుట.

క॥ కుడిచేతివారలగు నృపు
కడఁజేరినవారలెల్ల। ఘనముగ మఱియీ
పుడమిని విశ్వబ్రహ్మల
వడిజేరిన నెడమచేతి। వారలునిజమున్॥

తా॥ మనరాజువైపు జేరినవారు కుడిచేతివారు, విశ్వబ్రహ్మ సంఘమువైపు నుండువారెడమచేతివారు, కనుక మీరు యావన్మంది రాజునకు సహాయముగ నుండుడని చెప్పి కొందరిని దనవశపఱచుకొని యక్కళింగునకు బట్టాభిషేకంబు గావించి యటుపిమ్మట దనపురాణశాస్త్రములు ప్రతిదినంబారాజ సభయందీగ్రతి జదివి బోధింపుచుండె.

### వ్యాసుఁడు కళింగునకు నీతులు బోధించుట.

### పద్మపురాణము.

శ్లో॥ యసునారాయణం దేవం। బ్రహ్మరుద్రాదిదేవతాః।
సమమన్యైర్నిరీక్ష్యేత। సపాషాండ భవేత్సదా॥

శ్లో॥ త్రిమంత్రం బహుమోక్తేన। బ్రహ్మసైయోనవైష్ణవాః॥
నిస్పృష్టవ్యాసవక్తవ్యా। సదుష్టనాకదాచన॥

తా॥ ఓయిరాజా! బ్రహ్మరుద్రులిద్దరును నారాయణమూర్తికి సమంబని చెప్పు చుండువాడెప్పటికి బతితపాషండుడగును. మఱియు లక్ష్మీమంత్రము జపించెడి విష్ణుభక్తులైన విప్రులను దూషింపక నీవు భక్తికలిగి వందనంబు జేయుచుండుము.

వ॥ ఇట్లు వ్యాసుడు బోధింపుచుండవిని శంకరాచార్యస్వాముల వారు, నింక విశ్వబ్రాహ్మసభాధిపతులు గొందఱు, గూడి విన యోక్తి వలన శూద్రాదిసకలజనంబుగాంచి యిట్లనిరి.

### విశ్వబ్రహ్మలు కొందఱినివశ్యపరచుకొనుట.

ఉ॥ వ్యాసునివైపుజేరగల। వారికికృత్యములైదుమాసిమే
మీ సమయంబుమాదరికి। నెవ్వరుగవచ్చిననట్టివారలన్
గానునుపీసమీయుఁడని। గర్హణ జేయకసర్వకాలమున్
జేసెదమైదుకృత్యములు। సిద్ధముగా నుదిచుందునన్మఁడీ॥

తా॥ మీరు దుష్టవ్యాసునిమాట ప్రకారము కళింగునకు సహాయమైయుండిన యెడల మీకు మేము పంచకృత్యములు చేయకుండ సమ్మెకటి మా దరిచేరినవారలకు మాత్ర మన్నిపను లెల్లప్పుడు కష్టములేకుండ చేయించెదము కనుక మీరు యావన్మంది నమ్మి మా పక్షముననుండుడు.

వ॥ ఇట్లు బోధించి యప్పుడు కొందఱిని మాత్రము తమవశము చేసికొనియుండుటగాంచి విప్రుల సహాయంబున గురుద్రోహియగు సంకరవ్యాసుం డథర్వణ వేదమంత్రబీజంబులచేత జంపవలయునని ప్రతిజ్ఞ చేసి యొకదినంబున దనగృహంబున శక్తిపూజాధురంధరుడై యుండె నది స్వామివారు మొదలైన విశ్వబ్రాహ్మణులెరింగి యప్పుడమిత నిష్ఠాగరిష్ఠులై పంచపీఠంబులకధిదేవతలగు పంచశక్తుల పూజాధురంధరులై యుండి రటుపిమ్మట.

### వ్యాసుని తంత్రవ్విదలు.

శ్లో॥ మోహానం స్తంభనంభేదం । వశ్యంచాకర్షణా స్తథా।
ఉచ్చాటనంతువిద్వేషం । కర్మాణ్యష్టాచమారణం॥

తా॥ ఈ యెనిమిది కర్మములయం దావ్యాసుడు ముందు వశ్యము, మోహనము, నాకర్షణము, నుచ్చాటనము, లను నాలుగుకర్మల చేతను, విశ్వబ్రాహ్మణులు భేదము, విద్వేషణము, స్తంభనము, మారణము, లను నాలుగు కర్మలచేతను, బోరాడుచుండి రదియెఱింగించెద వినుము.

### షట్పాది

సీ॥ మంత్రయంత్రంబుల । మహిమచేవ్యాసుండు
సర్వంబువశ్యము । సల్పుచుండ
మంత్రయంత్రంబుల । మహిమంచే బ్రహ్మలు
వైరులన్మైత్రిని । దీరజేయ
మంత్రయంత్రంబుల । మహిమచే ■జలకు
దనయందుబహుభ్రమ । దవులజేయ
మంత్రయంత్రంబుల । మహిమచేబ్రహ్మలు

వారల్ర భ్రాంతిని । వదలజేయ
మంత్రయంత్రంబుల మహిమచే దాపున
కందతిరప్పించు । నటులజేయ
మంత్రయంత్రంబుల । మహిమచే మిత్రుల
నతనియొద్దకుజేరు । నటులజేయ
ఆ॥ వె॥ మంత్రయంత్రతంత్ర । మహిమచేరిపులను
జంపుటకునుదైవ । పంపుజేయ
మంత్రయంత్రతంత్ర । మహిమచే దేవతా
పంపకములనెల్ల । జంపుచుండ॥

తా॥ వ్యాసుండు మంత్రయంత్రబలంబులచే దంతుచేసి స్త్రీపురుషుల నందఱి దనవశము జేసికొనుచుండ నదిచూచి విశ్వబ్రాహ్మణులైదుగు రేకీభవించి మంత్ర యంత్రంబుల వలన దంతుచేసి వారికి గలుగు స్నేహంబు జెడగొట్టుచుండిరి. మరల వ్యాసుండు మంత్రయంత్రబలంబుచేత నందరికి దనయందు భ్రాంతిపుట్టింపుచుండ నదిచూచి విశ్వబ్రాహ్మణులైదుగురుగూడి మంత్రయంత్రంబుల వలన వారికిగల్గు భ్రమను దొలగించి విరోధము గల్గింపుచుండిరి. మరియు వ్యాసుండు మంత్ర యంత్రంబులచే దంతుచేసి యందరి దనయొద్దకు రప్పించుకొనుచుండ నదిచూచి విశ్వబ్రాహ్మణులైదుగురు మంత్రయంత్రబలంబుచే దంతుచేసి పంతముచేత నచ్చో టికి వారలబోనివ్వక యడ్డగించుచుండిరి. మఱల వ్యాసుండు మంత్రయంత్రబలం బుల వలన శత్రుసంహారమునకు భూతభేతాళాది పిశాచంబులబంపుచుండ నదిచూచి విశ్వబ్రాహ్మణులైదుగు రేకీభవించి మంత్రయంత్ర బలంబులచే ధ్రమతావున వచ్చిన దేవతా పంపకములను నాశనముచేయుచుండిరి.

వ॥ ఇవ్విధంబున వారలిరువురు పరస్పరవైరములు పెంచుకొని యైదువత్సరములవఱకు బోరాడుచుండుటచే రయితులకు బంచకృత్యం బులు చక్కగాజరుగక తదీయరాజ్యంబునకు దుర్భిక్షాది సకల క్షీణంబులు సంభవించినకతన నుపకంఠరాజ్యాధిపతియగు జయవీర రాజెరింగి ఫణీంద్రపట్టణంబున కాగతుండై కళింగునిగాంచి యధిక కోపంబుతోనిట్లనియె.

జయవీర రాజు కళింగుని దండించుట.

సీ॥ వ్యాసునిబోధవి । స్పష్టంబుగానమ్మి
పినతండ్రియందును । భ్రీతిశోక
ఖడ్గంబుచేఘోర । గహనమధ్యంబున
బరిమార్చియుండుట । ప్రథమతిప్పు
పంచకృత్యంములచే । ప్రజలనురక్షించు
విశ్వకర్మగురుని । విడచినీవు
సంకరపీఠంబు । సంస్థానమునవిల్పి
పూజించియునుము క్తి । బొందగలవె॥

తే॥ గీ॥ కానవీవిట్లుచేసిన । కారణమున
బ్రహ్మవంశముపారలీ । ప్రజలకేపుడు
పంచకృత్యము ల్జేయక । వంతగించి
యుండగనుక్షామమంతట । నిండియుండె ॥

తా॥ ఓరి కళింగరాజా: నీవు దుర్మార్గుండైన వ్యాసుని బోధవిని మీ పిన్న య్యను హత్యచేసితి వది ప్రధమతప్పు, మరియు విశ్వబ్రహ్మవంశస్థులు చేయు పంచకృత్యములవలన సకలప్రాణులకు జీవనాధారము గల్గియుండుట నీకుదెలిసియుండి యట్టికులగురువుల నిగ్రహించి కులహీనుల నాచార్యపీఠస్థులగా నియమించుకొని పూజించుట రెండవతప్పు, కనుక క్షత్రియధర్మము ననుసరించి యిప్పుడు నిన్నేల శిక్షింవగూడదు ?

కళింగుని ప్రత్యుత్తరము.

తే॥ గీ॥ వందనము సేతుజయవీర । పార్థివేంద్ర
పితరుడంతంబునొందనా । పిన్నతండ్రి
నాకు దనరాజ్యనగరంబు । నట్టుపఱచి
కన్నసుతునకుబట్టంబు । గట్టదలచె॥

తా॥ మా తండ్రి పరిమళచోళమహారాజు పరగతిజెందిన తరువాత మా పిన తండ్రి నాకు యువరాజ్యాధిపత్య మొనర్పుటకు సందేహించి యతని గురునాజ్ఞ

ప్రకారము దనకుమారుండగు పాలనచోళునకు శుభదినంబున యువరాజ్యాధిపతిత్వ మొసంగదలచి యుండుటచే నిట్లుజేసితి నన్ను దండించుటకు నీవెవ్వఁడవు.

వ॥ అని తిరస్కరింప జయవీరరాజు తనచేతియాయుధంబున గళ్లింగుసి సంహరించి మఱల వ్యాసునిజంపబూన నతండు కాశీదేశంబు నకు బారిపోయె నటుపిమ్మట నప్పాలనచోళమహీవిభునకు మంగళ వాద్యములు మ్రోయ సుముహూర్తంబున బట్టాభిషేకంబు గావించి యతనికి మునుపటి విశ్వబ్రహ్మవంశపీఠస్థుల నాచార్యులుగనుంచి తన పురంబునకుఁజనె నంతబాలనచోళాధిపుండు మనునీతిదప్పక వేదశాస్త్ర ధర్మంబులచే సకలజన సౌకర్యంబుగ రాజ్యంబేలుచుండెనప్పుడు కాశీ పురంబున వ్యాసుండు బ్రహ్మర్షుల సభయందు దనపౌరాణిక యుక్తముగ నిట్లుపన్యసించుచుండె.

వ్యాసుఁడు బ్రహ్మనుదూషించుట.

కూర్మపురాణము.

10 వ అధ్యాయము 21 వ శ్లోకము.

శ్లో॥ సర్వాంస్తాన్ గజాన్ దృష్ట్వా । బ్రహ్మాత్మానమవిందత।
జహౌ ప్రాణాంశ్చభగవాన్ । క్రోధావిష్టః ప్రజాపతిః॥ ౨౧

శ్లో॥ తదా ప్రాణమయోరుద్రః । ప్రాదురాసీత్ప్రభోర్ముఖాత్।
సహస్రాదిత్యసంకాశో । యుగాంతదహనోపమః॥ ౨౨

తా॥ బ్రహ్మ చిరకాలముతపస్సుచేసి దుఃఖింపగా స్రవించిన కన్నీటివలన ననేకభూతము లుద్భవించినవి. మఱియు నతనిముఖము నందు బ్రాణమయుడైన రుద్రుడుజన్మించి తాను సర్వసృష్టి ముగించి యుండె నందువలన శివుని బూజింపవల సిన ధర్మమైయున్నది. కనుక నాతనియందుగూడా మఱియొక దోషంబుగలదు. అది యెద్దియనిన శివుండు దారుకావనఋషిపత్నులను వ్రతభంగము జేయుటకు దాను బురుషరూపము, విష్ణువు స్త్రీరూపము ధరించి ఋషుల తపస్సును జెఱచి ఋషి పత్నిని వ్రతభంగముచేయ నాపెచూచి నీశిశ్నము తెగిపోవునని శపించుటచే నతనికి శిశ్నముతెగిపోయె నందువలన.

వ్యాసుఁడుశివునిదూషించుట.

శ్రీమహాభాగవతము

శ్లో॥ భవవ్రతధరాయేచ । యేచతాంసమనువ్రతాః।
పాషండినస్తేభవంతు । సచ్ఛాస్త్రపరిబంధనః॥

తా॥ శివుని బూజించి ధ్యానించువార లెల్లప్పుడు పతితపాషండులగుదురు. కనుక శివుని బూజింపగూడదు.

వ్యాసుఁడుహరినిదూషించుట.

పద్మపురాణము.

శ్లో॥ విష్ణుదర్శనమాత్రేణ । శివద్రోహఃప్రజాయతే।
శివద్రోహీనసందేహో । నరకంయాంతిదారుణం।
తస్మాత్తద్విష్ణునామాపి । నవక్తవ్యంకదాచన॥

తా॥ శివద్రోహముచేసి విష్ణువును దర్శించితే శివుఁడత్యుగ్రముగాను నరక ప్రాప్తిచేయును గావున నొకప్పుడును విష్ణువుయొక్క నామము నుచ్చరింపగూడదు అని బోధించుచుండ నందదృశ్యుఁడైయున్న మయుఁడులేచి యతనింగాంచి యిట్లనియె

మయుఁడు వ్యాసుని బ్రశ్నించుట.

క॥ మునుమయత్వష్ట్రుబ్రహ్మల
బనివడిదూషించితీవు । పరిపరివిధులన్॥
గొనకొనియందున నెవ్వరి
మనమున ధ్యానించవలయు । మౌనివ్యాసా॥

తా॥ నీవు త్రిమూర్తులుచేసిన నేరములను విమర్శించితివి కావున నందెవ్వరిని ధ్యానించవలయు నదిచెప్పుము.

వ్యాసుఁడు హరినిభూషించుట - శ్రీమహాభాగవతము.

1 వ స్కంథము 3 వ అధ్యాయము 26 వ శ్లోకము.

శ్లో॥ ముముక్షవోఘోరరూపా । న్హిత్వాభూతపతీ నథ।
నారాయణకళాశ్శాంతా । భజంతిహ్యనసూయవః॥

శ్లో॥ వ్యాసోనారాయణో హరిః॥

వ॥ అనిచెప్పుచుండ మయుఁడధికకోపంబున నీవుపదునెనిమిది పురాణకట్టుకథలయందావిష్ణుమూర్తి నేలదూషించితి వని తనకత్తిచే నతనికుడిహస్తంబు ముంజేతివఱకు ఖండించి తనయాశ్రమంబునకరిగె నంతవ్యాసుఁడు నూరుసంవత్సరములు ప్రాయమునమృతిజెందియుండెను. అతనిహస్తములే దేవాలయధ్వజస్తంభశిఖరములని నాటనుండి నేటివరకు బ్రజలువాడుకగా జెప్పుకొనుచుండిరి. కనుక నందమరసింహాలుం డనుకవీంద్రుని జన్మకాలంబెఱింగించెదవినుము.

## అమరుని జన్మకాలనిర్ణయము.

వ॥ విక్రమార్కమహీపాలుఁడు కలియుగారంభములగాయతు (3634) వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము (532) వ సంవత్సరమున నుజ్జయనీపట్టణ మేలుటకు బ్రారంభించి క్రీస్తుశకము (1350) సంవత్సరములకుపైగా రాజ్యమేలుచుండ నతనిసభాస్థానమునలంకరించిన నవరత్నములను పండితులలో 1) విశ్వబ్రాహ్మణవంశీయుఁడగు కాళిదాసు 2) అమరనాథుడు 3) రత్నభూషణకుఁడు, 4) వైద్యధన్వంతరిశిల్పి 5) వఱరుచి, 6) వరాహమిహిరుఁడు, 7) ఘటకర్పరశిల్పి, 8) శంకు, 9) భేతాళభట్టమాంత్రికుడనువారలు కొన్ని గ్రంథములను వ్రాసియుండిరి. అందువలన క్రీస్తుశకము, (1300) సంవత్సరముల ప్రాంతమున నమరుఁడు జన్మించియతడుబౌద్ధమత ప్రచారప్రవర్తకుఁడై మహంతీనగరమున నివసించియుండు పౌరుషేయబ్రాహ్మణుల నాశ్రయించి యుండెనది యొల్లనిన.

## అమరుఁడు విశ్వబ్రాహ్మణులనాశ్రయించుట.

శా॥ విశ్వబ్రహ్మకథన్ సమగ్రముగా । విన్నాణమేపారఁగన్
విశ్వాసంబుగ నేరఁచించెదఁజగ । ద్విఖ్యాతమౌరీతిగన్
విశ్వబ్రాహ్మణులెల్లరింటికినిను । ద్వేనల్గురూపంబుఁ నన్
శశ్వత్కాలమునాకొసంగుడికర । శ్రీబ్రహ్మవంశాధిపా॥

తా॥ విశ్వకర్మప్రభవమునుగూర్చి త్రికాండఅమరము జేయదలంచితి గనుక మీర లింటికొక్కవరహా చొప్పున ప్రతిసంవత్సరము నాకుమామూలుగా నిచ్చుచుండ వలయును

విశ్వబ్రహ్మ లమరుని దూషించుట.

శా॥ శ్రీమద్విశ్వవిధిప్రభావమునుయజు । ర్వేదంబుఋగ్వేదమున్ ॥
సామాథర్వణములలసత్ప్రణవమున్ । శాస్త్రంబులెన్నోస్మృతుల్
ప్రామాణ్యంబుగనున్నసంగతినిద । త్ప్రాచీనగ్రంథంబులన్
మేమున్సర్వజగజ్జనుల్గనెదము । మిథ్యాదేవసింహాసుధీ॥

ఉ॥ కావునతత్ప్రభావమును । గల్పనచేసియునూతనంబుగా।
నీవురచింతునంచిటుల । నేర్పరిమాటలనెంతొపల్కనీ।
భావలయంబుకన్నిజమె । పూర్వముకంటెనతిక్రమించియిం।
కేవిధిగారచించెదవు । యెవ్వరునీకృతినందజెచ్చటన్॥

తా॥ విశ్వకర్మమహిమ యిదివరకే సమస్తవేదధర్మశాస్త్రముల యందు జెప్ప బడియున్నది. కావున నీవుచేయు ప్రబంధకల్పన యేమియులేదు నీకృతినెవ్వరు బొందజాలరుపొమ్ము.

వ॥ ఇట్లువిశ్వకర్మవంశస్థులు వర్షాశనమివ్వమని బల్కనమరుండు కోపోద్రేకుండై యుజ్జయినీపట్టణమేలు విక్రమార్కునిసంస్థానమునకుఁ జనియాస్థానపండితుండుగానుండియమరకోశము ప్రథమకాండమురచించి ద్వితీయకాండమునందుబూర్వోక్తములైనరథకారశబ్దవిమర్శనప్రమాణ ములననుసరించి విశ్వకర్మనుదూషింపదొడంగె నదియెట్లనిన,

అమరుఁడు విశ్వకర్మను దూషించుట.

అమరకోశము ద్వితీయకాండము.

216, 217, వ పుటలు.

శ్లో॥ శూద్రావిశ్యోస్తుకరణః॥

తా॥ శూద్రస్త్రీకి వైశ్యునివలనబుట్టినవారు కరణజాతియనియు

శ్లో॥ మాహిష్యోఽర్యాక్షత్రియయోః ॥

తా॥ వైశ్యస్త్రీకి క్షత్రియునకు జన్మించినవారు మాహిష్యజాతియనియు, నీ రెండువిధంబులుగా నిర్ణయించి యావంశంబున.

శ్లో॥ రథకారస్తుమాహిష్యా । త్కరణ్యాంయస్యసంభవః॥

తా॥ కరణస్త్రీయందు మాహిష్యపురుషునివలన జన్మించిన సాంకర్యులే రథకారులని యర్థంబునుమార్చి వ్రాసినందున నోటియందు క్రిమికీటకాదు లేర్పడియుండె నప్పుడావిక్రమార్కుని సంస్థానంబును వదలి తన గృహంబునకు జేరిన పిమ్మట మాలినియను నామాంతరముగల తల్లి యతనితో నిట్లనియె.

అమరునకుదల్లి నీతిచెప్పుట

ప్రాచీనమూలస్తంభము

శ్లో॥ అమరసింహస్యమాతా । విశ్వకర్మాదిశాంపతిః॥
ఇతిశ్రుతియుతంరూపం । విశ్వకర్మాణమవ్యయం ॥
సృష్టిస్థిత్యంతకర్తారం । నకుర్యాన్నిందపూర్వకం ।
ఇతీరీతివచశ్శ్రుత్వా । పశ్చాత్తాపప్రయయత్యధా॥

తా॥ ఆ విశ్వకర్మ సృష్టిస్థితిలయకర్తయై సమస్త భువనములయందు శాశ్వతముగ నిండియుండె గనుక నీవాపరమాత్ముని జేయదగని నిందచేసి యీరీతిగ దుఃఖింపుచుంటివి, అదియునుంగాక.

విశ్వకర్మశాస్త్రము.

శ్లో॥ విశ్వకర్మకులంనింద్యా । యఃకుర్యాజ్జన్మపాతకః ।
సూకరోబహుజన్మాని । శివవాక్యంనసంశయః ॥

తా॥ ఓరికుమారా! విశ్వకర్మను దూషించినపాపాత్ముండు పందిరూపమై యనేకజన్మములెత్తునని యీశ్వరుఁడు చెప్పియుండెను గనుకనీవుచేయుగ్రంథంబున విశ్వకర్మను దెగడుటచే నీకీవిపత్తుసంభవించియుండెను.

వ॥ ఇట్లు జ్ఞానవతియనుతల్లి చెప్పిన యనుజ్ఞ ప్రకారమున నమరుండు విశ్వకర్మయందు భక్తిజ్ఞానంబులను గలిగి మఱల మూలస్తంభము నను గ్రంథంబును వ్రాసి యున్నట్లు నీక్రింది శ్లోకప్రమాణమునుబట్టి తెలియబడుచున్నది.

## ప్రాచీన మూలస్తంభము

శ్లో॥ అమరేణకృతౌదూప్యే । నామలింగానుశాసనే ।
తద్వక్త్రీకిరీటస్య । ద్విశ్వకర్మాన్వయంపునః ।
మూలస్తంభేనగ్రంధేన । విశ్వకర్మన్నమోస్తుతే ।
శ్రుతేఽనుమతంజ్ఞాత్వా । తద్వంశాధిక్యవర్ణనం ।
కరిష్యామిత్రికర్తారం । రక్షమాంచజగద్గురో ॥

శ్లో॥ విశ్వాయువిశ్వకర్మంచ । విశ్వమూర్తిపరాత్పరం ।
విశ్వమాతాపితారూపం । విశ్వకర్మన్నమోస్తుతే ॥

తా॥ విశ్వము ఆయుస్సున్ను, విశ్వము ప్రయోజనమున్ను, విశ్వమూర్తికే పరాత్పరమున్ను, విశ్వమునకుదల్లిదండ్రియును, నయిన విశ్వకర్మకునమస్కారము.

శ్లో॥ విశ్వమంగళమాంగళ్యం । విశ్వవిద్యావినోదినే ।
విశ్వసంచారబీజానాం । విశ్వకర్మన్నమోస్తుతే ॥

తా॥ విశ్వమునకు మంగళ ప్రదము, విశ్వమునకు విద్యావినోది, విశ్వముతానై యున్నవాడును, నగువిశ్వకర్మకునమస్కారము.

శ్లో॥ అప్రహాస్యమిదంతంత్రం । రహాస్యమతిదుర్లభం ।
విశ్వకర్మమహాశాస్త్రం । సంక్షేపాద్వక్ష్యతేఽధునా ॥

తా॥ హాస్యములేనిదియు, మహారహాస్యమైనదియు, మహాదుర్లభమైనదియు, నగువిశ్వకర్మశాస్త్రముసంక్షేపముగజెప్పెదను.

వ॥ అని యివ్విధంబున నమరుండు విశ్వకర్మనుబొగడి మూలస్తంభమను గ్రంథంబును శ్రుత్యనుసారంబుగా రచించినందున నమ్మహానుభావుండగు విశ్వకర్మవలన దద్బాధనివారించి యమితసుఖంబుగ నుండె నంత బాలన చోళమహారాజేంద్రుడు కూడా కొన్నిసంవత్సరంబులవఱకు రాజ్యాధిపత్యముజేసి యంతరించెను.

## ఫలస్తుతి

శ్లో॥ నమోవిశ్వవ్యాపారాయ । నమోవిశ్వవిచారిణే ।
నమోవిశ్వవిధానాయ । నమస్తేవిశ్వకర్మణే ॥

తా॥ విశ్వవ్యాపారుఁడైనవాడును, విశ్వవిచారుండైనవాడును, విశ్వమంతయుదానైయున్న విశ్వకర్మకు నమస్కారము.

## గద్య

ఇతి శ్రీ వీరాఖ్యునార్య కరుణాకటాక్షలబ్ధ కవితాలక్షణుఁడా విశ్వకర్మ
పాంచానన భువనసగోత్రి పవిత్ర చెరుకూరి వంశాబ్ధి సోమ
చలమయ్య పుత్రరత్న వినుత నే శివరామయోగి ప్రణీతంబయిన
శ్రీవీరబ్రహ్మాండ సర్వశాస్త్ర సమాధానవ్యత్యాయ నిత్య
రత్నాకరమనె కృతినుండి పరిమళచోళ చరిత్రము
చతుర్థాశ్వాసము సంపూర్ణము.

ఓం తత్సత్

బ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోనమః

# పరిమళచోళచరిత్రము

## పంచమాశ్వాసము ప్రారంభము

### ఇష్టదేవతా ప్రార్థన

క॥ శ్రీలక్ష్మీ పతివందిత
బాలాబ్జ శిరః కిరీట। ఫణిరాడ్భూషా
కాలగళశోభితను ది
క్పాలవరేణ్యా ! సమస్త। భావుకమూర్తీ ॥

ఉ॥ శ్రీ లలితుండు సూర్యకుల। సింధు సుధాకరు డుద్ధతారిని
ర్మూలుఁడు ధీరుఁడున్ సుజన। ముఖ్యుఁడు శంకరభక్తియుక్తుఁడౌ
పాలనచోళ భూవరుఁడు। భవ్యముతోఁడ ఫణీంద్రపట్టణం
బేలుచునుండె రాజవరు। లెల్లరు మెచ్చగ ధారుణీస్థలిన్॥

తా॥ ఇట్లుపరిమళచోవంశంబునగడపటిపురుషుఁడగు భానువంశాబ్ధిచంద్రుఁడైన పాలనచోళమహారాజు శివభక్తుండై ఫణీంద్ర పట్టణము సుభిక్షంబుగ నేలుచుండనతని భార్యయగు సుదక్షిణాదేవికి సంతానంబుగల్గి నశించిపోవుట మామూలైయుండి మఱల గొన్ని దినంబులకు గర్భోత్పత్తి గల్గియుండె నదియెట్లనిన

### రాజుభార్య గర్భవతియగుట

ఉ॥ అయ్యవనీశుపత్నియు ర। యంబున గర్భముదాల్చి మానముల్
చయ్యన మత్తదంతిగతి। జందము మందమునయ్యె నంతటన్
దొయ్యలి చన్మొనల్ నలుపు। చూపె వడిన్ నవమాసపూరితం
బయ్యెను దేహకాంతి పొలు। పారె మహాద్భుతమంచు నెంచగన్ ॥

వ॥ ఇవ్విధంబున నాపట్టమహిషి దోహదచిహ్నములచే నొప్పు చున్న సమయంబున రాజు తన గురువుఁగాంచి యొకదివసంబున నిట్లనియె.

పాలనచోళుని సంతాన ప్రశ్నము

చ॥ గురువర! నాదుభార్యకొన । కూడెను దొమ్మిది మాసముల్ భవ
త్కరుణయు నాపయిన్నునిచి । గట్టిగ జ్యోతిషశాస్త్రరీతిగా
సరగున దెల్పు మేశిశువు సంభవమౌనో మరెంత కాలముల్
బరగ జనించునో దశప్ర । భావము లేగతి నున్నవో కదా ॥

తా॥ గురువర్యా! నాకుగల్గెడిసంతానంబునుగూర్చిచక్కగ జ్యోతిషశాస్త్రంబు పరిశీలించి దెల్పుము.

గురుని సమాధానము

ఉ॥ పాలనచోళ ! నీదుకుల । పత్నికి నర్భకుడుద్భవించి తా
నేలు సమస్తరాజ్యమని । యెన్నటికీవు దలంపబోకుమీ
బాలిక యొండుగల్గు నిక । భావితకాలము సంతు శూన్య మిం
కేల దురాశజెందెదవు । యీవిధి జ్యోతిషశాస్త్రమొప్పెడున్ ॥

తా। రాజేంద్రా! నీకు బుత్రుండుగల్గి రాజ్యపరిపాలనముచేయునని సంతసించితివేమో నీకు బురుషసంతానంబు లేదు. ప్రుతికగల్గి యికముందు సంతానంబులేదని యెరుంగుము.

వ॥ ఇట్లు గురుండుబల్కవిని భూవరుం డశ్రుపూరితనయనుండై యున్నకాలంబున నమరుండా వృత్తాంతంబెఱింగి పాలనచోళరాజు కడకుం జని యిట్లనియె.

అమరుఁడు పుత్రుఁడు గల్గునని బోధించుట

మ॥ వినుమా భూపతి నీదుభార్యకును సం । ప్రీతిన్ గుమారుండుసం
జనియించున్ దలుపాత నాల్గుదినముల్ సాంగమ్ముగా గండమొం
డనుకూలంబగు నద్దియున్గడువగా । నాయర్భకుండేపునన్
ఘనరాజై బహువర్షముల్ ప్రజలతా । గాపాడు నిక్కంబుగన్ ॥

తా॥ నృపా! నీకు మగశిశువుగలిగి నాలుగుదినంబులు సజీవుండై యెదవదిన సంబున నతనికొక గండంబుగలదు. అది గడచిన నూఱువత్సరంబు లాయుష్యంబు గల్గిక్షేమంబుగ రాజ్యపరిపాలనము చేయును.

రాజమరునకు బ్రత్యుత్తర మిచ్చుట

క॥ సుతునకు గల్గెడి గండము
నతులితముగ నెట్లు దొలగు । నదియును నీవున్
గుతకము చేత వచింపుము
యతిత్వర నే సంతసమున । నాక్రియ జేతున్ ॥

తా॥ మంత్రీ! నాపుత్రున కాగండంబుదొలగి జీవించుసదుపాయంబెరింగిచుము నేనటులజేయుదును.

అమరుఁడు తంత్రము పన్నుకొని చెప్పుట

తే॥ గీ॥ వనిత ప్రసవించుటకు ముందు । వడ్డెగుంపు
నెల్ల రప్పించి చెఱువును సల్లలితము
త్రవ్వజేసియు ఘనత సం । తర్పణంబు
జేయ గండంబు శమనమై । శిశువు బతుకు ॥

తా॥ రాజా! నీభార్య ప్రసూతియగుటకు ముందుగ వడ్డెవాండ్రబిలిపించి సుదినంబున దటాకము వేయించి సర్వజనులకు సమారాధన చేయించితివేని యాపుణ్య ఫలంబువలన నీకొమరుండు పూర్ణాయుష్యంబుగల్గి వర్ధిల్లును.

వ॥ అంతట బాలచోళుం డమరుని మంత్రిగా గైకొనియుండె నామంత్రి తన పట్టణ సమీప గ్రామంబులందుండిన వడ్డెగుంపులను రావించి మంచినీళ్ళ చెఱువును ద్రవ్వించుట కాజ్ఞయొసంగె నంత నామేస్త్రీ యమరునితో నిట్లనియె.

వడ్డెమేస్త్రీ యమరునితో నుడువుట

ఉ॥ ఓ సచివాగ్రగణ్యా! సుగుణోత్తమ యోామరాఖ్య మాదుపే
రాస యెఱింగి యిమ్ము ధన । మంతయు మీావరయాజ్ఞ చేతునున్

జేసెద మీాతటాకమతి । శీఘ్రముగానని వారలంతటన్
హాసనముజ్వాలాత్ములయి । యాగతి వేయుచునుండి రయ్యెడన్ ॥

తా॥ ఓయమరమంత్రీ! మాకు నిర్ధరించిన ధనమిమ్ము శీఘ్రముగ దటాకము త్రవ్వెదమని యట్లు చేయుచుండు సమయంబున సమరుం డామేస్త్రితో నిట్లనియె.

ప్రధాని వడ్డె మేస్త్రీతో బిల్లవాని నిమ్మనుట

క॥ వారము దినములలో నొక
నారియు బ్రసవించునపుడు । నయము గ సుతునిన్
మీారొసగియు మాపుత్రుసు
గోరిన ద్రవ్యంబుగొనుడు । గొనకొని యింకన్ ॥

తా॥ మీ గుంపునందు నవమాసంబులుగల గర్భిణీస్త్రీలు వారము దినములకు బ్రసవించు సమయంబున నాకు దెల్పితివేని నీకు బహుమతినొసంగి మీపిల్లవానిని మేము తీసుకొని మాపుత్రికను మీకొసంగెదమని వడ్డెవానితో నొడంబడిక చేసుకొని యటుపిమ్మట మంత్రసానితో నిట్లనియె.

తే॥ గీ॥ చోళనృపుభార్య ప్రసవించు । వేళ గనుల
గంతగట్టి తనూజను । ఘనతవడ్డె
దానిశయ్యను జేర్చి త । ద్బాలు నిటకు
దెచ్చి నావల్ల బహుమతుల్ । పుచ్చుకొనుము ! ॥

తా॥ నీవు మన రాజుభార్య ప్రసవించునప్పుడు నామె కనులకు గంతకట్టి కలుగు బిడ్డను వడ్డెవారికిచ్చి వారిపిల్లవానిని బరులకు దెలియకుండ నీవుదెచ్చి తల్లిపాన్పు నందుంచితివేని నీవుగోరిన బహుమతు లొసంగెద.

వ॥ ఇట్లు మంత్రసాని బహుమతి గైకొనియుండ నొకదినంబున సమరుం డారాజపత్ని కడకుం జని ముకుళితకరకమలుండగుచు మృదు మధుర భాషణంబుల నిట్లనియె.

## అమరుడు రాజుభార్యకు బోధించుట

ఉ॥ ఇమ్మహి నెంతవింతజని । యించెనొ కో తెలియంగరాదు వో
యమ్మ మహర్షివర్యుఁడొక । డద్భుతవృత్తి సేయగుచున్న నిన్
బిమ్మటజూచి నెమ్మదిని । బ్రేమదలిర్పగ నాదుమాట వా
పమ్మెదఁ దోచి సత్యమని పల్కెను గోమలవాక్యపద్ధతిన్ ॥

మ॥ అది యెట్లన్నను జెప్పెదన్వినుము య । త్యాసక్తితో నుర్వరన్
నుదయంబైన సుతుండు జీవితుడుగా । కున్నన్ సతీరత్న మిం
పొదవన్ నేత్రయుగంబు జర్మమున సం । యోగంబొనర్చిఁ ప్రసూ
తి దగన్నాగ జనించి యాసుతుఁడు వృ । ద్ధింబొందు దీర్ఘాయుఁడై ॥

తా॥ ఓ సుదక్షిణాదేవీ! నాకొక మునీశ్వరుండు దర్శనమిచ్చి యిదివరకు మీ రాజుగారిభార్యకు స్త్రీసంతానంబుగల్గి నశించి యిప్పుడు మరల నవమాసంబుల గర్భిణి యేర్పడియున్నది పురుషసంతానంబు గల్గును గనుకనామె ప్రసవకాలంబున నేత్రంబులకుజన్మంబును సంధించుకొని ప్రసవించినయెడల నాపిల్లవాడు నూతేండ్లాయువుగల్గి కుశలముగానుండుననిచెప్పి యామునీంద్రు డదృశ్యంబయ్యె. నది నీకు బరమరహస్యంబుగ నెరింగించితి. గనుక నీవారీతిగ జేయుమని నమరుఁడుపల్కిన వాక్యంబులకారాజపత్ని యట్లేచేసెదనని సంతోషస్వాంతయై యుండు నొక దినంబున.

## రాజుభార్య ప్రసవించుట

సీ॥ అపుఁడు నారాజరా । జాగ్రగణ్యునిమూర్తి
కమలాక్షికి బ్రసూతి । సమయమయ్యె
నయిన నా కలకంఠి । యమరుండు మును జెప్ప
గా వినియున్నది । గాన నతఁడు
చక్షుయుగంబున । జర్మంబు సంధించి
గర్భభారంబున । గాసినొంద
గా జూచి మంత్రిపుం । గవుఁ డొనరించిన
విధమున జేసెను । మధురవాణి

తే॥ గీ॥ యనుచు నెమ్మది గుందుచు । నపరసార
సాకరము వేయుచున్న ద । త్సమయమందు
నవ్యగుణవృద్ధులైన మా । నవులజూచి
సరవితో బల్కె నతఁడు వి । స్మయముదోప ॥

మ॥ బలవంతుండగు భూమిపాలకునికిన్ । పట్టికె వేసర నిచ్చినా
పలుకుల్ యెవ్వరితోఁడన్నైన మహిలో । వారించి యెప్పట్టునన్
దెలియన్ జేసిన ప్రాణహాని యగు సం । దేహంబులేదంచు స
ల్లలితాస్యుండయి బాలుఁదోడ్కొనిచనెన్ । రాజాలయోత్సీమకున్

తా॥ మీరలీ బాలుని జోళపురాధీశ్వరునకొసఁగితిరి కనుక నీరహస్య మెట్టికాలమునం దెవ్వరికిని దెలియగూడదు. అధవా తెలసెనేని మీకును నాకును ప్రాణహాని సంభవించునని యమరుం డావడ్డెవాండ్రకు భయోత్పాతంబు గల్పించి యాబాలకుని మంత్రసానివలన దీసికొనివచ్చు నంతలో నాపట్టపురాణికి బుత్రికారత్నంబు గల్గియుండెనంతట.

అమరుఁడు మంత్రిసానికి బిల్లవాని నిచ్చుట

మ॥ చనియాశాబకు నూడిగంపు సతులన్ । శౌర్యుండుదాబిల్చి సం
జనితామోదము వప్పగించె మన రా । జార్ధాంగి యివ్వేళనిం
పున స్త్రీ బాలనుగాంచు దాసి మరివి । స్ఫూర్తిన్ గడన్ ద్రోచిను
ట్టున నీబాలుఁడె గల్గెనంచు మనపుట్టుల్ మెచ్చబేర్కొండగున్ ॥

తా॥ మీరు మనపట్టమహిషియైన సుదక్షిణాదేవిగాంచిన పుత్రికారత్నంబును వడ్డెదానికొసంగి యిప్పుడు మేముతీసికొని వచ్చిన వడ్డెబాలకుని నావె పాన్పునందునిచి యీపరమరహస్య మెవ్వరికి దెల్పగూడదు కనుక మీమదిలో నుంచుకొనవలయును సుమా:

వ॥ అంతట దాసీజనంబులు మొదలగువారలు ప్రధాని చెప్పినట్లుచేసి రందు మంత్రిసాని యతనింగాంచి యిట్లనియె.

క॥ మంత్రివర నీవు దెల్పిన
మంత్రిపరికారంబు దేవి । మంచమునందున్

డాంతీకంబగు బిడ్డ స్వ
తంత్రింబుగ నుంచియుంటి । దథ్యము నేనున్ ॥

తా॥ స్వామీ! మనరాజుగారి భార్యయగు సుదక్షిణాదేవికిమగశిశువు గల్గిన రక్షితముగా నుండెనని చెప్పిన విని సంతోషంబున నమాత్యుడారాజుతో నిట్లనియె,

మంత్రి రాజుతో బుత్రుడుద్భవించెననుట

క॥ జనపతి వినుమా దెల్పెద
దనయుండును గలిగియుండె । దద్దయు వేడ్కన్
ఘనముగ నతనికి గర్వకు
డను నామము బెట్టవలయు । నతివేగమునన్ ॥

తా॥ రాజా! నీకు బుత్రుండుగల్గి క్షేమంబుగానుండె గనుకనతనికిగర్వకుండను నామధేయంబొనర్చినయెడల నూతేం డ్లాయువుగల్గి రాజ్యపరిపాలనము చేయును.

వ॥ అంతట నృపుండు సంతుష్టాంతరంగుండై యుండ నతని కులగురుండగు శంకరాచార్యుం డిట్లనియె.

గురువు ప్రధానియుక్తి రాజునకు దెల్పుట

సీ॥ నృపనీకు నేను బు । త్రికగల్గునని చెప్ప
నమరుండు పుత్రుండే । యనుచు బల్క
నానిమాటలు నీవు । భావంబుననునమ్మి
నంతనీ సతిగన్న । సంతు వడ్డ
వడతికోసంగి త । ద్బాలుని దెచ్చి నీ
సతి పాన్పునందున । సంఘటించు
నటు మంత్రిసానిచే । నమరుండు చేయించె
నీవది గానక । యెలమి నాదు

తే॥ గీ॥ ఘనసుతుండిత డనియెంచి । కనికరమున
దాసివారలు గుమిగూడి । ధరణియందు

దమపురంబున సాకుట । ధర్మమగునె
కడురయంబున మంత్రిని । నడుగవలయు ॥

తా॥ రాజా! నీకు నేనుస్త్రీ సంతానము గల్గునని చెప్పితి నమరుండప్పుడు నీకు బురుష సంతానంబుగల్గునని వాక్రుచ్చిన నీవదివిని యాతనియిష్టప్రకారము వర్తించితివి. అంతనీ పత్నికి సంభవించిన బుత్రికను వడ్డెదాని పర్యంకమునను, దానిబాలుని నీకులసతి శయ్య యందును, యుక్తిచే మంత్రసానివలన జేర్పించియుండెనడనీవగ్రాహ్యతచే విశ్వసించి మదీయసుతుండితఁడని ప్రేమచే బెంచుచుంటివి తమవంటిరాజగృహంబులయందు హీనజాతిపిల్లవానివి బెంచుట ధర్మంబుగాదు కనుకనీవు మంత్రిని బిలిపించి విచారించుము

## రాజమరుని మర్మంబు నడుగుట

క॥ నాదు తనూజుఁడు కాడని
మోదంబున వడ్డెదాని । పుత్రుండనుచున్
వాదించెను మద్గురువరు
డేది నిజము తెలియబల్కు । మిప్పుడుమంత్రీ ॥

తా॥ ఈడింభకు డస్మదీయజాయాసంజనితుండుగాడు వడ్డెదానిపుత్రుండనిమద్దేశికుఁడు విశదీకరించె గాన నేతత్ప్రశంస యదార్థము వచింపుమనిన నతని కమరుండిట్లనియె.

క॥ నీవిదివరకును బట్టపు
దేవికి గర్భంబుగల్గి । తేటగనుండన్
గోవిదులను బ్రశ్నించిన
భూవరతత్కాలమందు । బొందుగనీకున్ ॥

క॥ స్త్రీ సంతానంబగునని
భాసురముగనీదు గురుఁడు । పల్కిననేనున్
వాసిగ సుతుఁడని చెప్పిన
దోసముగాయెంచినీదు । గురుబ్బోధించెన్ ॥

తా॥ రాజా! మీగురువు యోషితాపత్యము కల్గునని చెప్పియుండె నేను గొప రుండు గల్గునని చెప్పితి నంతనీకు బుత్రుండుదృవించియుండె నది గాంచివారివాక్యం బులు వృధయయ్యెనని నాయం దసూయచే నీకిటుల గఱపెగాని యాభాషణంబుల సత్యంబులు.

వ॥ ఇట్లమరుండు పల్కు వాక్యంబులు నమ్మియుండె నప్పుడా సుదక్షిణాదేవి.

క॥ తొమ్మిదవదినమునందున
సమ్మతి సతి యర్భకునితో । స్నానంబయ్యెన్
బిమ్మట పదియొక్కటిదివ
సమ్మున నారాజువిదిత । సంభ్రమపరుఁడై ॥

తే॥ గీ॥ పుత్రునకు నామకరణంబు । బొలుపుమీరి
జేయవలెనంచు వేడ్కతో శీఘ్రముగను
మునుల హితులను బుధజన । ములను జనుల
విశ్వకర్మల భటుల రప్పించె నపుడు ॥

సీ॥ ఒకవంక నతిధీర । యుతులగు శ్రోత్రౌఘ
మొగివేద ఘోషము । లొనరఁజేయ
నొకచాయ బాహుబ । లోద్దండులై రాజ
బంధువుల్ రాజ సం । బంధిగోల్వ
నొకదారి వరభట । నికరంబు దనకీర్తి
సంతోషహృదయులై । సరగబొగడ
నొకచోట భరతశా । స్త్రోక్తవేషాకదం
బంబుసంబరము నా । ట్యంబుసలుప

తే॥ గీ॥ రాజశేఖరుఁడతుల । విభ్రాజమాన
మౌక్తిక సుహార కాంచన । మయవినిర్మ
లాభరణజాల భూషితు । డగుచువచ్చి
యరిది గూర్చుండె రత్నసిం । హాసనమున ॥

వ॥ అంత నా వధూవరులును, బుత్రుండును, శుద్ధోదకస్నానంబులు జేసి.

సీ॥ నిడుదపెన్నెరికొప్పు । దడియొత్తి యొకయింతి
యోరగా గొప్పు శృం । గారపఱచె
బంగారు కాంతి ను । ప్పొంగుచునున్న చీ
నాంబరంబది నితం । బమున దాల్చి
నవరత్నమయభూష । ణావళుల్ ధీరత
లలితాంగదముల న । లంకరించి
కులుకు గుబ్బలమీద । గుత్తంబుగా నెఱ్ఱ
రంగులపై రాణి । రవిక దొడిగి

తే॥ గీ॥ కంఠమున హారములు చక్క । గా ధరించి
బాలునకు గజ్జెలందియల్ । లాలితముగ
వేషము నలంకృతంబుగా । వించి సుతుని
జంకనిడుకొని పైని వ । స్త్రంబువైచి ॥

తే॥ గీ॥ చారుతరపద్మఘటిత శృం । గారకటక
జనితఝుణఝుణా రవములు । చాల మ్రోయ
జేడియలగూడి యరుదెంచె । సూడిగంపు
సతులు వింజామరలను బా । ర్శ్వములవీవ ॥

వ॥ ఇట్లరుదెంచిన రాజపత్ని తనపుత్రుని గరకమలంబులయందునిచికొని చోళపురాధీశ్వరునకు వామభాగంబున గూర్చుండినంత విశ్వబ్రాహ్మణపురోహితులు పుణ్యాహవాచనంబు జేయించి బంగారుపళ్ళెరంబునిండ మూక్తికపు హారములు దెప్పించి రాజుచేతికొసంగి నామకరణంబు వ్రాయుమనిన నతండు మిక్కిలి సంతసంబున.

రాజుతన పుత్రునకు నామకరణంబు జేయుట.

తే॥ గీ॥ వ్రాసెనారాజు మౌక్తిక। రాశియందు
గర్వకాహ్వయుడంచుజ। గజ్జనములు
పొసగ నాశీర్వదించి యా। ముద్దుగికిని
శీర్షములపై శుభాక్షతల్। చెలగివైవ॥

క॥ ఇచ్చిరి మంగళహారతు
లచ్చెరువుగ సతులుగూడి। హర్షముతో శు
భచ్చతురతరత్నంబుల
వచ్చిన రాజన్యబంధు। వర్గము జూడన్॥

వ॥ అంతట దనబంధువర్గము మొదలగువారలకు భోజనానంతరమున దాంబూలములు వస్త్రభూషణంబులు, బహుమానంబులొసంగినఁ గైకొని వారు నిజవాసంబులకుంజని సుఖంబుసనుండి రంత నబ్బాలకుండు దినదిన ప్రవర్ధమానుండై బాల్యాతీతుండగుచు శరాసనాద్యాయుధంబుల బట్టనేర్చియుద్ధరంగ ప్రవీణుండై యుండుటంగని సంతసించి యాపాలనచోళమహారాజు మంత్రిని రప్పించి యిట్లనియె.

రాజు మహామేరువునుగూర్చి యడుగుట.

క॥ దేవస్థాన మహీధర
మేవైపుననుండె నిచటి। కెంతటి దూరం
బై విలసిల్లును నచ్చటి
కేవిధముగ నేగవలయు। నెన్నడు నత్తున్।

తా॥ మంత్రీ! నేను మహామేరువు చూచివచ్చుట కెంతదూర ముండునో తెల్పుమనిన రాజునకు మంత్రి యిట్లనియె.

క॥ ఆమేరు సవిస్తారము
సామాన్యులకలవియగునె। సన్మతులనాథా

యేమియునార్యా తెలియదు
కోమల శుభగాత్ర బ్రహ్మ । కులజునదుగుమా॥

తా॥ అట్టి మహామేరు పర్వతము నీకు జూపించుటకు నాకేమితెలియదు కనుక నీవు విశ్వబ్రాహ్మణులగొనివెళ్లి చూచిరమ్ము.

వ॥అప్పుడా పాలనచోళమహారాజు విశ్వబ్రాహ్మణులబిలిపించియిట్లనియె.

రాజుమహామేరువు పటము వ్రాసి తెమ్మనుట.

సీ॥ తే॥ స్వర్ణకారక విప్రుల । సరగబిలిచి
కనకశైలంబు శ్రీవిశ్వ । కర్మచేసి
మునుపుసజ్జనులందరు । వినుతిజేయ
నతని సంతతిమీరలీ । యవనియందు॥

క॥ కాంచన భూధరమిప్పుడు
నంచితమతిజూడవలయు । నంచున్నమదిలో
మించిన వేడుక కలిగెను
నంచితముగ బటమువ్రాసి, యది తెమ్మనియెన్

తా॥ పూర్వంబున విశ్వకర్మ మహామేరువు నిర్మించియుండెనని పెద్దలుచెప్పుదురుకనుక నేనదిచూడవలయునని మనంబున బహుకోరిక గలిగియుండెను మీరది వర్ణించి యొకపటంబువ్రాసి యది నాకుదెచ్చిచూపింపుడనవిశ్వకర్మకులాగ్రగణ్యులు, కొంతదడవుయోచించి యామహామేరువునువర్ణించి పటంబులిఖించియుండిరదియెట్లనిన

విశ్వబ్రాహ్మణులు పటంబు లిఖించుట

శా॥ వన్నెల్మీర పటంబుపై గళలు జె । ల్వారన్ ఘనద్రవ్యముల్
చెన్నొందన్ దగగూర్చి శాస్త్రవిధముల్ । చేర్పించి విద్వజ్జనం
బెన్నన్ శృంగసమేతమై యలరునా । హేమాద్రిశృంగారమున్
జెన్నల్ వ్రాసిరి విప్రశిల్పులటు నై । చిత్రశ్రీయాపై ఖరన్ ॥

వ॥ ఇవ్విధంబున విశ్వబ్రాహ్మణు లతివిచిత్రంబుగా బటంబు వ్రాసి తెచ్చి యారాజేంద్రు నెదుటనిల్పి యిట్లనిరి.

మూలస్తంభము

శ్లో॥ తస్మేరుశిఖరే రమ్యే । రత్నంసర్వశిలస్తథా ।
సర్వభూజాసురాదృష్ట్వా । సర్వవల్లీసురాలతాః ॥

తా॥ ఆమేరువునందున్న శిలలు దివ్యరత్నములు, నందుగల వృక్షములు, కల్పవృక్షములు, నందుగల తీగెలు సురలతలై యుండును.

శ్లో॥ సంజీవం సర్వమూలాశ్చ । భవనాశంఫలంతిరయో ।
పునర్జన్మనవిద్యంతే । పురుషాస్సిద్ధరసస్తథా ॥

తా॥ ఆమేరువునందు కందమూలాదులు, సంజీవనాదులు, నందుండు ఫలాదులు, జన్మజరామరణాది దుఃఖముల నశింపజేయును. నందుండు పత్రములు పునర్జన్మాదలు లేకుండ చేయును. నందుగల పురుషులు సిద్ధరసములు గల్గియుందురు.

శ్లో॥ రసాయన గుణాస్కంధ । మృత్తికా హేమవేదికా ।
నానాపుష్పసుపుష్పంచ । నానామోదగుణైవనాః ॥

తా॥ ఆ మేరువునందున్న దిన్నెలు రసాయనములై యుండును.

శ్లో॥ అనేకవ్యాలసంకీర్ణం । శార్దూలం శరభసంకులం
కరేణుయుతభేరుండా । నాస్తేక్షుద్రమృగస్తథా ॥

తా॥ ఆమేరువునందు మహాకృష్ణసర్ప సంకీర్ణంబై నిండియుండును. పులులు, శరభాదులు, నెలుగులు, నడవి యేనుగులు, గండభేరుండములు, మొదలైన మృగములు, జాతివైరములు లేకుండ యుండును.

శ్లో॥ సిద్ధగంధర్వసంకీర్ణం । యక్షఃపన్నగశోభితం ।
కిన్నరైః కింపురుషస్య । గరుడవిద్యాధరస్తథా ॥

తా॥ ఆమేరువునందు సిద్ధులు, గంధర్వులు, యక్షులు, గరుడులు, కిన్నరులు, కింపురుషులు, విద్యాధరులు, దమలో దా మన్యోన్య సంతోషంబు జెందియుందురు.

శ్లో॥ శివయోగి శిరోమంత్రిం । శివధ్యానతిగణ్యతే ।
శివజ్ఞానంచవృద్ధశ్చ । శివమానిశ్చసంకులే ॥

తా॥ ఆమేరువునందు శివమంత్ర జపయోగులును, శివధ్యాన సన్యాసులును, శివజ్ఞానులైన పెద్దలును, శివమునులును, సంతోషచిత్తులై యుందురు.

శ్లో॥ ఉపనిషద్వాక్య వేదాంతం । శ్రుతిశ్చస్మృతయస్తథా ।
స్తోత్రించమంత్రియుక్తానాం । వేదశాస్త్రమనేకవత్ ॥

తా॥ ఆమేరువునందుండు ప్రభువుసమీపంబున నుపనిషత్తులు, వేదాంతములు, శ్రుతిస్మృతులు, స్తోత్రయుక్త మంత్రములు ననేకశాస్త్రములునున్నవి మరియు.

శ్లో॥ అనేకాగమసంకీర్ణం । సిద్ధాంత ఇతిహాసయః ।
యే దేవసంతికంమధ్యే । పార్వతీపరమేశ్వరైః ॥

తా॥ ఆప్రభువు సమీపమునం దనేకాగమ శాస్త్రములు, ననేక సిద్ధాంతములు, ననేక యితిహాసములు నున్నవి సభామధ్యంబున పార్వతీ పరమేశ్వరులు మొదలగు ముప్పదిమూడుకోట్ల దేవతలున్నారు.

వ॥ అనిన బటంబుయొక్క చిత్రంబుగాంచి యా రాజేంద్రుఁడానందభరితుండై వారలకు బహుమానంబు లొసంగి యటుపిమ్మట దన గురువునుగాంచి యిట్లనియె.

క॥ శ్రీమన్మేరుగిరీంద్రం
బేమాత్రము దూరముండె । నెన్నిదినంబుల్
యేమార్గంబున బోదగు
స్వామీ యిటుదెల్పుమయ్య ! సద్బ్రహ్మవరా ॥

తా॥ గురువర్యా ! నాకు మహామేరు పర్వతము జూచి రావలయునని బహు దినంబులనుండి యభిలాష కలిగియున్నది. కనుక నెన్ని దినంబుల ప్రయాణమో విచారించి తెల్పుమనిన రాజునకు గురుండిట్లనియె.

మ॥ సురబృందంబున కాలయంబగుచు బల్ । సొంపొందు హేమాద్రికిన్
బరగన్ నీవును బోవునప్పటికి ద్రో । వన్ బంచవర్షంబులౌ
గిరిదన్నంచుట కబ్బయుగ్మమగు నం । క్లిష్టంబుగా సంతసి
ప్పురికిన్ జేరుటకై దు వత్సరములౌ । మొత్తంబు సంద్రెండగున్ ॥

తా॥ రాజా! అట్టి పర్వతముజూచి వచ్చుటకు బదిరెండువత్సరంబులు పట్టును.

వ॥ స్వామీ! మీరుగూడా వెంటరావలయును.

గురు నీపురికొక రాజునుంచు మనుట

క॥ జననాయక నీవొకనికి
ఘనముగ బట్టంబుగట్టి। కడువడిమనమున్
గనకాచలమును గాంచుట
కునుబోవగవలయుమదిని। గోరికదీరన్॥

తా॥ జననాధాగ్రగణ్యా! భవదీయ హృదయంబున హాటకాచల విలాసంబు నేత్రపర్వంబుగా గనుంగొన వాంఛజనించెనేని యీ రాజ్యంబున కొకరాజు నేర్పఱచి వెళ్ళెదమురమ్మ.

రాజు కర్పకు నధిపతిగా జేయదలంచుట

క॥ ధీవర నేనీ పురికిని
నావరసుతుఁడుండగాను। నయముగ నొకనిన్
భూవరుని జేయ నేలను
దేవా యిట్లనదగునె। తెంపుగనీవున్॥

తా॥ స్వామీ! నాకుమారుండైన కర్పకుడుండగ వేఱొకనిని భూపతినిజేయు నేల నతనినే రాజునిజేసి వెళ్ళవలయురమ్ము.

గురువు కర్పకునకు బట్టముగట్ట వలదనుట

ఆ॥ వె॥ నీదు కొమరుడంచు। నిక్కవంబుగ బెంచి
యివుడు నృపుని జేయ। నెల్లరాజ్య
మునకు గీడుగల్గు। ముందుకొన్నాళ్ళకు
నీకు వైరియగును। నిశ్చయముగ॥

తా॥ రాజా! నీకొమరుండని ప్రేమచే బెంచియుంటివి కాని వీడు వద్దెదాని పుత్రుఁడు కనుక నీయర్పకునకు బట్టాభిషేకము జేసినవెంటనే జనుల కత్యంతంబుగు

కష్టములు ఘటించి దుఃఖింప జేయుటయేగాక రాబోవు కాలంబున నీకు శత్రుండగును గనుక నీవెంత మాత్రము పట్టాభిషేకము చేయదగదు.

నృపుఁడమరుని నడుగుట

క॥ అనువుగ నస్మత్తనయున
కును బట్టముగట్టదలచి। గురువునడుగ పీ
డనిశము జనబాధకుఁడై
జనకద్వేషమున కొగ్గు। నరగున ననియెన్॥

తా॥ మంత్రీ! నాకుమారునకు బట్టాభిషేక మొనర్చిన వెంటనే జనుల కత్యంతమైన కష్టములు సంభవించుననియు, నాకు ముందు శత్రుండగుననియు మద్గురుండానతిచ్చుచుండెను.

అమరుఁడు ప్రత్యుత్తర మిచ్చుట

క॥ సుతుండుండగనీ రాజ్యము
మతిచెడి నేతొకనికిడుట। మర్యాదానా
హితవుగ నీవుత్రునకే
గతినైనను గట్టుమింపు। గను బట్టంబున్॥

తా॥ రాజా! పుత్రునకు మించిన వేఱొక మిత్రుండు గలఁడా? యెందుకు నీవు యోచించెదవు? గనుక నీకొమరునకు వెంటనే పట్టాభిషేకము జేయుమని యమరుఁడు బల్కు వాక్యములనమ్మి నరవరుండు మందోటీనగరంబున స్ఫాంత రాతికోట నిర్మించుకొని యందుండు విశ్వబ్రాహ్మణులచే బంగారుమకుటంబును జేయించి వారలకుఁ దగిన బహుమతు లొసంగి సుదినంబున దన సుతునకు బట్టాభిషేకంబు గావించి యమ్మహామేరువును జూచుటకు గురువుతోనయితము పదునలువుర దోడ్కొని శుభసూచకంబు లెదుర్కొన దనపట్టణద్వారంబు వెడలి.

రాజు మహామేరువునకు బోవుట

సీ॥ సాలతీమాల ర। సాలనుద్దాలపు
న్నాగ జంబీర వ। నములు గడచి
గండకభల్లూక। కంఠీరవ వ్యాఘ్రి
భీకరాటవులను। బేర్మిదాటి

గంభీరమాధుర్య । జృంభితరసపూర
వరనదివ్యూహముల్ వరుసదాటి
బకచక్రవాకజీ । వంజీవశుకపిక
సముదితకాసార । చయముదాటి

తే॥ గీ॥ సరవినొకచోట పాదప । ఛాయలందు
మార్గవిశ్రాంతులై యుండి । మధురభూత
ఫలములను దృప్తిఁబొంది ని । శ్చలతనున్న
రాజుతో నిట్టులనె జగ । ద్బ్రహ్మణొకఁడు ॥

తా॥ ఇట్లనేక పర్వతంబులు, మహారణ్యంబులు, నమృతపూరంబులగు నదీనదంబులు, గడచి వారల కనతి దూరంబుననున్న మహాశిలా నదియొక్క గర్జారవంబును గాంచి యందొక విశ్వబ్రాహ్మణుం డారాజేంద్రున కిట్లనియె.

శిలానది మహిమ రాజునకు జెప్పుట

క॥ అది స్పర్శనమాత్రంబున
వదలక సచరాచరములు । వడిశిలరూపం
బొదవినసుశిలానది యది
కుదురుగనిది దాటవశమె । కువలయనాథా ॥

వ॥ అప్పుడా రాజవరుం డిట్లనియె,

ఉ॥ కోరికదీర మేరుగిరి । కూటము జూపెదనంచు నన్ను నీ
దారికిఁ దెచ్చి యశ్మనది । దాట నసాధ్యమటంచు బల్కితౌ
గౌరవమొప్పయీనదిని । గక్కున దాట నుపాయమెద్దియో
మీరు దలంపరేయనిన । మిక్కిలి చింతతొనుండిరత్తరిన్ ॥

వ॥ ఇట్లు విశ్వబ్రాహ్మణులు పదమువ్వురు గొంతసేపు చింతించి తమలో దా మాత్మగతంబున మా కులదేవతయగు కాళిని ప్రార్థించిన మనోరథంబీడేరునని నిర్మలోదక పూరంబగు పద్మాకరంబున

స్న సంధ్యానుష్ఠానంబులు నెరవేర్చుకొని కరకమలంబులను మస్తకంబునఁ గీలించి యిట్లని స్తుతించిరి.

విశ్వబ్రాహ్మణుల కాళీస్తుతి.

—: దండకము :—

శ్రీమన్మహామంగళాకారణాకార రేఖా సముజ్జృంభి తాశాంత విభ్రాజమానా జగన్మోహినీ సారదంభోళి భృత్కుంభి కుంభస్థలోద్యత్ప్రభాతుల్య వృత్తస్తనీ శుభ్రసత్ఫుల్ల పంకేరుహాక్షీ కళాపూర్ణ శుభ్రాంశుసారాననా కృష్ణజీమూతకేశా మహోన్మత్త సారంగయానా సుధామాధురీయుక్త బింబాధరీ శంఖచక్రాసికోదండ పాశాంకుశా హస్త సంభాసమానా మహాకామరూపీ మమున్నీ కటాక్షంబునన్ జూచి మద్మ్యాన దీతీరమున్ జేర్చి రక్షించు దుర్గా భవానీ మృడానీ శివా దక్ష పుత్రీ మహాదుష్ట రక్షోగణధ్వంస కోదండకాళీ నమస్తే నమస్తే నమః.

వ॥ ఇట్లు ప్రార్థనంబు జేయ నగ్గంగా భవాని యిరుప్రక్కల నిలువఁబడి మధ్యమార్గంబిచ్చిన దాటి మహామేరువుకడకుంజని యందు గొన్ని దినంబులుండి యచ్చటనుండు విచిత్రంబుల జూచుచుండి రంత ఫణీంద్ర పట్టణంబేలు కర్ణక రాజు ప్రధానియగు నమరుండు విశ్వబ్రాహ్మణులపై బ్రతిజ్ఞ చేయుచుండె నదియెట్లనిన.

అమరుఁడు విశ్వబ్రహ్మలపై బ్రతిజ్ఞ చేయుట

మ॥ అసురుండింత సహింపలేక మునుదా । నార్యాత్మ సంరంజనం
బమరం బేర్పడ జెప్పుచున్న యెడమీ । ప్రఖ్యాతి లోకంబునం
దమరం జేసెద సంతసంబున మహా । దానంబు వీసద్వయం
బమలంబా కనకం బొసంగు మనగా । హంకారచిత్తాబ్జుఁడై॥

క॥ ననుగాంచి విశ్వకర్మలు
పెనుగొను క్రోధంబుతోడ । బెదరించిరినీ
వొనరించుదేమి మాకుల
ఘన మిలసకలము సృజించు । ఘనులము సుమ్మా ॥

తా॥ మేము సమస్త సృష్టిస్థితి లయాదులకు గర్తలమై ప్రవర్తించుచుండ నీవుజేయు నమరకోటంబున నింకనేమి ప్రభావము గలదని నన్ను దూషించిన విశ్వ బ్రాహ్మణులకు నా యనుమతి బడయక రాజు బహుమానం బొసగియుండెగావున నీ పంచానన వంశ సంభవుల మదమడంచిన మదీయ సామర్థ్యం బించుక చూచెదరే యని తన చిత్తంబున దలపోయుచు నొక్కదినంబున గర్వకునిగాంచి యిట్లనియె.

అనురుండు కర్వకునకు తనజన్మకథ యుక్తిగా జెప్పుట

సీ॥ మునుసుదక్షిణగర్భ । మునబుత్రికజనించు
ననిజ్యోతిషంబున । నదియెఱింగి
యీరాజ్య మేలుట । కెవ్వండు లేడని
మదిని జింతించినే । మర్మముగను
ధారుణీశుని నుంచి । నీరుతటాకంబు
వేయించుమనియప్పు । విన్నవించి
యతనియాజ్ఞనుగొని । యారీతిగావించు
తెరిబుట్టితివి వద్దె । తరుణికపుడు

ఆ॥ వె॥ పట్టమహిషిగనిన । బాలనిచ్చియునిన్ను
మంత్రసానిదెచ్చె । మర్మముగను
బెంచియుంటి మొంతో । ప్రేమతోనిపుడు నీ
తండ్రి హేమగిరికి । దరలునపుడు.

చ॥ నినుఘనరాజుగా సలుప । నీజనకుండల విశ్వకర్మకున్
గనకకిరీటమున్ సలుప । గ్రక్కున నాజ్ఞయొసంగ వారలున్
జనువుగ గాళికా వరప్ర । సాదకులోటను నీదుజన్మమున్
గనుగొని యాకిరీటమును । గల్పనజేసిరి యుక్తమానటుల్ ॥

తా॥ రాజా! పూర్వము సదక్షిణాదేవి గర్భంబున బుత్రికపుట్టునని ప్రశ్నచే నెఱింగి నేను మనరాజ్యంబున కధిపతి యెవ్వండు లేడని మనంబున జాలా చింతించి మంచినీళ్ళ చెఱువును వేయించి సర్వజనులకు సమారాధన చేయించితి వేని నీకు బుత్రుండు పుట్టి నూఱుసంవత్సరములవఱకు బ్రతికి రాజ్యంబేలునని నీదత్తుతండ్రి కిం జెప్పి యాతని సెలవు బొంది యిప్పట్టణ సమీప పల్లెలందుండిన వడ్డెగుంపులను బిలపించి యట్లు చేయుమండునప్పుడు నీతల్లియగు వడ్డెస్త్రీకి నీవు పుట్టియుండగ నిన్ను మంత్రసానిచేత తీసుకొనివచ్చి నీ పెంపుడుతల్లిగాంచిన పుత్రికను నీతల్లికొసంగియది మొదలు నిన్ను మేము నీపెంపుతల్లి పెంచుచుంటిమి కొన్నిదినంబులకు నీతండ్రిపాల సచోళుండు మహామేరువుజూడబోవుటకు ముందు నిన్ను రాజుజేయ నిశ్చయించి కిరీటము చేయుమని విశ్వబ్రాహ్మణుల కానతిచ్చినం గైకొని వారుకాళికాదేవి వరప్రసాదకులౌటవలన నీజన్మవృత్తాంతం బెఱింగి నీమకుటంబుపై వడ్డెవారి కుపయుక్తమగు గడ్డపార మొదలైన పనిముట్లను చిత్రించి చేసి తెచ్చియుంచిరి అదిగని నేనూరకుంచి నీకు మకుటాభిషేకంబు గావించితి గనుక వారికిం దగిన శిక్షవిధించుటయే కర్తవ్యము.

కర్ణాటకరాజు విశ్వబ్రహ్మల జంప మంత్రి కాజ్ఞ యొసంగుట

క॥ స్వాంత శిలాకోటనున
　　శ్శాంతము నివసించు విశ్వ। బ్రాహ్మణజనమున్
　　శాంతము లేక వధింపను
　　బంతమున నాజ్ఞ యిడితి। బాగువిడినీశున్ ॥

తా॥ అమరసింహా! నీవు స్వాంత రాతికోటలో నివసించియుండు విశ్వబ్రాహ్మణులను సర్వశిరశ్ఛేదనచేయుమని యుత్తరువొసంగితిబొమ్మ

వ॥ ఇట్లు రాజాజ్ఞనడపి యమరసింహుండు విశ్వబ్రహ్మ వంశస్థుల నిర్మూలనము చేయుటకు రథగజతురగపదాతులతో బయలుదేరి స్వాంతరాతికోటను ముట్టడించినప్పుడు వారుపగలు సూర్యకాంతము, రాత్రి చంద్రకాంతము, చూపించుచు వచ్చిన శత్రుబలముల నధోగతి జేయ నతండు మిక్కిలి వ్యసనంబుతో నిట్లనియె.

అమరసింహుండు దండూరా వేయించుట

సీ॥ పృథివియందున విశ్వ। సృడ్వంశజులకోట
　　　మర్మంబు గనునట్టి। మహితులకును

నాభరణములైన । నంబరంబులనైన
దనరు వజ్రాది ర । త్నములనైన
నమితరూప్యములైన । నగ్రహారములైన
ఘనవాహనములుష్ట్రి । కరులనైన
గోబృందములైన । గొనకొని రాజ్య
మునసగంబైనను । ఘనతరముగ

తే॥ గీ॥ దక్షిణంబిచ్చెదమని మా । ధాత్రినాథు
డిపుడునాకాజ్ఞ యొసఁగె నెం । దేనియెవరు
సాహసము గల్గియున్న నీ । సమయమందు
ప్రభుని చెంతకు వారతి । త్వరగరండు ॥

వ॥ అనియివ్విధంబున మంత్రిపుంగవుండు దండూరా వేయించిన
విని యొక వేశ్యస్త్రీ ప్రభుస్థానమున కేఁగెంచి యిట్లనియె.

వేశ్య కోట మర్మంబు జెప్పెదననుట

ఉ॥ కోటసముఖంబునను । గొండొక సౌధము గట్టి నీపురిక్
సాటినరీతి ద్రవ్యమును । జయ్యననాకు నొసంగినంతనా
కోటనుగల్గు మర్మముల । గొబ్బున నేను బరిగ్రహించి ము
మ్మాటికిమీకు దెల్పెదను । మానవనాథ మదీయయుక్తిచే ॥

తా॥ స్వామీ వారికోటసముఖంబున నొక్క మేడనుగట్టించి మీవాగ్దానంబు
ప్రకారము నాకు గానుక లొసంగి యన్నవస్త్రములిచ్చుచుండిరేని సంగీతాభినయాది
విద్యానిపుణత్వములచేత వారల మోహింపజేసి యామర్మంబు గ్రహించి మీ కెరిం
గించెద.

రా॥ నీవుగోరిన సర్వస్వము నిచ్చెద గొనుము

వ॥ అంతట వేశ్య యారాజచంద్రునివలన సమస్తకానుకలు
గైకొని మేడనునిర్మించుకొని యందునివసించి యక్కోటలోనుండు వారి
హృదయంబు రంజిల్లున్నట్లు గానంబొనరించుటగాంచి యందొక

యువకుండు మోహాపరవశంబున నాస్త్రీ మేడలోనికిఁజేరి యిరువురు స్నేహంబుచే గొంతకాలము జరిగిన పిమ్మట నొకనాడు శయనించి నిద్రించుచుండగ నమ్మగువ మేల్కొని యిట్లనియె.

వేశ్య కోట మర్మమెఱుంగ నూహించుట

శా॥ ఓ కాలజ్ఞ జగద్విదించికుల జ । న్మోత్తేజరత్నంబయో
రాకేందుప్రతిమాన చారువదనా । రారాజ సంస్తుత్యమీ
ప్రాకారంబున కగ్ని వ్యాప్తమయి ప్రా । గ్భారార్చిమిన్నంటెనన్
నీకింకన్ దృఢసుషుప్తి జాగ్రతయురా । నేలేదే ప్రాణేశ్వరా ॥

తా॥ ప్రాణేశా ! మీవరణం బగ్నిచే దహించుచుండె నిద్రలెమ్మని జాగ్రత్త కేకవేసి చెప్పన నతండులికిపడి నిద్రలేచి యన్మగువ కిట్లనియె.

విశ్వబ్రాహ్మణుఁడు కోట మర్మంబు దెలుపుట

క॥ భద్రిముగ విశ్వకర్మలు
నిద్రింపుచునున్నవేళ । నిర్భయమతితో
గోద్రివకసవుకు నిడియే
క్షుద్రులు నడిగాల్చిరకట । కోటనుగాంతా ॥

తా॥ ప్రాణేశ్వరీ ! విశ్వబ్రహ్మవంశస్థులు నిద్రించు సమయంబున (వినాశకాలే విపరీతబుద్ధి) యనునట్లు దుర్మార్గు లెవ్వారికగడ్డివేసి తగలబెట్టియుండిరని తన ప్రాకారంబువంకజూడ నది యెప్పటివలెనేయుంటె నప్పుడా గణిక స్త్రీ గోపంబున నిట్లనియె

విశ్వబ్రాహ్మణుండా వేశ్యపై గోపించుట

శా॥ ఓసీ ! యెంతదురాత్మురాలవకటా । యుద్గాఢ మర్మంబుచే
నీ సాన్నిధ్యమునన్ను జేర్చుకొని దు । ర్నీతుల్ ప్రబోధింపుచున్
మోసం బెంతయు జేసి తీవరణమున్ । భ్రష్టంబుగావించి సం
భాసంబైన సువిశ్వకర్మజులగూ । ల్పన్నీవు యత్నించితే ॥

తా॥ ఓసీ: యెంత దుర్మార్గురాలవు అయ్యయ్యో యీలాటికటలంబుచే నన్ను నీవశపఱచుకొని నాకు జెడునీతులెన్నియో గఱపుచు నిటువంటి మోసంబుగావింతివి యీదుర్గమును దహింపజేసిమిక్కిలి తేజోవంతులైన యీ శ్వకర్మవంశజులనందరిని నాశనంబు సల్పుటకుద్యోగించితివి

వేశ్య యతని కోపంబును మాన్పుట

క॥ హృదయేశ్వర నీకున్ గల
నిదురను బరికింపదలంచి । నేడిటులంటిన్
మదియందున గోపించక
సదమలగుణమూర్తినాదు । సరసకరిమ్మా ॥

తా॥ నాథా! నీయొక్క నిద్ర మృదువునుజూడ బరిహసించి యుంటిగాని వేఱొకటికాదుగదా యని వారకాంత యానాయకుని గాఢాలింగనము గావించుకొనిన నతని కోపంబు శాంతిబొంది ప్రాతఃకాలంబునగోటలోనికిం బోయి తనసంఘాధిపతితో నిట్లనియె.

విశ్వబ్రాహ్మణుండు పెద్దతో జెప్పుట

ఉ॥ భర్గవరప్రసాదక । విభాకరతేజ సమస్త విశ్వసృ
డ్వర్గవరేణ్య నేబలుకు । వాక్యములన్నియు నాలకింపుడు
దుర్మార్గులు శాత్రవవ్రజము । మాయగవచ్చియు నగ్నిగూర్ప నీ
దుర్గము దగ్ధమయ్యెనని । దుస్సహమా కలకంటి నీనిశన్ ॥

తా॥ స్వామీ: ఈరాత్రి దుష్టశత్రువులు ప్రవేశించి యగ్నిచేమనకోటనుదగుల బెట్టిరని దుస్స్వప్నము గాంచియుంటి నని ననామహా నీయుండు యోగదృష్టివలన గాంచి యాడంభకునితో నిట్లనియె

సంఘాధిపతి యతనికి శాపమిచ్చుట

ఉ॥ ఓమతిహీన! సత్కులము । నున్నత గౌరవమున్ సుకర్మముల్
నేమమువిత్తమున్ యశము । నీతియుమాని మదించి వార కాం
తామణులందు నిచ్చగ స । తంబుజరింపుచు బెద్దలైన మ
మ్మామహి యందు గూల్చుటకు । నీగతి జేసితి వారయర్భకా॥

తా॥ నీవు మేలిమివంశంబునగల సంధ్యావందనాది సకలకర్మలును, గౌరవంబును, నిశ్చలబుద్ధియును, ధనయశధర్మంబులను, వదలి ప్రమత్తుండవై వేశ్యాంగనలయందు ప్రియముచే ద్రిమ్మరుచు మనకోటకుహానితెచ్చితివి కనుక నీకిదిమొదలుకొని సావర్ణముత్పత్తి వృత్తిహీనమైపోవుగాక.

వ॥ అని వానిని, నతని పుత్రమిత్రకళత్రాది బంధువర్గంబులను శపించి వారలనప్పుటనే విడచిపెట్టి వాయువేగంబున వెళ్ళి వేలోకప్రదేశంబున జీనా యను పట్టణంబుగట్టుకొని యందు శత్రువులు ప్రవేశింపరాని విశాలముగ స్ఫాంతశిలాప్రాకారంబును నిర్మించుకొని యందు కుటుంబ సమేతులై నివసించి యీ లోకంబునకు వారుచేయు పంచకృత్యంబుల నెఱింగించెద నది యెట్లనిన.

విశ్వబ్రాహ్మణ పంచకృత్యములు.

స్కాందపురాణ నాగర ఖండము

5వ అధ్యాయము 16వ శ్లోకము

శ్లో॥ కృతేతుమనసాసృష్టి । త్రేతాయాందృష్టిసాధనం ।
ద్వాపరే మంత్రితఃసృష్టి । కలౌతు కరసాధనం ॥

తా॥ సర్వ సృష్టి కాలంబున కృతయుగంబున సంకల్పముచేతను, త్రేతాయుగంబున దృష్టిచేతను, ద్వాపరయుగంబున మంత్రబలము చేతను జేసియుండు ప్రకారంబున వారు రైళ్ళు, ప్యాక్టర్లు, సైకిళ్లు, మోటార్లు, దుర్భిణులు, వాయువిమానములు, మొదలైన సమస్తపరికరములు చేయుచుండిరి. ఇప్పటనుండువారు నాల్గవపాదమునందు పచించినప్రకారము హస్తసాధనములచే సృష్టిస్థితిలయాదులు జరిగింపుచుండిరి. కనుక నావేశ్యభూవరు నికడకుంజని యిట్లనియె.

వేశ్యకోటమర్మంబు రాజునకు జెప్పుట

క॥ లోకేశవిశ్వకర్మల
ప్రాకారంబునకగోడరి । వంబను కనవున్
దాకించి యగ్నిగూర్చిన
నాకాలంబునను భస్మ । మగునికటముగన్ ॥

తా॥ రాజా మీపొలమునందుపేయు నారికగడ్డితెప్పించి యాకోటచుట్టవేయించి యగ్ని పెట్టినవెంటనే భస్మంబై పోవునుగదా

వ॥ అంతగర్వక రాజు తనపురజనులందఱిచే బొలమునందు వేసిన యారికగడ్డి తెప్పించి యాకోటచుట్టువేయించి మంటవేయింప నందలి విశ్వబ్రాహ్మణులు తమకుటుంబ సమేతులై బిలద్వారము ననడపికిం జేరి యథర్వణ వేదబీజముల నుచ్చరించి యారాజు పట్టణమంతయు బాడు చేసి యటుపిమ్మట వారలు రూపంబులు మార్చుకొని యేబది యారు దేశంబులు మొదలగు నానా ద్వీపములందు నాయాదేశ భాషాచారములుగల్గి శూద్రాదుల యిండ్లయందు డాగియుండు వారలకు పార్వతి సనాతన గోత్రంబున వీరపాపమ్మగారై జన్మించి లింగధారణము చేయుటచే వారలు ప్రాణములు నిల్పుకొనియుండిరి కనుక నంతకు బూర్వము పాలనచోళుండు మహామేరువుగనుటకు వెళ్ళి ద్వాదశాబ్దములకు దిరిగి తనదేశంబునకువచ్చి పుత్రుని ధర్మగుణాతిశయంబుల విమర్శింప బహు కఠినంబుగ నుండుటచే దనపురంబునకుం బోవుటకు భయభ్రాంతి చిత్తుండై యున్నతరి తన వెంటనున్న విశ్వబ్రాహ్మణ గురువరుండిట్లనియె.

గురువు రాజునకు బూర్వసంగతి చెప్పుట

క॥ మునునీ సూనుఁడుగాడని
మనుజాధిపమేముపల్కు । మాటలువినకన్
ఘనముగ నతనికి రాజ్యము
తనివిగగట్టితివినీవు । తంత్రమెఱుగకన్ ॥

తా॥ రాజా నీవతనికి రాజ్యముగట్టు సమయంబున నీకామరుఁడు కాదని నేను జెప్పిన వినక యింతచేసితివిగదా

రాజు శత్రుసంహారయుక్తి యడుగుట

మ॥ గురువర్యా ! కుటిలామరోక్తి వినినే । గోల్పోతి రాజ్యంబు నే
శరణిన్ బట్టణమేగువారము భవ । త్కారుణ్యమున్నామొదన్

బరిపూర్ణంబుగనుంచి తెల్పుమమర । భూమినాథులంగూల్పదు
ష్కరమైత్రో చెదదీయ కార్యమును సాం। గంబె వ్విధిఁ జేయుదున్ ॥

తా॥ గురువర్యా ! నేనా కపటనియోగి మాటవిని రాజ్యంబును బోగొట్టుకొంటిని దీమునుఁగాక పట్టణము చేరుటకు సైతము శక్యంబుగాక యుండెగాన మీరు నాయందనుగ్రహమున శత్రువులనేగతి జయించెదనో తెల్పుమనిన రాజునకు గురుం డిట్లనియె.

సీ॥ మన మెల్లరము గూడి । మారు వేషంబుల
రామనాటక చోళ । రాజచరిత
ములనాడుచునుండ । బుడమియాఁగుఁడది విని
మనలరప్పింప ప్రభు । ముమున రామ
నాటకంబును గ్ర । స్సన వాని మెప్పింప
నరసి నీదు చరిత్ర । కాజ్ఞయొసఁగ
నతనికి కిరీటంబు । నాభరణంబుల
నాయుధ సింహాస । నాదుల గొని ॥

తే॥ గీ॥ రాజువేషంబుతోఁడ నా । రచ్చయందు
నమరక ర్పకులను దుంచి । యపుడు నీవు
సారదసింహాసనమున గూ । ర్చుండి రాజ్య
మేలు దువుగాక చోళన్ను । పాలయింక ॥

తా॥ రాజా మనము జంగము కులము వారను మారుపేరు బెట్టుకొని శ్రీరామచరిత్రము జోళరాజు చరిత్రము నీరెండు నాటకంబుల రచించుకొని యీగ్రామములందాడుచుండుట నతండు విని యడిచూడ వలయునని కోరికచే రప్పించినప్పుడు మనము వెళ్ళి ముందుగా రామనాటకమున సంతోషపరచినంత జోళరాజచరిత్రము వినవలయునని కాంక్షించి యతండా చరిత్ర కాజ్ఞయొసంగ నతనివలన ముందుగా గిరీటభూషణశస్త్రసింహాసనాది సర్వస్వము కావలయునని గ్రహించి యా నీవు రాజువేషంబున ధరించినాటక సమయంబున మన కెదురుగా గూర్చుండిన రాజును మంత్రిని సంహరించి యంతట నీవు సుఖప్రదముగ బట్టణంబేలుకొనవచ్చును.

రా॥ స్వామీ అలాగే చేయుదము.

వ॥ అంతట దనదు గురుమూర్తియగు శంకరాచార్య స్వాముల వారు శ్రీరామచరిత్రము, చోళరాజచరిత్రము, నీరెండు నాటకాలంకారంబుగా రచియించి తన శిష్యులు పదుముగ్గురకు నాట్యంబు గఱపి యూళ్ళయందు నృత్యములు సల్ప, గర్వకరాజునిని యుడచూడ వేడుకచే వారలబిలపించి ముందు రామనాటకం బాడించి సంతసించి గానుక కప్పము లొసంగి యటుపిమ్మట చోళరాజు నాటకము వేయుట కాజ్ఞయొసంగ నప్పుడా కపట భాగవతులిట్లనిరి.

కపట భాగవతులు కర్వకరాజు సామాగ్రి యడుగుట

తే॥ గీ॥ చోళభూపతి హేమాద్రి చూడనేగి
ద్వాదశాబ్దంబు లేకదా । ధరణి. తిని
గుర్తెరింగినవారలు । గొందఱుండి
రతని సామగ్రి మాకిమ్ము । యాడగలము ॥

తా॥ ఇప్పుడు చోళరాజు మహామేరువునకువెళ్లి షుమారు పదిరెండు సంవత్సరంబులయ్యె గనుక మీపట్టణంబున నాప్రభువు నెరింగిన మనుష్యులనేకులుండి రందువలన నా నాటకమునకుం దగినసామగ్రిలేదు కావున నీశస్త్రసింహాసన భూషణాంబర సర్వలాంఛనము లీరాత్రి కొసంగిన యెడల మేమానాటకము ప్రారంభించెదము.

వ॥ అనిన భాగవతులకు రాజాజ్ఞ ప్రకారము నాపితుండైన మంగలి క్షౌరము జేయుచు నందలి రాజు వేషంబు ధరించువాని రూప లావణ్యంబులంగని కంట నీర్వెట్టుటంగాంచి యిట్లనియె.

కపట భాగవతుండంబట్టు నడుగుట

క॥ క్షౌరము చేయుచు నీవు
తీరున వగచెదవదేమొ । తెల్పగనాకున్
గూరిమిగ దెలియబల్కుమని
వారించెదనదియు నేను । వాస్తవంబుగన్ ॥

తా॥ మంగలీ: నీవిటుల దుఃఖంపనేల దెల్పుము.

మంగలి తన దుఃఖమును వెల్లడించుట

చ॥ వినుము తదీయ వార్తలతి। వేడుక పాలనచోళ సింహాసం
హాసనుఁడుమానృపాలుఁడు స। మస్తశుభంబుగమమ్ముఁబోచెనీ
జనపతిపేలఁగిఁజవతె। జయ్యునసందతీమాడ్చుచుండెనీ
ఘనతెర శైనసుందరము। గాంచియతండనిగుందితిక మదక్ ॥

తా॥ దేవా యిదివరకు మాపాలనచోళభూవరుఁడు రాజ్యపరిపాలనముచేయుచు సర్వజనంబులకు సుకరంబు జేసి యుండె. నతండు స్వర్ణాచలము చూడనేగుచు వద్దె దానికుమారుండైన కర్పకరాజునకు బట్టంబుగట్టివెళ్లిన ద్వాదశాబ్దంబులనుంచి యద్దు ర్మార్గుండు ప్రజలను బహుశ్రమ నొందజేయుచుండెగాన. నీరూపరేఖా విలాసంబులం జూచియప్పాలన చోళనృపుండనిదుఃఖించితిగాని వేఱొకటిగాదు.

వ॥ అంత గపటభాగవతులా రాత్రి చోళరాజుయొక్క శస్త్రసిం హాసనాంబ రాభరణాదిసర్వ లాంఛనములగైకొని. నాట్యంబుసల్పుచు నందలి రాజువేషధారి కోపోద్దీపితుండై యా సభాస్థలిముఖ స్థమం దున్న కర్పకామరులనిద్దరిని శిరచ్ఛేదనముచేసి, సింహాసనాసీనుండై నిజ వృత్తాంతం బెరింగించిన నందరుసంతసించి యిట్లనిరి.

రాజునకు ప్రజలుకష్టంబులు చెప్పుకొనుట.

ఉ॥ భూపతినీవుయాత్రికయి। పోయిన యప్పటినుండి కర్పకుం
డాపదలెన్నియోసిడుచు। హాయన ముల్వది రెండు నేగనీ
పాపులనిద్దరిగదిసి। పట్టివధించితివయ్య మాకునీ
యాపదలున్ దొలంగెనిఁక। నందఱు మేలుగనుందు రెప్పుడున్ ॥

తా॥ రాజేంద్రానీవుమహామేరువు చూడవెళ్ళిన పది రెండుసంవత్సరములనుంచి యుపరుని దుర్బోధచే వద్దెవారైన కర్పకరాజు ప్రజలబాలాకష్టపెట్టుచుండె నీవదిగ్ర హించి యిద్దరిని సంహారించితివి కనుక నింకమేము సుఖంబుగనుండెదము.

వ॥ అంతబాలన చోళమహాన్నృపుండు సుభిక్షంబుగ రాజ్యపరిపాలనము చేయుచుండి శంకరాచార్య నామంబుగల తన గురువర్యునిచే దేవాలయ ప్రతిష్ఠలు చేయించుచు నంతకు పూర్వము పారిపోయిన విశ్వబ్రాహ్మణ సమూహంబును బిలిపింపనప్పుడు కొందరువచ్చి ప్రాయశ్చిత్తంబులను జరిగించుకొని తదితరులను ప్రథమశాఖవారని నిర్ణయించి వారిని బంక్తిభోజనమునకు, సంబంధమునకు, బహిష్కరించి యీ నైదు వర్ణములకు శాస్త్రీయముగ పౌరోహిత్యము చేయించుచుండిరి కనుక గురుతీర్థ ప్రసాదమర్మం బెఱింగించెదవినుము.

గురుతీర్థ ప్రసాదమర్మంబు జెప్పుట.

వేమన పద్యములు.

సీ॥ శక్తిపూజలు చేసి । చాల కుంభముపోసి
మొక్కుచుండెడివేళ । కుక్కవచ్చి
యెరుగనామల । మేడుపీసాలెత్తు
పంచిపెట్టినవాడు । పఱగశిల్పి
తనకుభాగములేక । తానుభుజించక
నున్నవాఁడుశిల్పి । యుర్విమీఁద
శిల్పినినిందింత్రు । సిగ్గింతయును లేక
దెలియజేతునిపుడు । తేటగాను

ఆ-వె॥ నాల్గువర్ణములను । నయముగానందుండి
యేకవీసమైన । లేకయున్న
దనకుభాగమంత । తరుగనిబోధించె
నరయబూర్వసంగ । తదియువేమ॥

ఆ-వె॥ కుక్కపెంటతోను । కులములుసమమాయె
నొక్కకంసలిపుడు । తక్కువెల్ల

తక్కువయనుకులమె । దైవంబుజూడరా
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా॥ రాజా మీకులగురుండనగునేను సరస్వతీపీఠంబును బూజించి. యొకదినంబున మహానైవేద్యమురాసిపోసి చెల్లించునప్పుడొక శునకమే తెంచి, యొకతావున మలమునువిసర్జించె నదినేజూచి బయలుపఱచక తీసిపారవేయించి శేషించినయన్నము నాకుదప్ప తక్కిన శిష్యవర్గములగుక్షత్రియ, వైశ్య శూద్ర, పంచములను నాల్గువర్ణంబులకొసంగిభుజింపజేసి యదినేనుభుజింప నిష్టములేకమరలవంటచేసికొనిభుజింపుచుండ నామర్మము శిష్యులుగ్రహించి తమకు మోసము సంభవించునని ముందుగానే నీవుకుక్కపీతికంచె నేడువీసములెత్తు తక్కువయను పేరుబెట్టివెళ్లినపిమ్మటమీయాజ్ఞ ప్రకారము సర్వజనులు వారికిమించిన దేవతలు లేరని గురుశిష్యన్యాయంబునటించుచుండిరి కనుకనార్షేయబ్రాహ్మణశబ్ద ఖండనమునుగూర్చి యీక్రిందవివరముగవ్రాయుచున్నాము అది యెట్లంటిరేని

## ఆర్షేయ బ్రాహ్మణశబ్ద ఖండనము

వ॥ ఈఋషివంశమును శ్రుతిస్మృతి. ప్రమాణవాక్యంబులనుబట్టి యాలోచించగ నానాజాతి మృగములయందుద్భవించిన సంకీర్ణులై యున్నారు. అట్టిసంకరజాతి వంశస్థులగు నీ బాపలకు మొట్టమొదట జీవనోపాధిలేక గ్రామయాచకులై యాచకవృత్తిచే జీవించుచుండిరి. వారలు కొన్నిదినంబులకు శంకరాచార్యుండనుప్రతినామంబుగల విశ్వరూపుని దయవలన యజ్ఞోపవీతములను, బ్రహ్మజ్ఞానమును, బొంది బ్రాహ్మణులై యున్నారు కాని జన్మతః బ్రాహ్మణులైనవారు కారు, కనుక [illegible] యార్షేయులు కొన్నిగ్రంథములయందు బ్రాహ్మణశబ్దవాచ్యులగు [illegible] బ్రాహ్మణులను సంకీర్ణసంకరులైన రథకారులని వ్రాసి వారు [illegible]బ్రాహ్మణజాతిగనుండినట్లు వ్రాసిచెప్పికొనుట కెట్లుసిగ్గులేదు? అట్లు [illegible] చెప్పుకొనినంతమాత్రమున వారిని విద్వాంసులగువారే గ్రంథప్రమాణములను బట్టి బ్రాహ్మణులుగనెంచి స్పష్టముగనెట్లు చెప్ప[illegible]రు అట్టివారిగురొభధలకు దక్కిన నాలుగు జాతులవారిలో నై బ్రాహ్మణత్వమను బొగొట్టుకొనియుండిరి. [illegible]

వృత్తిచే మధుమాంస భక్షకులై యున్నారు. మఱియు, 1814,వ సంవత్సరమున జిత్తూరుజిల్లా తీర్పు వివాహోపనయనాది కార్యంబులను గురించి పంచాంగము గుండయ్య. 1894 వ సంవత్సరమున మచిలీపట్టణమునందు గాశీవిశ్వేశ్వరస్వామి యభిషేకమును గురించి జంధ్యాల రామయ్య, 1911, వ సంవత్సరమున బల్నాడు తాలూకా జానపా గ్రామ దేవతయగు పోలేరమ్మ ప్రతిష్ఠనుగూర్చి గుంటూరు జిల్లాతీర్పు వ్యాజ్యెమున జానపాటి పట్టాభిరామశాస్త్రి, 1921, వ సంవత్సరమున శ్రుతి ధర్మసంజీవినియందు బెజవాడ కాపురస్థుడగు శ్రీ శివపురపు పాకయాజి మొదలగువారు తమకులేని బ్రాహ్మణత్వ మనుష్ఠింప బ్రయత్నించి విశ్వబ్రాహ్మణులపై జాలాక్రమపడి వ్యాజ్యెములను జరిగించి యుండిరి. తుదకా వ్యాజ్యములయొక్క తీర్మానము విశ్వబ్రాహ్మణులను వారే బ్రాహ్మణాధికారములను బొందియుండిరనియును, వారిని వారి ఋషులనుగూడా సంకరజాతి వారుగ నుండిరనియును నిర్ణయించియున్నారు. ఇదియునుంగాక బొంబాయి ప్రాంతమునందు వీరిబోటి వారనేకములగు వ్యాజ్యెములను జరిగించి ఖర్చులు నష్టపడి పరాభవమును బొందియుండిరి. ఆవిషయమునుగూర్చి వ్రాయుటకు గ్రంథము విస్తారమగునని వ్రాయక విరమించుకొంటిమి. పూర్వము దేవతా ప్రతిష్ఠలు బ్రాహ్మణులు జేసియుండిరని పట్టాభిరామశాస్త్రి సాక్ష్యమును జెప్పిన యవియన్నియు జోళరాజు విశ్వబ్రాహ్మణుల చేతను బ్రతిష్ఠలు చేయించి యుండెను గాని యీసంకరజాతివారివలన బ్రతిష్ఠలు చేయించి యుండలేదు. విశ్వబ్రాహ్మణు లిప్పటి కేడువందల సంవత్సరములకు బూర్వమందనగా 1వ శతాబ్ద ప్రారంభకాలము నాటికే గుంటూరు మండలాంతర్గతమైన పల్నాడు సీమాంతర్గతమగు మాచెర్ల గ్రామమనగా(మాధవీపట్టణము)లో నుండు చెన్నకేశవ స్వామి దేవాలయములో నాగస్తంభమున జెక్కబడియుండు శాసనమును

బరికించి సమరసబుద్ధితో జూచినయెడల యీవిశ్వబ్రాహ్మణులయొక్క స్థితిగతులను జక్కగా దెలిసికొనగలుగుదురని మానమ్మకము.

ఇట్లుండ గొన్నిదినంబుల కాపాలన చోళమహారాజు కైలాస ప్రాప్తి జెందిన పిమ్మట చతుర్వర్ణములకు సరస్వతీపీఠాధిపతులగు విశ్వ బ్రాహ్మణులు పౌరోహిత్యము గురూపదేశము వదలి స్వకులంబునకు మాత్రము జరిగించుచు నీలోకంబున బంచకృత్యంబులును, గణికము లును జేయుచుండిరి అట్టికాలంబున మరియొక శిష్యుం డాగురువును గాంచి యిట్లనియె

సరస్వతీ పీఠము విప్రులకు వశ్యమాట

క॥ భారతిపీఠము ద్విజులే
తీరున గైకొనిరి వసుమ । తీస్థలియందున్
వారల బూజించు సదా
చారమెటుల గల్గె సర్వ । జనులు నుతింపన్ ॥

తా॥ ఈసరస్వతీ పీఠము విప్రులు స్వాధీనము జేసికొనుటకు గారణమేమి స్వామీ.

తే॥ గీ॥ విశ్వకర్మలు మత్పూజ । విడచినంత
వేదశాస్త్రముల్ చదివిన । విప్రవరుల
నెవరు పూజింపకుండుట । నెరిగి భువిలో
నట్టివార వెలయింప । నధికము గను ॥

తా॥ ఓయి శిష్యా! విశ్వబ్రాహ్మణులు నన్ను పూజించుటకు శక్తిలేక పోవుటచేతను, సంకరులైన విప్రులు సమస్త వేద ధర్మశాస్త్రవిద్యాప్రవీణత కలిగి నప్పటికి వారల నెవ్వరు పూజింపకుండుటచేతను తద్వంశము బూజార్హత గలుగ జేయుటకు,

## ప్రాచీన శంకర విజయము

శ్లో॥ ఆచార్యో శంకరోనామ, త్వష్టృపుత్రోన సంశయః ।
విప్రకుల గురుర్దీక్షు, విశ్వకర్మంతు బ్రాహ్మణః ॥

తా॥ విరాడ్విశ్వకర్మకు దృతీయపుత్రుండైన త్వష్టబ్రహ్మర్షికి యతనిభార్య యగు నిచ్ఛాశక్తికి ద్వితీయ పుత్రుండు నగు భద్రదత్త మహర్షికి యతని కులసతి యగు నీలవేణికి జ్యేష్టపుత్రుండై జన్మించిన త్వష్టబ్రహర్షికి విభాషకు గల్గిన ద్వితీయ పుత్రుం డనబరగిన విశ్వరూపుఁడను (అనగా నహభూన మహర్షికి) బౌత్రుండనై నేను శంకరాచార్య ప్రతినామంబుగల్గి వారిలో బ్రవేశించి కులగురువుగానుండి యజ్ఞోపవీతా ద్యధికారంబుల నొసంగి తుదకు నాయొక్క త్వష్టశృంగేరి పీఠము వుష్పగిరియందుండు వారిస్వాధీనముజేసి యాపీఠమునందు దపోనిష్ఠాగరిష్ఠుండనై వారివలన నేను బూజింపబడుచుంటి కావున నది మొదలుకొని వారు దేశగురుపీఠస్థులై శంకరాచార్య స్వాములవారను నామంబుచే యేనగులు, గఱ్ఱములు, పరివారము మొదలగు డాంబిక వేషంబులతో నందరిని భ్రమింపజేసి గృహస్థులవలెనే తమదేహ సంరక్షణకు ద్రవ్యాపేక్షకులై భూసంచారము చేయుచుండిరి కాని యిది కేవలము కైవల్య ప్రాప్తిసాధన యోగముకాదు అందువలన వారల ప్రసాదము స్వీకరించువారు ప్రాయశ్చిత్తము చేసికొనవలయునని మార్కండేయాది మహామునులు ధర్మశాస్త్రములయందు జెప్పియుండిరి గనుక సన్యాసి లక్షణం బెరింగించెద వినుము.

## ముండకోపనిషత్

శ్రుతి॥ వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః సన్యాసయోగాద్యతయః శుద్ధ
సత్వాః । తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః పరి
ముచ్చంతి సర్వేః ॥

తా॥ అనగా వేదమంత్రములయొక్క సత్యార్థజ్ఞానమందును, ఆచారమందును బాగుగ నిశ్చితమగు సన్యాసయోగముచే శుద్ధాంతఃకరణులైన సన్యాసులు ముక్తిసుఖమును బొందుదురని ముఖ్యతాత్పర్యము నదియునుగాక,

## ధర్మశాస్త్రము

శ్లో॥ అధ్యాత్మ రతిరాసీనో నిరపేక్షో నిరామిషః ।
ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ ॥

తా॥ ఆత్మ పరమాత్మలయందు స్థిరపరుడై సర్వాపేక్ష రహితుండై, మధ్య మాంసాది వర్జితుండై, ఆత్మయొక్క సహాయముచేతనే యీలోకమందు ధర్మ వృద్ధికొఱకై యుపదేశము చేయుచు సంచరించుచుండ వలయును. గావున నీసంకరులగు విప్రులు బ్రాహ్మణాది యైదు వర్ణములకు నష్టాదశవర్ణములుగా నిర్ణయించి యందు క్షత్రియ వైశ్య శూద్ర జనంబులకు మాత్రము పురాణోక్తముగ పౌరోహిత్యము చేయుచు బ్రతుకుచుండిరి శిష్యా.

## వీరబ్రహ్మంగారి జననము

క॥ వీరబ్రహ్మము జననము
సారసముగ దచ్చరిత్ర । సాంగమువరకున్
ధీరాగ్రేసర నాకును
గారుణ్యముదోడ దెల్ప । గదవేయింకన్ ॥

తా॥ శ్రీమద్విరాట్పోతులూరి వీరగురు పరబ్రహ్మేంద్ర స్వాములవారి జననంబు దెల్పుము స్వామీ.

## చాటుపద్య మణిమంజరి

వ॥ ఇప్పటికి 133 వ సంవత్సరమునుంచి గోలకొండ నవాబు వంశపరంపరలు రాజ్య మేలుచుండిరి. వారిలో మల్కిభరాంపాదుషా సిద్ధపట్టణము సుభిక్షంబుగ రాజ్యమేలు కాలంబున గండుకూరి తాలూకాలోని జింతలపాలెం పురవాస్తవ్యుండును విశ్వబ్రాహ్మణుండును నగు బ్రహ్మశ్రీ కందుకూరి రుద్రకవిగారికి క్రీస్తుశకము 1480వ సంవత్సరమున జింతలపాలె మను నగ్రహారమొసంగి బిమ్మట క్రీస్తుశకము 1550 సంవత్సరములవరకు రాజ్యమేలి యంతరించెను. అంత

నీవంశతిలకుఁడు రాజ్యము పరిపాలించు కాలంబునకు గలియుగారంభము (4544) వ వత్సరమునకు సరియైన క్రీస్తుశకము, 1445వ వత్సరమునకు దువ్వూరివారను విశ్వకర్మ వంశంబున వీరబ్రహ్మముగారు జన్మించి పోతులూరను గ్రామంబునజేరి యందు గొన్నిదినములు తపస్సు చేయుటవలన బోతులూరి వీరబ్రహ్మముగారను నామంబు గలిగియుండెను. పిమ్మట నల్లాడుపల్లె వీరభద్రునిగూర్చి తపస్సు చేసి నందున బ్రసన్నుండై యది మొదలు శ్రీమద్విరాడ్పోతులూరి వీర గురుపరబ్రహ్మేంద్ర స్వాముల వారను పేరు గల్గియుండి తనభక్తుండైన దూదేకుల సిద్దప్పను వెంటబెట్టుకొని శ్రుతిహితముగ వేదవాక్యములను బోధించుచు బుష్పగిరి యగ్రహారపువీధిని వచ్చుచుండగ నందలి సంకరులగు వైదికులు సిద్దప్పనుగాంచి మీరెవ్వరని యడిగినందున నతండు మేము ప్రణవస్వరూపులైన విశ్వబ్రాహ్మణులమని చెప్పినంత వారలు మీగురువులయిన విశ్వబ్రహ్మలకే వేదాధికారము లేదుగనుక నీవు తురకవాడవై యుండి మాసరిహద్దులోపల వేదము పఠించుట కేలాటి యధికారము లేదని వెళ్ళనీయక యాటంకపఱచిరి. అంతట సిద్దప్ప యొక వృత్తాంతం బెఱింగించియుండె నది యెట్లనిన.

ఆ॥ వె॥ తల్లియూర్వశి లంజ । తనయాలు మాదిగ
తాను బ్రాహ్మఁడనగ । దగునె జగతి
వసిష్టకులమని । వసుధలో నెఱుఁగరా
విశ్వదాభిరామ । వినుర వేమ ॥

ఆ॥ వె॥ మాలకులమునబుట్టి । మాలల దూషింప
ద్విజులకేల యిట్టి । దొంగతనము
ఆదిబుట్టినవాని । నరసితాజూడరా
విశ్వదాభిరామ । వినుర వేమ ॥

శ్లో॥ జన్మనాజాయతే శూద్రః । కర్మణాజాయతేద్విజః।
వేదపాఠేన విప్రస్స్యాత్ । బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః॥

తా॥ మీరు వసిష్ఠసాంప్రదాయకులైయుండి జన్మకాలమందే శూద్రత్వముగలిగి యుపనయనాదికర్మల వలన ద్విజులనిపించు కొంటిరి తదుపరి వేదపఠనచేత విప్రుల నిపించుకొంటిరి కనుక మరియు నెరింగించెద వినుము.

శిల్పశాస్త్రము

శ్లో॥ విశ్వకర్మకులేజాతా । గర్భబ్రాహ్మణనిశ్చితాః।
శూద్రత్వం నాస్తితద్భజే । స్వయంభూవిశ్వకర్మణః॥

తా॥ విశ్వకర్మకులమునందుద్భవించిన వారలకు గర్భమందే బ్రాహ్మణత్వము గల్గియున్నదికాని శూద్రత్వములేదు. అందుచే స్వయముగానుద్భవించిన విశ్వకర్మ యొక్క జాతమైయుండె గనుక నది మీరు బ్రహ్మజ్ఞానమువలన దెలిసికొనలేక మమ్ముల దిరస్కరించితిరని చెప్పి యుండె నంత వారలు గుమిగూడివచ్చి రాళ్ళుతీసికొని పైకి రువ్విరి అది బ్రహ్మముగారు చూచి కోపముచే నాకాశము దిక్కుజూచి తన యిష్టదేవతా ప్రార్థనచేసి శపించినందున నగ్రహారము చీకటులు గమ్మి కాలిభస్మమైపోయిన నగ్రహారీకులందరు భయపడివచ్చి స్వామీ మీమహిమ మాకుం దెలియక తప్పుజేసితిమి క్షమించుమని పాదములపైబడి ప్రలాపించినంగని యిట్లనియె.

విశ్వకర్మశాస్త్రము

శ్లో॥ విశ్వకర్మకులం నిందా । యఃకుర్యాజ్ఞ స్మపాతకీ
సూకరోబహుజన్మాని । శివవాక్యంనసంశయః॥

తా॥ విశ్వకర్మకులమును నిందించిన పాపాత్ముండు పందిరూపమై యనేక జన్మములెత్తునని యీశ్వరుండు చెప్పియుండె గనుక మీరు మమ్ములనిందించి సర్వము గోలుపోయి నన్నుమీరు వచ్చి ప్రార్థించినందున మన్నించితిని. అనినవారలు ప్రమదంబున బ్రహ్మరథమును దెప్పించి యందుస్వాములవారిని గూర్చుండబెట్టి వారలిరుప్రక్కల స్వస్తిచెప్పుచు నూరేగింపుచేసి యాస్వామివారిని దీసికొనిపోయి సిద్ధపట్టణంబున నవాబుగారి మందిరంబున బ్రవేశపెట్టి వారలు పుష్పగిరికేగి సుఖంబుననుం

డిరి. కనుక నదిమొదలు శ్రీబ్రహ్మేంద్రస్వాముల వారు పుత్రపౌత్రాభివృద్ధిచే భూ
మియందు నూటయేబది వత్సరంబులు తపోనిష్ఠతో నుండి కలియుగము, 4694, వ
సంవత్సరమునకు సరియగు క్రీస్తుశకము, 1694 వ సంవత్సరమున నిర్వికల్పస
మాధిం జెందియుండెను గనుక నుపవాస ఫలంబెఱింగించెద వినుము.

ఆ॥ వె॥ స్నానమొనరజేసి । సద్ధర్మమీయక
నీళ్ళమునుగదగునె । నేర్పులేక
నీళ్ళయందుగోడి । నెలవుగామున గదా
విశ్వదాభిరామ । వినుర వేమ॥

ఆ॥ వె॥ ఒక్కపొద్దులున్న । నూరపందై పుట్టు
దపసియైన బీద । తనముగలుగు
శిలలకు దన్నమొక్క । జీవమడిగెబొమ్మ
విశ్వదాభిరామ । వినుర వేమ॥

ఆ॥ వె॥ కూడుబెట్టకున్న । కుక్షిలో ప్రాణంబు
భక్షణంబుజేయు । గుక్షిమలము
కూడు విడచువాడు గుణహీనుడగుగాక
విశ్వదాభిరామ । వినుర వేమ॥

తా॥ అతిథియభాగ్యతులకు ధర్మంబు లీదక స్నానంబు జేసి యొక్కపొద్దు
లుండువాడు తనయాత్మయందుండు పరమాత్మకు మల మూత్రములు భుజింపజేయును
గనుక నతండా మలమును భుజించపందియై జనించును. మఱియు నీళ్ళయందెల్ల
ప్పుడు నివసించియుండు నీరుకోడి కేమాత్రము ముక్తిసంభవించ యుండెనోయంతి
యేయని తాత్పర్యము గనుక దేవయజ్ఞఫలము చెప్పెద వినుడు.

దేవయజ్ఞ ఫలితము.

ఆ॥ వె॥ అలిరంకు దెలుప । నఖిలయజ్ఞంబులు
తల్లిరంకు దెలుప । దద్దినములు

గాక తెలియ గర్మ । కాండకల్పితమాయ
విశ్వదాభిరామ । వినురవేమ॥

ఆ॥ వె॥ సోమయాజిననుచు । సొంపువేషముదాల్చి
గట్టి మాంసమెల్ల । దాల్చితినును
ద్విజుఁడ నేనటంచు । ధిక్కరింపుచునుండు
విశ్వదాభిరామ । వినురవేమ॥

ఆ॥ వె॥ సోమయాజిననుచు । సొంపైన శాలువల్
మకరకుండలములు । మనసుదీర
తనువునందుదాల్చి । తరుచుగా దిరిగేరు
విశ్వదాభిరామ । వినురవేమ॥

ఆ॥ వె॥ పేరు సోమయాజి । పెనుసింహాంబలుఁడయా
మేకపోతుబట్టి మెడలు విరుచు
గాక క్రతువుజేయ । గల్గునా మోక్షంబు
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా॥ సోమయాజి యనుపేరుబెట్టుకొని యాగములు చేయునప్పుడు మేకలను బట్టి తనతపోబలముచేత జంపలేక శరీరబలముచేతజంపుచుండె నట్టివాడు మోక్షంబును బొందక నరకప్రాప్తుండగును గనుక మరియు బెరింగించెద వినుము.

ఆ॥ వె॥ జీవిజీవిజంపి । జీవికి వేయుగ
జీవివలననేమి । చిక్కుఫలము
జీవహింసకులకు । జిక్కునా మోక్షంబు
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా॥ మనుష్యుఁడు గోవులను, మేకలను, బట్టి యాగమునందు జంపియితరులకు బెట్టుచుండె నాజీవులు నీయాగముచేయువాని కేమికీడొనరించియుండెఁ నిట్లుజీవులను హింసించువారలకు జీవన్ముక్తిగలుగక నరకమే సిద్ధించును గనుక మరియు.

ఆ॥ వె॥ క్రతువు జేసెదమని । కడువిజ్ఞులగుచు
రంకులాడితోడ । రతియొనర్పు
రంకు కొడుకు నెటుల । రంగాన మెత్తురో
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా॥ ఇవ్విధంబున బ్రాహ్మణులు పౌండరీకము మొదలగునను స్తయజ్ఞములను జేయుట విధవస్త్రీల సంభోగమునిమిత్తమేకాని తమజన్మ తరించుటకుగాదు కనుకలింగ ధారణ ఫలంబునెరింగించెదవినుము.

లింగధారణఫలము.

ఆ॥ వె॥ అంగమందులింగ । మతిశయంబుగగట్టి
లింగమందు నిలుప । లేరు భక్తి
దొంగగొడ్డు మెడను । దుంగగట్టినరీతి
విశ్వదాభిరామ । వినురవేమ॥

ఆ॥ వె॥ పట్టుగుడ్డజుట్టి । బంధించిమెడగట్ట
లింగమెవ్వరింట । దొంగలించె
నాత్మలోనిలింగ । మానందమొంగక
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా॥ తనలో దానై వెలుంగుచున్న బరమాత్మని గురునివలనదెలిసికొనలేక దొంగపశువు మెడను గుదికొయ్య కట్టినట్లుగా గర్వకరాజు ప్రభుత్వమునందేర్పడిన లింగముగట్టుకొని తిరుగుదురేకాని యందున మోక్షము సిద్ధింపనేరదు కనుక నింక జెప్పెద వినుము.

ఆ॥ వె॥ అంగముతాళ్ళుదెచ్చి । యధిక గుళ్ళనుగట్టి
యందునొక్కరాయి । నడుమనుంచి
దేవుడనియు జెప్పె । భూవలయంబున
విశ్వదాభిరామ । వినురవేమ॥

తా॥ ఒకానొక ధర్మకర్త కొండరాళ్ల దెచ్చి దేవాలయమును గట్టించిన పిమ్మట

శ్లో॥ అథ దేవయజ సంకీర్తియాసంఖ్యా । ఆచార్యవరుణశిల్పి సమాన
మేకం శిలాసంగ్రహణం ద్వితీయం। బలిదానహోమంచతృతీయకం ॥

తా॥ శిల్పి బ్రహ్మచే నిర్మింపబడిన దేవతా విగ్రహమును ప్రతిష్ఠ చేయు కాలమున నా విగ్రహమును సృజించిన శిల్పిబ్రహ్మను సంతుష్టి పఱచి శిలాస్థాపనం చేసిన నిదియే దేవతా స్వరూపము గనుక మరియు నెఱింగించెద వినుము.

ఆ॥ వె॥ దేవతార్చనలందు । దేవాలయములందు
దేవుఁడనుచు మ్రొక్క । దెఱవుజూపె
దెలియ విశ్వకర్మ । దేవాదిదేవుండు
విశ్వదాభిరామ । వినురవేమ ॥

తా॥ ఈప్రకారంబున విశ్వకర్మ మ్రొక్కుచుండ వలయునని జనులకొక భక్తిమార్గంబు జూపించియుండెగనుక మరియు నెఱింగించెద వినుము.

శిల్పశాస్త్రము

శ్లో॥ మాతాశిల్పిపితాశాస్త్రం । అరూపంరూపమానసం
యయాత్పిండోద్భవంచైవ । దయాత్రిపితృకర్మథా ॥

తా॥ విగ్రహములకు శిల్పి తల్లి యనియును, శాస్త్రము తండ్రియనియును, జెప్పియుండుటచే.

శ్లో॥ ప్రథమం శిల్పినం చైవ । దాతారంచద్వితీయకం ।
తృతీయం దైవమిత్యాహు । ర్నమస్కారవిధింబుధాః ॥

తా॥ ఆలయములోనికివెళ్ళి దేవునికి నమస్కరించినప్పుడు మొదటి నమస్కారము శిల్పిబ్రహ్మకు, రెండవ నమస్కారమాలయాధిపతికి, మూడవ నమస్కారము, విగ్రహమునకు జెల్లుచుండెనని చెప్పబడినందున నాలయములోనికి బోయినప్పుడు ముమ్మారు నమస్కరింపవలయును గనుక విప్రులు విశ్వబ్రాహ్మ

ణుల ప్రసాదము భుజింవగూడదని చెప్పుటచేతనే యెవ్వరుభోజనము చేయకుండిరి. కనుక నీసంకర బ్రాహ్మణుల యిండ్లయందు తెలియనివారు భోజనము చేసినప్పటికి బూర్డముగా వారి వంశము తెలిసిన గుంజవారు, పససవారు, రసష్త్రులు, బొందిలి వారు, పట్టుసూలువారు, సాతానులు, దేవాంగులు, లింగబలిజలు, లాలావారు, కన్న ములు, దొక్కలవాండ్రు మొదలైన జాతులు భోజనము చేయుట యభ్యాసములేదు కనుక మరియు నెరింగించెద వినుము.

విశ్వబ్రాహ్మణుల యన్నము ప్రజలు తినుట

ఆ॥ వె॥ విశ్వకర్మబిడ్డ । లిలలోన దేవుళ్ళు
కానక తిరుగుచురు । కష్టజనులు
అతనిబిడ్డలెంగి । లందఱు తిన్నారు
విశ్వదాభిరామ । వినుర వేమ ॥

తా॥ దేవాలయములందుండు దేవతలందఱు విశ్వకర్మబిడ్డలై యుండిరి. ఇట్టి దేవతల కెల్లరు మహానైవేద్యము చెల్లించి యా యెంగిలి యన్నము ప్రసాదమని భుజించుచుండిరి. కనుక వారు ప్రాయశ్చిత్తము చేసికొనలేదుగదా ? అట్టివారలభక్తిని గూర్చి చెప్పెద వినుము.

జనుల భక్తి.

ఆ॥ వె॥ గట్టురాళ్ళుదెచ్చి । కాళ్ళచేతుల ద్రొక్కి
కాసె మొలలచేత । ఘాతజేసి
మొరపరాళ్ళకేగి । మ్రొక్కిన నేముండు
విశ్వదాభిరామ । వినుర వేమ ॥

తా॥ అందటి దేహములందు వెలిగే పరమాత్మ విశ్వకర్మ రూపమైయుండే గనుక నట్టి గురుని దూషించి యతండు కాళ్ళచేతుల ద్రొక్కి నిర్మించి దేవాలయములందు బ్రతిష్ఠించిన శిలలకు మ్రొక్కిన మాత్రమువనే వారలకేమి ముక్తి గలదు. కనుక గుడి పూజారి జననం బెరింగించెద వినుము.

### పూజారి జననము.

ఆ॥ వె॥ తేజమలరదాను । దేవళంబునుగట్టి
తలుపు దేవళంబు । నాల్గినొంది
కుంచెకోలొసఁగిన । గురుడని తెలియరా
విశ్వదాభిరామ । వినుర వేమ ॥

తా॥ ఆంధ్రదీపికయందు జెప్పబడిన రీతిగ బ్రాహ్మణుఁడు క్షత్రియ స్త్రీని రాక్షస వివాహము జేసికొని దానియందుగాంచిన సంతానము నంబికలమైయుండెను. వారు కూలికి విష్ణువును బూజించువారలై యుండిరి. మరియు బ్రాహ్మణ విధవ స్త్రీయందు బ్రాహ్మణునికి దొంగతనము వలన బుట్టినవారు యాగమాదులు చదివి శివార్చకులై యుండిరి కావున విశ్వకర్మ దేవాలయమును నిర్మించి గురుమద్రియగు కుంచెలకోల యొసంగి వీరలిరువురకు జీవనోపాయ మేర్పరచియుండ నట్టి గురుని దిరస్కరించుట వీరికి సద్వృత్తి గాబోలు ?

### విశ్వబ్రాహ్మణుల కరిణీకములు

క॥ సురవిప్రుల కరిణీకము
లరయగ నార్వేయగణము । హరియించినయా
కరణీక్ దెల్పుము దాచక
గురువర సేవిని గ్రహింతు । గోరికదీరన్ ॥

తా॥ ఆంధ్రదేశమున విశ్వబ్రాహ్మణ కరిణీకము లార్వేయు లవహరించిన కారణంబేమి ?

### కరిణీకోద్ధారిణి

శ్లో॥ శ్రీమాన్ గణపతిర్భూపో । గజపత్యస్వయోద్భవః
అస్తి భూమండఃలే తస్య । బహవస్సంతి మంత్రిణః
గోపరాజాస్వయోనామ । రామాభోగ్యగణకాగ్రణీః
గణకానాంచహితార్థాయ । సర్వసంస్థాపనాయచ
యావచ్ఛశిమార్తాండం । తాపతాం వేలిసర్థయుత్

గోత్రిశాస్త్రింబరేందూనాం । సంఖ్యాబ్దే శాలివాహనే
రక్తాక్షి భాద్రదర్శేచ । వారార్కగ్రహణేపిచ
తేనరాజ్ఞాగ్రహీద్దానం । కృష్ణవేణీతటేతథా
గ్రామస్థావరవృత్తీనాం । సాక్షిణ్యాస్సర్వదేవతా
అయంధర్మాభివేయేన । చాక్షేపస్తుదురాత్మనా
షష్టివర్షసహస్రాణి । జాయతేఖరయోనిషు ॥

తా॥ అనగా గజపతి వంశోద్భవుఁడగు గణపతి దేవరాయలు పెక్కు మంత్రులఁగూడి భూపరిపాలన మొనర్చుచుండ నందు గణకశ్రేష్ఠుఁ డగు గోపరాజురామ ప్రధానుఁడు శాలివాహనశకము 1067, (పదివందలరువదియేడగు) రక్తాక్షిసంవత్సరభాద్రపద బహుళఅమావాస్యభానువార సూర్యోపరాగసమయమున రాజుచే గ్రామస్థావరవృత్తులు (కరిణీకములు) దానములనుగ్రహించి గణకుల కుపయోగ మొనర్చినట్లు తెలియుచున్నది. ఆదియెద్దియనిన బూర్వమిప్పటి గుంటూరుమండలము లోని పొన్నూరు కాపురస్థుఁ డొకవిశ్వబ్రాహ్మణుండా గ్రామకరిణీకముచేయుచుండ నందొక్కద్విజుండు దొరతనమువారి శిస్తుకొంతకు జిక్కక మిక్కిలితిప్పలు పెట్టుచుండె, నట్టియెడ గోపరాజు రామయమంత్రి తీర్థయాత్రాపరాయణుండై దేశాటన మొనర్చుచు నొకరోజున పొన్నూరునందలి భావనారాయణస్వామి దర్శనార్థ మేగుదెంచి పుణ్యస్థలమగుటచేత బితృశ్రాద్ధమచ్చటనే నివర్తింపదలంచి యావిప్రుని బ్రాహ్మణార్థముంచిననానాటిమధ్యాహ్నము దైవవశంబున నతండు కరణముచే నిర్బంధితుఁ డయ్యె. నప్పుడామంత్రి భోజనానంతరముననీవిప్రుని నొప్పగించెదనని చెప్పినను విడువకున్న నాద్రవ్యమిచ్చియతనిని విడిపించుకొని తననైమిత్తిక కార్యమును నెరవేర్చుకొని యప్పటినుంచి కరణముపై గసిపట్టియుండి స్వస్థలమున కేగెనట కొన్నిదినంబుల కొకసూర్యోపరాగకాలమందు గృష్ణానదియందుస్నానముచేయ నీనృపాలుఁడేతెంచిన బ్రతిగృహీతలెవ్వరినిరాకుండ జేసి తాను వైదిక వేషముతో యాదృచ్ఛికముగా గన్పడి యారాజువలన గొన్నిదానములు గైకొని పిదప ఏడుఘడియలు మొహరుంగరమిచ్చునట్లుసెలవు దెచ్చుకొని యానృపాలుండేలు గ్రామంబులకన్నిటికి దత్కులమువారగు నియోగులు కరణములుగా నుండునటు లుత్తరువులు బుట్టించెనంత బ్రభువు యేడు ఘడియలుకాగానే తన

శిఖా మొహరు గైకొని యదిచూచుకొని చాలాచింతించి దాన మొసంగిన వస్తువును బరిగ్రహింప గూడదని యూరకుండె. నప్పుడా రామయమంత్రి యెవ్వరు తననాక్షేపించునో యట్టి దుర్మార్గుం డరువదివేల సంవత్సరములు గార్ధభయోని యందుద్భవించునని చెప్పియుండినను నప్పుడే యీవార్త యెల్లరకును దెలసియేయున్నది. కనుక నప్పుడు మిగిలిన గ్రామంబులు నెల్లూరు జిల్లా పొదిలె తాలూకాలోని వెంకటగిరి సంస్థానములోఁజేరిన 1) బచ్చలకూరపాడు, 2) పెదారెకట్ల 3) చిన్నారెకట్ల, 4) గుట్టకట్టునాయునిపేట, 5) ఇసలగుండము 6) చినమనగుండము మొదలగు గొన్నిగ్రామములయందును, ఆత్మకూరు తాలూకాలో గొన్నిగ్రామములయందును విశ్వబ్రాహ్మణులు కరిణీకములు చేయుచుండిరి. అందు బచ్చలకూరపాటి కాపురస్థుఁ డగు కొప్పోలు మాచయభక్తుని ప్రభావం బెరిఁగి చెద వినుము.

## కొప్పోలు మాచయభక్తుని ప్రభావము.

వ॥ ఇట్లుండ గణపతిదేవరాయలు కొన్నిదినంబుల కంతరించిన పిమ్మట గోలకొండ నవాబు రాజ్యపరిపాలనము చేయుచుండె. నాకాలంబున బదిరెండువత్సరంబుల కొకతూరి జమాబందిచేయుచుండువారు. జమాబంది కెళ్ళినవారు సుమారు కొన్నిసంవత్సరము లచ్చటనేయుండి యొకదినంబున ప్రభువు దర్శనముఁజేసుకొను నాచారముగలదు. అప్పుడీ కరణము కొంతకాల మచ్చటనివసించి హుజూరువద్ద లెక్కలనువిమర్శించుతరి నొక్కసారి చిట్టా కవిలెపుస్తకమునుమరచి బసకుజేరుచుండగా హుజూరు పుస్తకమునుజూచి దాచి మాచయ భక్తుని మరల బిలపించగా నతఁడు పొరపాటుఁదెలసికొని వీధిలో నొకయలేఖ్య పుస్తకమును గొని హుజూరువద్దకుజేరె. నాహుజూ రామాచయభక్తునిజూచి చిట్టా దెచ్చితివా? యని యడుగ దెచ్చినానని తనయొద్దనున్న యలిఖిత పుస్తకమునువిప్పి చదువ నారంభించెను. అంత హుజూరు రహస్యముగ మరచినపుస్తకమును విప్పి చూడదొడంగె. వ్రాయని పుస్తకమును జూచి మాచయభక్తుఁడు చదువుచు నొక్కచోట తెప్పపాటు కాల మాగెను. అందుకు గారణమేమని ప్రభువడుగ నిక్కడనొకపంక్తి కొట్టి

వేసియున్నదని చెప్పెను మొదట పుస్తకమునం దట్లే కొట్టివేసి యున్నది. అప్పుడా ప్రభువు మాచయభక్తుని చేతి పుస్తకమునుగైకొని పరిశీలింపగా నేమియు వ్రాయని శూన్యగ్రంథముగా గన్పడినందున మెచ్చుకొని వారికి బెక్కు బహుమతులను, మాచాభక్తునివారను బిరుదమును నొసంగియుండె నదిమొదలు మాచాభక్తునివారను గృహనామంబు గలిగియుందురు కరణీకములు చేయుచుండిరి. అందలి సుమారు 110వత్సరముల క్రిందట 1) మాచాభక్తుని అంబయ్య, 2) పెదవీరయ్య 3) చినవీరయ్య, 4) నాగభూషణము, 5) కోటయ్య, 6) పెదగురవయ్య 7) చినగురవయ్య మొదలగువారు దైవోపాసకులై కరిణీకములు చేయుచుండ నా ప్రభువు వారి మంత్రశాస్త్రప్రభావముచూడ వేడుకచే నొకదినంబున గరిణీకములు భర్తరఫు చేసితినని తాకీదులు బంపియుండె. నదిచూచి వారు ప్రతిజ్ఞచే వ్యాఘ్రంబుల నిర్మించుకొని వెంటబెట్టుకొని ప్రభువు చెంతకు దీసుకొని పోయిరి. అంత ప్రభువుజూచి భయముచే మీకరిణీకములు, మీకే స్థిరపరచితినని యాజ్ఞ యొసంగె. నిట్లుండ గొన్నాళ్ళకు మాచాభక్తుని అంబయ్య బచ్చుకూరపాటియందు రామలింగేశ్వర దేవాలయంబును, గెల్లంపల్లి వీరయ్యగారు తన గ్రామమగు కెల్లంపల్లె యందొక శివాలయమును గట్టించి తనమంత్రశాస్త్ర ప్రభావమువలన నచ్చటి వెంకటగిరి సంస్థానాధిపుల మెప్పించి దేవాలయములకు జాలా భూములు సంపాదించియుండిరి. కనుక వారి పరంపరులు కూడా యిప్పటికి లోకప్రసిద్ధి గడించి కరిణీకములు చేయుచుండిరి.

## ఫలస్తుతి

శ్లో॥ నమస్తే విశ్వరూపాయ । విశ్వబీజాయ తేనమః ।
నమోవిశ్వాత్మభూతాత్మ । విశ్వకర్మన్నమోస్తుతే ॥

తా॥ విశ్వరూపమైనవాడును, విశ్వబీజమున కుత్పత్తికారణమైన వాడును, విశ్వధూతాత్మయైనవాడును, నగు విశ్వకర్మకు నమస్కారము.

## గద్య

ఇతి శ్రీ వీరాఖ్యునార్య కరుణాకటాక్షలబ్ధ కవితాలక్షణుడౌ విశ్వకర్మ
పాంచానన భువనసగోత్రి పవిత్ర చెరుకూరి వంశాబ్ధి సోమ
చలమయ్య పుత్రరత్న వినుతనే శివరామయోగి ప్రణీతంబైన
శ్రీవీరబ్రహ్మాండ సర్వశాస్త్ర సమాధానవ్యత్యయ నిత్య
రత్నాకరమనె కృతినుండి పరిమళచోళ చరిత్రము
పంచమాశ్వాసము సంపూర్ణము.

ఓం తత్సత్

బ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ